శ్రీరస్తు

పరమహంసాయధీమహి

# వేదాన్తపదపరిజ్ఞానము

(A Glossary suggesting the applications to the theories)



'చిత్కళాతపస్వి'

Dr. L. విజయగోపాల రావు L I M (Madras)

R. L. Peta TENALI – 522 201 (A. P.)
D. No. 21-5-10.

మూల్యము : రు. 12-00

---

*This book is published with the financial assistance of Tirumala Tirupati Devastanams under their scheme "Aid to publish religious Books".*

మణి మాణిక్య గ్రంథమాల, తెనాలి (AP)
ఆరవ మణి



మొదటి ముద్రణ : *2-8-90*

ప్రతులు : *1000*

మూల్యము : *12/-*

ఈ రచయిత యొక్క ఇతర గ్రంథములు :

1. స్వీయ మాన సోల్లాసము (శ్రీ దక్షిణామూర్తి స్తోత్రవ్యాఖ్య)
2. విజయగోపాలము (గీతయందలి అంతరంగిక బోధలవివరణ)
   *Revelation of the esoteric teachings, with a chapter on the tenets of dilectical materialism.*
3. ద్వాదశ మణి మంజరి *The twelve fundamentals in Indian Philosophy.*
4. వివర్తవాద వివేకము
5. ఆత్మతత్త్వ వివేకము : జాతీశ్వర, నియతీశ్వర ధోరణుల వివరణ

ఈ గ్రంథ ముద్రణ :
*మెట్రో ప్రింటర్స్, తెనాలి.*

# విషయసూచిక

# గ్రంథము - గ్రంథకర్త

Dr. S. రమేశబాబు *M.A.,* వైద్యాచార్య, విజయవాడ-1

**మనసు గలవాడు మనిషి !**

ఈ మనసు పూరికే వుండక ఎప్పుడూ ఆలోచన చేస్తూ వుంటుంది. ఆలోచన చేసే మనిషిని బట్టి దాని తీరు, స్థాయి వుంటాయి. 'ఆలోచన మేవ తపః' అని 'గణపతి ముని' అన్నారు. ఈ ఆలోచన, ఏది ధర్మమో ఏది అధర్మమో చెప్పేవరకు వెళ్లింది. వ్యక్తి ధర్మాన్ని, సామాజిక ధర్మాన్ని నిర్దేశించింది. ధర్మావలంబనకు సూత్రాలను రూపొందించడంలో తాత్వికులు చాలా దూరం వెళ్ళారు.

సత్యాన్వేషణలో, సమాజ నిర్మాణంలో తాత్వికులు చేసిన కృషి వల్ల విభిన్న ధోరణులు - సిద్ధాంతాలు రూపుదిద్దుకున్నాయి. ఈ ఆలోచనా ధారలు స్రవంతులై ప్రవహించాయి. ఈ జ్ఞానగంగ నుండి భిన్న దృక్పథాలు 'మతము' ల పేరిట విలసిల్లినా: భారతీయ ధర్మం ఆధారంగానే ప్రాచుర్యాన్ని పొందాయి. ఈ ధోరణి భారతీయ తాత్విక చింతన వైశిష్ట్యాన్ని నిరూపించింది. నిర్వచనానికి అతీతంగా ప్రవేశ్లానిపోయిన యీ హైందవ ధర్మం యొక్క లక్షణం ఎలా ఉంటుందో యిటీవలి కాలంలో క్లుప్తంగా, చక్కగా ప్రవచించారు లోకమాన్య తిలక్.

> *"ప్రామాణ్యం బుద్ధి ర్వేదేషు సాధనానా మనేకతా ।*
> *ఉపాస్యానా మనియమ ఏతద్ధర్మస్య లక్షణమ్" ॥*

(వేదములందు విశ్వాసం, సాధన మార్గములు అనేకం, ఆరాధనా విధానంలో ప్రత్యేక నియమాలు లేకపోవడం, యిదే హైందవ ధర్మ లక్షణం.)

ఈ హైందవ ధర్మాన్ని ఆలంబనంగా చేసుకొని యీ దేశంలో అనేక మతాలు వికసించాయి. తత్వజ్ఞానం, ఆచార వ్యవహారాలు యీ రెండింటి యొక్క సరసమైన సమ్మేళనం రూపొందినపుడే మతం, మనిషి జీవన వికాసానికి తోడ్పడుతుంది. నిజమైన మతం ఓటమిని ఎరుగదు. తత్వజ్ఞానానికే పరిమితమై ఆచార వ్యవహారాలలో అందరి మన్ననలను పొందలేని మతం నిరాదరణకు గురి అవుతుంది. తత్వజ్ఞాన శూన్యమై, మూఢాచారాలకు పెట్టు అయిన మతం వైషమ్యానికి, అశాంతికి దారి తీస్తుంది.

భారతీయ తత్వచింతనకు 'సర్వే సంతుసుఖినః' అనే మంత్రం ప్రాథమిక సూత్రం. మనిషిని ఆలోచనాపరుడుగా - 'మనీషి' గా చేయడం, మనిషిలోని దైవాంశను ప్రదీప్తంచేసి జ్ఞానిగా రూపొందించడం యీ హైందవభూమి ఆదర్శం.

ఇంతటి మహోత్కృష్ట సంస్కృతిని కలిగిన భారతజాతి అనేక చారిత్రక కారణాల వలన స్వాతంత్ర్యాన్ని కోల్పోయింది. రాజకీయంగా, సాంఘికంగా అత్యున్నత స్థానం నుండి దిగజారింది. తిరిగి సాంఘిక, సాంస్కృతిక పునరుజ్జీవనానికి అవిరళకృషి జరుగుతున్నది.

"కృణ్వంతో విశ్వమార్యమ్" అని నినదించిన జాతి మనది. ప్రపంచ ప్రజానీకాన్ని ఆర్యులుగా (ఉత్తమ మానవులుగా)

రూపొందించడం సంగతి అటుంచి, అసలు మనమిప్పుడు ఏ స్థాయిలో వున్నామో ఆత్మ విమర్శ చేసుకొని, ఎదగవలసి వుంది. లక్ష్యసాధనకు సన్నద్ధులం కావలసి వుంది. ఇందుకు భారతీయ తత్త్వచింతనను అర్థం చేసుకొని, ఆ జ్ఞానగంగలో యీదులాడ గలిగిన శక్తిని స్వంతరించుకోవలసి వుంది. అట్టి శక్తిని పొందవలెనను ఆసక్తి వున్నవారికి గురువుల ఆశీస్సులు, మార్గదర్శకం కావాలి. కరదీపికలవంటి జ్ఞాన సముచ్చయాలు - గ్రంథాలు - కావాలి.

అట్టివి రచింప బూని, యిప్పటికి అయిదు గ్రంథాలను రచించి ప్రచురించిన డాక్టర్ లక్కరాజు విజయగోపాలరావుగారికి 'వేదాన్త పద పరిజ్ఞానం' అనే యీ గ్రంథాన్ని రచించవలెనను సంకల్పం కలుగడం - వేదాన్తాన్ని అధ్యయనం చేసేవారికే గాక, సాధారణ స్థాయిలో తత్వజ్ఞానావగాహనకు ప్రయత్నించే వారికి ముఖ్యము, ఎంతో ప్రయోజనదాయకం.

వైదిక పదాలను అర్థం చేసుకోకుండా వేదాన్త అవగాహన దుర్లభము. ఈ దిశలో తెలుగులో జరిగిన ప్రయత్నాలు తక్కువ. అనేక ముఖ్యమైన పదముల నిర్వచనాలను, వాటి లోతైన అర్థాలను తెలిసికోవడం అత్యంతావశ్యకం. ఈ అవసరాన్ని గుర్తించిన డాక్టర్ విజయగోపాలరావుగారు యీ గ్రంథాన్ని రచించారు.

ఇప్పుడిక్కడ వీరి పూర్వ గ్రంథాలను ప్రస్తావించడం అసందర్భం కాదనుకుంటాను.

మొదటి రచన - "స్వీయ మానసోల్లాసం". ఇది తొమ్మిది శ్లోకాలకు మూడు వందల పుటల వ్యాఖ్య. బీజశక్తికి, కాండము యొక్క రూపానికి గల అవినాభావ సంబంధాన్ని యిందులో వివ

రించి 'విశ్వం బ్రహ్మాభిన్నమ'ను సత్యమును నిర్ధారించి తెలిపినారు.

రెండవది - 'విజయ గోపాలం'. 'ప్రకృతి'ని అవగాహన చేసుకోని వారికి 'పురుషు'ని రూపం బోధపడదని, ప్రకృతిని 5 శీర్షికలలో వివరించుట ఒకటి 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అని చెప్పడంలో సర్వధర్మములంటే - విధి నిషేధ పూర్వకములగు నైతిక ధర్మములు గావు. జీవ ధర్మాలగు అహంకార, మమకార కర్తృత్వ, భోక్తృత్వాదులని స్పష్టం చేయుట రెండవ విషయము.

మూడవ గ్రంథము - 'ద్వాదశమహామంజరి'. వేదాన్త అనుభూతిని పొందడానికి ఎంతోకాలం పట్టవచ్చును గాని, వేదాన్తమననేమో, దాని ప్రాథమిక అవగాహనకు నాలుగు సంవత్సరముల కాలము సరిపోవునని మనోనిబ్బరాన్ని గలిగించడం యీ రచన లక్ష్యం.

నాలుగవది - 'వివర్తవాద వివేకం'. ఆరంభ, పరిణామ, వివర్త వాదముల విషయ వివరణ యీ గ్రంథం. అద్వైత సిద్ధాంతము నవగాహన చేసుకొనుటకు సరియైన గ్రంథమిది. దృశ్యమానములు, స్ఫూర్తి జనకములు (*appearances and illusions*) అగు వాటి విషయ చర్చ విపులీకరింపబడినట్టిది.

అయిదవ రచన - 'ఆత్మతత్వ వివేకం'. ముక్తికారకమైన ఆత్మ తత్వాన్ని "యచ్చాప్నోతియదాదత్తే" అను ఉపనిషద్వాక్య దృష్ట్యా చక్కగా వివరించిన గ్రంథమిది.

ఇప్పుడు మన చేతుల్లో వున్న యీగ్రంథం - "వేదాన్త పద పరిజ్ఞానం" *'Vedantha is life and art of living'* అంటారు

స్వామి చిన్మయానంద. వేదాన్త పదములను సరిగా అర్థం చేసు కోకుండా వేదాన్తాన్ని సరియైన పంథాలో తెలుసుకోవడం సాధ్యం కాదు గదా ! అందుకే యీ గ్రంథం మూర్తిమంతమైంది.

రంగస్థల నటులుగా స్త్రీ, పురుష పాత్రలు ధరించి బహు ముఖ ప్రశంసలు, పతకములు, సన్మానములు పొంది, నిజ జీవిత మున అంకిత భావంతో ప్రభుత్వ వైద్యుడుగా పనిచేసిన డాక్టర్ విజయగోపాలరావుగారు అటు కళారంగంలోను యిటు శాస్త్ర రంగంలోను ప్రతిభతో ప్రకాశించిన వ్యక్తి. భౌతిక సుఖ పరి ష్వంగంలో రసానుభూతి అంచులను చవిచూచిన డాక్టర్‌గారు ఏడవదశకంలోకి అడుగుపెడుతూనే వేదాన్త అధ్యయన రంగ ప్రవేశం చేశారు. డాక్టర్‌గారి స్వభావ గుణం - పట్టుదల అను కున్నది సాధించేవరకూ నిదురించని దీక్ష. ఆధ్యాత్మికరంగంలో 'ఆరు ప్రయోజనకర గ్రంథాల'ను తాను రచించగలనని - బహుశా ఆయన ఊహించి వుండరు. మహాపండితుల, మేధావుల మన్ననల నందుకున్న యీ ఆరు గ్రంథాలు డాక్టర్‌గారిని చిరంజీవిగా చేస్తాయి

డాక్టర్ విజయగోపాలరావుగారు తన జన్మదినమును గురించి ఎంతో ఆనందంగా చెప్తూవుంటారు వీరు జన్మించింది - శోభకృతు నామ సంవత్సరం మార్గశిర పూర్ణిమా శుక్రవారం. 'శోభ' అనగా రాణింపు. దేనికి పూనుకున్నప్పటికీ దానిని శోభాయమానంగా రాణించునట్లు నెరవేర్చటం - 'శోభకృతు' సూచించు భావము. ఇక - 'మాసానాం మార్గ శీర్షోఽహం' అని ఆ మాసమును తన విభూతిగా ప్రస్ఫుటించాడు భగవాన్ శ్రీకృష్ణుడు. 'పూర్ణిమ' షోడశ కళా ప్రపూర్ణతను, పరిణత జ్ఞానమును సూచించు తిథి. 'శుక్ర వారం' భాగ్య దేవతయగు లక్ష్మీదేవి అంశ. నిజమే - కానీ, యీ అంశలన్నీ వీరిలో యుండుటే ఎన్నదగిన విశేషము.

డాక్టర్‌గారి జీవితంలో ఇప్పటికి మూడు పర్వములు పూర్తి యైనాయి. మొదటిది - రంగస్థల నటనాపర్వము. రెండవది రోగి సేవానోద్యోగ పర్వము. మూడవది - చిత్కళాతపఃపర్వము.

ఈ పర్వము నందలి విలక్షణ విషయముల అవగాహన కాన్తంత్యము నొంది నూత్న ధృక్పథములందలి సామరస్యమునకు సంతసించి "చిత్కళా తపస్వి"గ అభినందించి ఆశీర్వదించినవారు శ్రీశ్రీ మహామహోపాధ్యాయ *Prof. B. R.* శాస్త్రి *M. A., Ph. D.* వీరు ఉస్మానియా విశ్వవిద్యాలయపు ఆచార్య ప్రధానాధిష్ఠాత లగుటయు, ఈ కార్యకలాపములు కళాప్రపూర్ణ శ్రీ శ్రీ దివాకర్ల వేంకటావధాని *M. A., (Hons) Ph. D.* ప్రొఫెసర్, ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్ వారి సమక్షమున జరుపబడుటయు శ్రీ డాక్టరుగారి సుకృత ఫలమనియే సంభావింపనగును.

ఇక అనంతర పర్వం ఏమికానున్నది ? వానప్రస్థమా ? సన్యాసమా ? అట్టి పర్వము సమాజ సేవాపూరితమై లోకకళ్యాణ కారకముగా నుండగలదని ? ఆధ్యాత్మిక జ్ఞాన కిరణముల ప్రసరింప జేసి, భారతీయ తత్వ వికాసానికి దోహదపడ నున్నదని విశ్వసింతము.

డాక్టర్‌గారి సంకల్ప మెట్లున్నదో ? భగవదేచ్ఛ ఎట్లున్నదో ?

శుభం భవతు

విజయవాడ
తేది 20-4-1990

- సావుల రమేశబాబు
ఎం. ఏ., వైద్యాచార్య
ఉపాధ్యక్షుడు : 'సమాలోచన'
కార్యదర్శి : 'అకాడమీ ఆఫ్ ఆయుర్వేద'

# పీ ఠి క

*Dr. L.* విజయగోపాలరావు,
*L.I.M. (Madras)*

సాధారణ సాహిత్యము నందు వలెనే శాస్త్ర సాహిత్యము నందును సాంకేతిక పదము లుండుట సామాన్యమే. వీటి పరిశీలనలో కల్పింపదగిన భేదభావములు తెలియబడి, అవి అన్వయ భేదముల కాధారములై, శాస్త్ర సిద్ధాంతములనే మరుగు పరచ సమర్థములై యుండుట మన కనుభవమున నున్న సత్యమే. ప్రత్యేకించి వేదాన్త శాస్త్రమున నిట్లు జరుగుట కవకాశములు మెండుగా నున్నవి. అందుననే శాస్త్రములందలి ప్రధాన విషయ వివేకమునకు వక్రరూపముల గల్పింప నవకాశములు తటస్థమగు చున్నవి. ఇందుకు తార్కిక ప్రతిభ వ్యాకరణ శాస్త్ర విశేష జ్ఞాన మున్నా, చక్కగ దోహదము జేయగల వనియు ప్రతీతి గలదు.

ఈ దొసగులు నివారించుటకు వేదాన్త పద పరిజ్ఞానము ప్రప్రథమావశ్యకత యగుచున్నది. అట్టి భావముల యందు ప్రాప్తించు ద్వైవిధ్యముల విషయమున మీమాంసలతో మసలుచు, సంతృప్తులై; ఋజుభావముల గ్రహించి నిర్ణయింపజాలక జిజ్ఞాసు వులు నిర్వేదము బొందవలసి వచ్చుటయు నా యనుభవము కూడనై యుండుట నన్ను స్పందింపజేసినది. ఇందుకు నా యల్ప జ్ఞాన పరిధి యందలి వివేకముతో సామరస్యమును సమకూర్ప యత్నింతును. అవధరించండి !

*I.* ప్రథమముగ నాకు స్ఫురించిన విషయము జీ వులు జేయు వ్యవసాయాత్మక కృషి యందు గల అలసత్వపు బోధకుల బోధకతా పాటవము నందలి తరతమ భావకో

ఈ దొసగులు పొసగుటకు కారణమనియు విశ్వసింపవలసి వచ్చి నది. ఉపమానముగ నొక చిన్న విషయమును వినుడు. మా హైస్కూలు విద్యార్థి దశయందు గ్రామరు బోధయందు పార్సింగ్ అను ప్రక్రియ యుండెడిది. అధ్యాపకుడు ఒక వాక్యము నిచ్చి అందు గల పదములు ఏ వర్గమునకు జెందినవో – వాటి కా వాక్యము నందలి మిగత పదములతో గల సంబంధ మెట్టిదో వివరింపవలసి వచ్చెడిది. ఒక నామవాచక పదము (*noun*) కామన్‌నౌనో, ప్రాపర్‌నౌనో, ఏబ్‌స్ట్రాక్ట్‌నౌనో జెప్పి ఇతర పదములతో దానికి గల సంబంధ మెట్టిదో వివరింపవలసియుండెడిది. ఇది అవసరమే గానీ — ముందు కామన్, ప్రాపర్, ఏబ్‌స్ట్రాక్ట్ అను పదముల కర్థముల దెలిసియుండినగదా యీ విభజన సాధ్య పడుట ! అట్లు దెలియని వారికది అంతా ఎబ్‌స్ట్రాక్ట్‌గానే మిగిలి పోయెడిది. ఇట్లే క్రియావాచకముల విషయమునను ట్రాన్సిటివ్ వెర్బ్, ఇన్‌ట్రాన్సిటివ్ వెర్బ్ ఆగ్జిలియరీ వెర్బ్ అను పదముల అర్థము గ్రహించిన గదా ఆ క్రియావాచకముల వర్గీకరింపగలుగుట! ఈ సూక్ష్మమును దెలియని బోధకుడు, విద్యార్థిని మందమతి యని నిందించుట, విద్యార్థి తన బుద్ధిహీనతకు వగచుటయు ప్రాప్తిం చును. గ్రామరు విషయ మట్లుంచి వేదాన్త బోధలో ముందుగా 'మాయ' యను పదమునకు గల భావభేదములు చక్కగా ముందే బోధింపబడి యుండని వానికి అద్వైత బోధను జేయ యత్నించిన, అద్వైతమను పదమే అర్థముగాని వ్యర్థపద మగును కనుక పద పరిజ్ఞానావశ్యకత ప్రస్ఫుటమగుచున్నది గదా !

*II.* తాడు-పాము ఇవి రెండును తేట తెలుగు పదములు. వీటికి సరియగు సంస్కృత పదములు రజ్జువు - సర్పము. ఈ రెంటి సంయుక్త పదమే రజ్జుసర్పము. కానీ, ఈ రజ్జు సర్పమి

దశయందు కరవజాలదు. 'భ్రాంతి' యను పదమును జేర్చి నప్పుడే ఈ రజ్జు సర్పమునకు ప్రాణము ప్రాప్తించి మీకు భీతిని గల్పించగలదు. అప్పుడది రజ్జు సర్ప భ్రాంతిగ సుప్రసిద్ధమై, వేదాన్త శాస్త్రము నందొక మౌలిక భావ బోధ కుపకరించుచున్నది. ఈ భ్రాంతి జ్ఞానమను పదమునకు తత్త్వ శాస్త్రమున మిక్కిలి ప్రముఖ స్థానమున్నది. ఏమన, భ్రాంతి జ్ఞానమే, జగత్కారణ ముగ జెప్పబడుచున్నది. ఈ ప్రక్రియను గ్రహించి అవగాహన బొందిన వారికే — జీవేశ్వర జగత్తత్త్వములకు అపాదించి చెప్ప బడు అధ్యాస తొలగి, స్వస్వరూపానుభూతి గలిగి, ముక్తులగుదు రని అద్వైత సిద్ధాంతము దెలుపుచున్నది. ఈ భ్రాంతి జ్ఞానస్వరూ పము, దాని నవలోకించుటకు వలయు సత్వరజస్తమోగుణముల జ్ఞానావశ్యకత ఈ గుణత్రయమునకు దేహేంద్రియ మనోబుద్ధులపై గల ప్రభావము (*Impact*) గ్రహించని యడల తత్త్వత్రయాధ్యాస ఎట్టిదో, దాని పరిధి నుండి విముక్తుడగుట, ఎట్లో అనుభూతి యందు గాకపోయినను, ఆలోచనా సరళి యందైనను అందుకొన జాలడు. కనుకనే అధిష్ఠానము అధ్యాస, భ్రాంతిజ్ఞానము, అజ్ఞా నము మున్నగు పదములకు లక్ష్యార్థములను గూడ (*the esoteric meanings*) గ్రహించవలసియే యున్నది.

***III.*** శాస్త్రము నందు ఒక్కొక్క పదము భిన్న భిన్న భావముల దెలుపుచుండును. అవ్యక్తము అను పదమున్నది. దీనిని ఒక సందర్భములో ప్రకృతికి వర్తించి బోధించుచున్నారు. మరొక బోధకుడు సూక్ష్మశరీరమున కన్వయించి బోధించు చున్నాడు. మరొక బోధకుడు దీనిని కేవలము పరమాత్మకు మాత్రమన్వయించవెల్లు గాని మిగత పదముల కన్వయము

కుదరదని నిర్ధారించి ఆక్షేపణల దెలుపుచున్నాడు. ఇట్టి భిన్న భిన్న అన్వయములు, పద పరిజ్ఞానావశ్యకతను ఉద్ఘాటించి దెలుపుచున్నవి గదా !

*IV.* మాయను నిర్వచించుటకు బోధకులు యా - మా- సామాయ అనగా యా=ఏది మా=లేదో, సామాయ=అదే మాయ యని బోధించుచున్నారు. అగుచో ఒక అభావ పదార్థమును గురించి మీమాంసించుట కవసరమేల సంభవమగుచున్నదను ప్రశ్న ఎదురగుచున్నది. కనుక లేదు అను అర్థ మన్వయించదు. కానీ, 'మా' యన, ఒక బృహత్తత్త్వము తనను తానే ఐచ్ఛికముగ పరిమిత పరచుకొని నానాత్వమును గల్పించు ప్రక్రియ యని ఒక విజ్ఞుడు జెప్పగా 'పరిమితపరచు' అను నర్థము చక్కగ అన్వయించి ఋజుభావమును అరూఢము గావించినది. ఈ యుపమానము పద పరిజ్ఞానావశ్యకతను సువ్యక్తము జేయుచున్నది గదా ! పద పరిజ్ఞానము లేని యడల ఒకరు లేనట్టిదని, మరొకరు పరిమిత పరచునది యని భిన్నవాదముల ప్రతిపాదించి చెప్పిన, సిద్ధాంతములే తామమారగు ప్రమాదము ప్రాప్తించును.

*V.* మరికొంత పై స్థాయి యందలి బోధకీ గీతాశ్లోకమును వినండి.

శ్లో॥ కర్మణ్య కర్మయః పశ్యేద కర్మణి చ కర్మయః
స బుద్ధి మాన్మనుష్యేషు సయుక్తః కృస్న కర్మకృత్
(గీ. 4--18)

ఇచట 'కర్మ' యను పదమున కర్థము ఒక క్రియ యని గాదు. అది దేహేంద్రియ మనోబుద్ధులను దెలుపును. అనగా వీటితో గూడియున్న నామ రూపాత్మక ప్రపంచమును దెలుపును.

'అకర్మ' యను పదముచే చిన్మాత్రము, నిర్వికారమునగు ఆత్మ తత్త్వము దెలియబడును. ఈ యన్వయము కర్మ యనునది ఆ కర్మను అధిష్ఠానముగ గలిగి రజ్జు సర్పాదులట్లు బయలువెడలు సట్టి మిథ్యారూపములని గ్రహించుటయే పరమార్థమని, పద పరి జ్ఞానావశ్యకత నిర్ధారించుచున్నది.

జన సామాన్యము నందీ కర్మ యన - కాలు చేతుల నిర్వ్యాపారత్వమని సంభావింతురు గాని, ఇట్టి నిర్వ్యాపారత్వము గూడ మనస్సు యొక్క అవస్థా విశేషమేనని తెలియజాలరు. గనుక ఇంద్రియముల నిర్వ్యాపారత్వము ఆత్మ యొక్క నిర్వి కార నిశ్చలత్వము గాదని గ్రహించుటయే గ్రాహ్యాంశము. ఈ రెండును అజ్ఞాన విలసితములే యని గ్రహించుటే - అకర్మ యందు కర్మను గ్రహించుట యని తాత్పర్యము. కనుక పద భావ పరిజ్ఞానమున కిదియే ప్రయోజనమని యీ యైదవ యుదా హరణ తాత్పర్యము.

*VI.* పదభావ పరిశీలనావశ్యకతను నిర్ధారించి దెలుపుటకు మరి రెండు పదముల పరిశీలించుదము. 1. అవిద్యాఽవచ్ఛిన్నుడు జీవుడు; 2. మాయోపహితుడు ఈశ్వరుడు. ఇందు అవిచ్ఛిన్ను డన, కప్పబడిన అను నర్థ మన్వయించును. రెండవ పదము, మాయోపహితుడు. దీనికి మాయతో గూడియున్న యను తాత్పర్య మును గ్రహించవలయును. ఉపహితమను నీ పదము నందును నొక సూక్ష్మమున్నది. ఎట్లన అన్యోన్యా భావముతో గుణముల నుపలక్షించి దెలుపు టొకటీ. ఉదాహరణకు :- అగ్ని అయః పిండ ముల సంబంధము. బాగుగా తప్తమై యున్నప్పుడు అయఃపిండమే అగ్నిగా దెలియబడుచున్నది. తప్తమై యుండని సహజస్థితి

యందు వాతావరణమున కనుగుణ్యమగు శైత్య స్పర్శగల అయః పిండముగనే దెలియబడును.

ఈ విధమగు ఉపహితత్వము తాత్కాలికము. అట్లు గాక పదార్థము నందే సహజ సాజాత్య భావము సిద్ధమైయుండుట రెండవ విధానపుటు పహితత్త్వము. ఇది నిత్యము సహజము నైనట్టి సాజాత్య భావము. మాయ ఉపాధిగ నుండి పరమాత్మ ఈశ్వరుడుగ జెప్పబడునంత కాలము ఉపహితపదమన్వయించును. ఉపహితత్త్వము దృశ్యమానమగు పదార్థముల విషయమునను ఈశ్వరుని విషయమునను వర్తించును గాని పరమేశ్వరుని పట్ల ననువర్తింపదనుటయే ఈ బోధకు లక్ష్యము.

తాత్పర్యము :- గ్రామరు నందు ఏబ్‌స్ట్రాక్ట్, ఆగ్జిలియరీ పదముల కెట్టి ప్రాధాన్యము గలదో - అట్టి ప్రాధాన్యమే తత్త్వశాస్త్ర పరిశీలనకు గాని తాత్త్విక గ్రంధావలోకనార్హతకు గాని ఈ పద పరిజ్ఞానమున కావశ్యకత గలదని విన్నవింతును.

నా కభిమాన పాత్రమగు పదము మరొకటి గలదు. ఏమందురా ? 'మాయ'. మాయ యనినంతనే ఒక తేలిక భావముతో గ్రహింతురు గాని అందు గల ప్రగాఢ భావ సంపదను చూరగొనని వారికి శాస్త్ర విషయము లొక బృహదారణ్యమునే దర్శింపజేయును. దాని స్వరూప స్వభావముల గ్రహించనివారు దాని నదుపున బెట్టుకొనలేరు. దాని ప్రభావ పరిధి నుండి విముక్తులై పారమార్థికతను సిద్ధించుకొనలేరు. ఈ మాయ శాక్తేయులకును అద్వైతులకును నొక గొప్ప సరిహద్దు గోడయై భేద భావముల ప్రభవింప జేయుచున్నది. మాయను శాక్తేయు లొక తత్త్వముగనే మన్నించి మాన్యముగ పరిగణింతురు. ఉపా

సింతురు, ఆరాధింతురు. 'మా' యనలేనిదనియు అభావ పదార్థ మనియు, కొందరు జెప్పుచుండ 'మా'యన శాస్త్రీయ భావము — పరిమిత పరచు నట్టిదని (*that which causes a limit or measure*) అనియు చెప్పుచున్నారు. అద్వైతులు దీని నొక నిర్మాణాత్మక శక్తిగ నంగీకరించినను ఒక తత్త్వమని మాత్ర మంగీకరింపరు. ఇది జడమనియే నిర్ధారింతురు. అపవదింతురు. కాని, దానినే సాధనముగ పరిగణించి యుపాసింతురు. అద్వైత మున సాధనముగ నుపయోగించునది ఈ ఉపాసన యొకటియే. తాత్త్విక దృష్టి కది యొకవిశిష్టమగు శక్తి గాదందురు. లౌకిక దృష్టికి ఆవరణ విక్షేప శక్తుల సంపుటియే మాయయని మాత్ర మంగీకరింతురు. ఈ శక్తులు రెండును విశ్వాత్మకములే గాని రజ స్తమో గుణములకు జెందిన భూత గుణములు గావని మాత్రము గుర్తు జేయుదురు.

అద్వైతులు కేవల పరమార్థ తత్త్వమును మాత్రమే మన్నింతురు గనుక "శక్తి శక్తి మతోరభేదః"యను శృతి వాక్యమును మన్నింపరు. శివశ్శక్త్యాయుక్తో యదిభవతి శక్తః ప్రభవితుం" అను శ్లోకపాదభావమును సౌందర్య లహరియందంగీకరించి వ్రాసి యుండిరి శంకరులు. ఐనను శివుడు శక్తియు కలసి, ఒకే తత్త్వ ముగాజాలవని అద్వైతుల విశ్వాసము. శివశబ్దమున శ్ + ఇ కలసి 'శి' యగునని, ఇందు ఇకారము శక్తి బీజమనియు, దీనిని తీసివైచిన 'శ'పర్య వసించి 'శివ' యనునది 'శవ'పదముగ నిలుచు ననియు అందువలన లౌకిక దృష్టికి మాత్రము శివశక్తుల ఐక్య భావ మంగీకరింప నగునుగాని పారమార్థిక దృష్టికది సమీచీన ముగా జాలదనియు అద్వైతుల వాదము. శాక్తేయులు న్యాయ వైశేషికాది దర్శనముల మన్నించి అందలి భావముల సమన్వయ

దృష్టితో నవలోకించి నందునను, అద్వైతులు కేవలము శ్రుతి వాక్యముల మాత్రమే మన్నించి అందుకు కట్టుబడి యున్నందు ననూ, ఈ శాఖామతములు రెంటికిని భావభేదములు గలిగి వైరు ధ్యము ప్రాప్తించి అది మనకును సంక్రమించినది; మన ముందు తరముల వారికినీ ఈ భేద భావములు వారసత్వపు హక్కుగ చెందనున్నవి. కనుక విచక్షణతో సామరస్యమునకు సముచిత కృషి చేయువలెనని యే తాత్పర్యము.

ఇప్పటికి ఆరు ఉపమానములతో వేదాన్త పద పరిజ్ఞానావ శ్యకతను గుర్తించితిమి. ఇక మంగళాచరణమును సద్గురు సంకీ ర్తనమును గావించుకొని ముందు కీలకపదములగు అధిష్ఠానము, అధ్యారోపము, అధ్యాస (భ్రాంతి)లను మీమాంసచే గ్రహించి పిమ్మట తత్త్వశాస్త్రచక్ర పరిభ్రమణమునకు ఇరుసువంటిదగు మాయను స్పృశించి పరామర్శించి పిమ్మట గ్రంథస్థ విషయ వివరణకు గడంగుదము.

గమనిక : ఇది సమగ్రముగ వ్రాయబడిన గ్రంథముగాదు. స్వయంకృషితో ఈ క్షేత్రమునందు శ్రమించి కొంత ఫలము పొంద యత్నించువారికి లోగడ నాకు ప్రాప్తించిన చిత్త సంక్షోభముల దొల గించి, ఋజుభావముల సూచించి, సహకరించుటకు గలిగిన ఒక స్పందనకిది అక్షర రూపము మాత్రమే దీనియందలి శీర్షికలకు అనుస్యూతభావములు లేవు. దేని వ్యక్తిత్వము దానిదే. కాని ప్రతి దియు భావ సంపన్నమే, ఆలోచనామృతధారయే. లక్ష్యము సత్యాన్వేషణయే. పదములకు తెలియదగు అర్థములను అంత రంగిక భావములను గ్రహించి పిమ్మట ఆ పదమునకు సార్థకతను గల్పింప దెలుపవలసినది, దాని ప్రయోగమే. అనగా ఏ సిద్ధాంత

మును బోధించుటకు ఆ పదము ప్రయోజనకారి యగునో, ఆ సిద్ధాంత బోధయే ఆ పద ప్రయోగమునకు లక్ష్యము. ఉదాహరణకు, ముఖ్య సామానాధికరణ్యము విశిష్టా ద్వైత బోధకును, బాధ సామాన్యాధికరణ్యము అద్వైత సిద్ధాంత బోధకును వయ్యధికరణ్యము ద్వైత బోధకును నుపకరించునని దెలుపుటయే ఆ పదములకు ప్రయోగము. ఇది యీ గ్రంథమున ప్రవేశపెట్టబడుటయే ఇందలి వైలక్షణ్యము. వయ్యధికరణ్యము ద్వైత బోధకును నుపకరించును.

కోవిదులైనవారు ఈ పద్ధతి పై నీ గ్రంథమును విస్తరించి రూపొందించి ప్రజల కందింప, నిది యొక ప్రాతిపదికగ నుపకరించిన, ధన్యోస్మి యనుకొందును.

పీఠికను ముగించుటకు ముందొక హెచ్చరికను దెలుపనావశ్యకత స్ఫురించినది. ఒక ప్రసంగమునకో బోధకో, ఉపన్యాసమునకో మధ్యలో నొక శ్రోత లేచి ఒక ప్రశ్నను ప్రస్ఫుటించి దీనికి మీ సమాధానమేమి ? దానిని నా కర్థమగునట్లు విపులముగ విమర్శించి చెప్పుమని కోరును. అనుభవమున నాకే అట్టి పరిస్థితులు ఎదురై, నన్ను నిలవ బెట్టినవి. దానికి నా సమాధానము - అయ్యా ! ఎవరి జీవ ధర్మములు వారివి. వారి వారి దేహ నిర్మాణము నందలి సంకలనము జేయబడిన సత్వరజ స్తమోగుణముల ప్రాబల్యానుసారముగ ఒక్కొక్కరికి ఒక్కొక్క రీతిన నవి అవగాహనకు వచ్చును. కనుక తత్త్వ శాస్త్రము నందలి అంతరంగిక భావములు శ్రవణ మననముల యందు వారి వారి కృషి ఫలితముగ, రసరక్తాది ధాతుగతమై కడకు జన్యుల (*genus*) యందే మార్పు సంభవమైనప్పుడు అవగాహన గలిగి అనుభూతికి వచ్చును గాని ఒకరు వినిపించగల

నాలుగు మాటలవల్ల అనుభవమున కందవు. దీనిని చక్కగా జ్ఞప్తికి దెచ్చుకొని స్వయంకృషి జేయుటే కర్తవ్యము అప్పుడు తమకు తోచినదే ఋజు భావమని మీరే గ్రహించ గలరు. ఇది రెండవప్రశ్న : ఇంతవరకు మీరు జేసినకృషివల్ల మీకు లభించిన అనుభూతి ఏమి. అనుటయే. ఇందుకు నా సమాధానము ఒక వస్తువును జూచి ఇది ... ఇ ... ది, ఈ .... దీ ... అనువరకే నా యనుభూతి అది తాడో పామో - దేని కధిష్ఠాన మేదో, దేనిపై సంభవమైన ఆవరణ ఎట్టిదో - ఏది అసలో ఏది అధ్యారోపమో ఉండండి! ఉండండి! చెపుతాను. — ఆగండి ! ఇంతే నా సమాధానము? ఇంతే నా పీఠికకు ప్రయోజనము ? అంటే పదపరిజ్ఞానావశ్యకతను నిర్ధారించి లక్ష్యార్థ దృష్టితో ప్రయోగముల దెలుపుటయే. జ్ఞానస ముద్భవమన్ననో మీమీ శ్రవణ, మనన. నిదిధ్యాసల సుకృత ఫలము మాత్రమే నను ఉద్బోధతో గ్రంథస్థ విషయముల విశదీకరింప యత్నింతును. నమస్తే !

భవదీయ

**విజయగోపాలుడు**

శ్రీ రామ లింగేశ్వరుని పవిత్ర నామముతో విలసిల్లు తెనాలి పట్టణాంతర్గత క్షేత్రము.

బుద్ధి విలసనములే పో వాదధోరణులు ।
ఉన్న తత్త్వముండు నది యున్న యట్లే
గోచరించును యోగ మాచరించెదవేని ।
విశ్వ హిత చరిత వినర మిత్ర ॥ (ప్రత్యానంద)



# పేరుకు తగినవాడు

విజయ గోపాలరావు గారు సార్థక నామధేయులు. అన్ని విధాలా విజయవంతమైన జీవితం వీరిది. వీరు సాధించిన విజయపరంపరలో ఈ గ్రంథ రచనా ప్రస్థాన మొకటి. ఈ ప్రస్థానంలో ఇదే చివరి పుస్తకమని వీరంటున్నారు. ఇప్పటికి ఇది చివరి పుస్తకమని నేనంటున్నాను. ఎందు వల్ల నంటె ఇలాంటి గ్రంథాలు సమాజానికి ఈనాడు ఎంతైనా అవసరము. అందునా ఇది పరిభాషను గురించిన గ్రంథం. పరిభాషను గురించి మన భాషలో వచ్చిన గ్రంథం.

చెప్పేవాడి మాట వినేవాడికి అర్థమవుతూ ఉంటే దాన్ని 'సంభాషణ' అంటారు. చెబుతున్న దేమిటో చెప్పేవాడికి మాత్రమే అర్థమవుతూ, వినే వాడికి అంతుపట్టని స్థితి ఏర్పడితే దాన్ని వ్యవహారం అంటారు. తమ మధ్య నడుస్తున్న ప్రసంగమేమిటో అటు చెప్పేవాడికీ, ఇటు వినేవాడికి కూడ అర్థం కాని పరిస్థితి ఏర్పడితే దాన్ని 'వేదాంత' మంటారు—అని పెద్దలు అంటూ ఉంటారు నవ్వుతూ. అలా చెలామణి అవుతున్న వేదాం తాన్ని గురించీ, దాని పరమార్థాన్ని గురించీ, పరిభాషను గురించీ చదివిన వారందరికీ అర్థమయ్యే విధంగా పుస్తకాలు వ్రాయగలుగు తున్నారు గోపాల రావు గారు. వేదాంత సారాన్నీ, సారాంశాన్ని నవనీతం లాంటి స్థితిలోనికి తీసుకొని వచ్చి మరీ అందిస్తున్నారు. ఆ నవనీతాన్ని తాను తింటూ, మనం దరి చేతా తినిపిస్తున్నారు. అందుకే అన్నాను. 'వీరు పేరుకు తగిన వారని'

వైద్యం రెండు రకాలు. మొదటిది ఆరోగ్య పరమైన వైద్యం. రెండవది ఆత్మవిద్యాపరమైన వైద్యం. దశాబ్దాల తరబడి ఆరోగ్య పర మైన వైద్యంతో ఆంధ్రజాతిని సేవించిన గోపాలరావు గారు ఇప్పుడు

ఆత్మ విద్యాపరమైన వైద్యాన్ని కూడ అందించడంలో తమ నైపుణ్యాన్ని చూపిస్తున్నారు. ఇలాంటి నైపుణ్యం ఉన్న వాళ్లు ఎంత మందయినా కావాలి ఇప్పుడు. జాతి ఇలా విప్పిచెప్పే వారి కోసం, వివరించి చెప్పేవారి కోసం, సూటిగా బోధపరిచే వారి కోసం, సులువుగా అందించేవారి కోసం కనులు పెద్దవి చేసుకొని మరీ ఎదురు చూస్తున్నది.

ఇలాంటి గ్రంథాలు వీరి నుండి మరిన్ని రావాలి. వీరి శేష జీవితం ఇంకా విశేష జీవితం కావాలి.

27-8-90
విజయవాడ

మోపిదేవి కృష్ణస్వామి
M. A., Ph. D.,

శ్రీః

C. V. S. Rama Krishna M.A.BL., PHONE : 77146
Advocate
GIRI Street
VIJAYAWADA 11

*Date : 9-9-90*

మ॥ రా॥ శ్రీ

డా॥ L. విజయగోపాలరావు గారికి నమస్కారములు ఉభయ క్షేమానంతరము.

మీరు దయతో పంపిన గ్రంథము ఉత్తరము అందినవి. చాల సంతసించితిని; మీ గ్రంథమును చదువు చుంటిని-మీ కృషి శ్లాఘనీయముగ నున్నది. వేదాంత గ్రంథముల యందలి అతిక్లిష్టమైన విషయములు, జిజ్ఞాసువులకే కాక పోయినను పామరులకు కూడ జిజ్ఞాస కలిగించు రీతిని సులభముగ గోచరించు రీతిని మీరు వ్రాయుటచాల ప్రశంసనీయము.

వేదాన్త పద పరిజ్ఞానము చిన్న నిఘంటువుగా రచింపబడినది. ఆదిశంకరుల వారి భాష్యార్థములు పొందుపరచబడి యుండుట ముదావహము. శాస్త్ర సమ్మతము.

నమస్కారములతో భవదీయుడు

**చిం॥ వేం॥ శివరామకృష్ణ**

# కృతి : వేదాన్త పదపరిజ్ఞానము
## సుకృతులు : నివాసములు :

| | | రు - పై |
|---|---|---|
| 1. | శ్రీ నడింపల్లి భావనారాయణ గారు కంట్రాక్టర్ (P. W. D.) తెనాలి. | 400-00 |
| 2. | శ్రీ సంకా శ్రీధర్ గారు B.A., B.L. ఎడ్వకేట్ తెనాలి. | 100-00 |
| 3. | శ్రీ నడింపల్లి వాసుదేవ పరబ్రహ్మమూర్తిగారు, విద్వాంసుడు తత్త్వజ్ఞాని, గోవాడ | 116-00 |
| 4. | శ్రీ డాక్టర్ వెంపటి సూర్యనారాయణ గారు బాకారం, హైదరాబాద్ 48. తమ ప్రియతమ పుత్రుడు జిజ్ఞాసువు నగు సత్యనారాయణ గారి స్మారక విరాళము | 250-00 |
| 5. | శ్రీ టి. వి. శివసుబ్బారావు గారు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ తెనాలి (retd), కొవ్వూరు W. G. Dt. | 116-00 |
| 6. | రామభక్త శ్రీకాదేపల్లి వీరయ్యశాస్త్రిగారు, ఎడ్వకేట్, తెనాలి తన మేనమామ లేటు పిల్లలమర్రి సత్యనారాయణ గారి స్మారక విరాళము | 58-00 |
| 7. | శ్రీ శ్రీ దయానందగిరి స్వామివారు ధ్యాననిష్ఠాశ్రమము, గోగిళ్ళాపురము, బెజ్జంకి 505 528 | 50-00 |
| 8. | శ్రీ ఎర్మారెడ్డి మల్లారెడ్డి గారు జిల్లా ట్రెజరీ ఆఫీసు సీనియర్ అకౌంటెంటు కరీంనగర్ 505 001 | 50-00 |
| 9. | శ్రీ జూపల్లి నరసింగరావు గారు కరీంనగర్ | 50-00 |
| 10. | శ్రీ జగత్పాల్‌సింగ్ గారు కరీంనగర్ | 50-00 |
| 11. | శ్రీ ఎర్మారెడ్డి రామిరెడ్డి గారి ధర్మపత్ని, శ్రీమతి నరసమ్మ గారు భక్తురాలు కరీంనగర్ | 25-00 |
| 12. | శ్రీమతి కారపు రామవ్వ గారు భక్తురాలు కరీంనగర్ | 25-00 |
| 13. | శ్రీ ఎర్మారెడ్డి నారాయణరెడ్డి గారు జిజ్ఞాసువు కరీంనగర్ | 25-00 |
| 14. | శ్రీ దొగ్గలి వేంకటయ్య గారు జిల్లాపరిషత్, కరీంనగర్ | 25-00 |

పై వితరణ శీలురకు పరమాత్ముని
దివ్యమంగళా శాసనములు.

# సవరణలకు — సు వర్ణములు

ముంపు - ఒక అకర్తృక దోషము : మొదటి 16 పేజీల పిమ్మటనుంచి ప్రారంభమై — మాయ వరకును 16 పేజీలు మరల లెక్కించపుగ వేయబడినవి. 2) 'భ' యను అక్షరము అన్ని చోట్లను సరిగా అంటి యుండలేదు.

| పీఠిక | పేజి పంక్తి | వర్ణములు | సు వర్ణములు |
|---|---|---|---|
| | 16—18 | క్షేత్రము | క్షేత్రము, రామలింగేశ్వర పేట |
| శ్రీదేవి | 3—7 | తాత్వక | తాత్త్విక |
| మౌలిక పదములు | 7—17 | ఆ వస్తువు అధ్యా | ఆ వస్తువునందధ్యారోపితము |
| | 9—22 | పరీత్ర | పరత్ర |
| | 18—12 | విజయ | నిజయా |
| | 25—9 | గలవని | తెలుపబడగలవని |
| | 27—6 | దీమాయే | దీ మాయయే |

32—6 ఈ శ్లోక నాల్గవ పాదము ఇది—
'బాహ్యాభ్యంతర సంస్థితం పరమేశ్వరం ప్రాణేశ్వరం భావయేత్'॥

| | | | |
|---|---|---|---|
| | 52—7 | మిత్య | మిథ్య |

త్రిపుటులు 54 ఇందు నాల్గవ త్రిపుటిగ 'జీవేశ్వర జగత్తులను' చేర్చవలయును

| | | |
|---|---|---|
| 61—19 | soat | sort |
| 71—21 | థాదాత్మ్యమే | తాదాత్మ్యమే |
| 71—22 | యందలి దిగపరిగణించి | యందలిది గపరిగణించి |

76—i—iv వరకు పదముల అనుక్రమమును గమనించి సరిదిద్దగలరు.

i మాయాంతు ప్రకృతిం విన్యాత్ (శ్వేతాశ్వతరం 10)
ii తదేవ సోమ్య ఇదమగ్ర ఆసీత్ (ఛాందోగ్యం)
(జడమగునది ప్రకృతి – మాయ గాదు.)
iii ఇంద్రోమాయాభిః పురురూప ఈయతే (ఋగ్వేదము)
iv ఈ క్షతైర్నాశబ్దః (బ్ర। సూ। 1-1-5)
78—16 'ఇది' డిలీట్ చేయండి
79—19 *add to item 51.* ఈ పదము కొట్టివేయండి.



చిత్రకారతపస్వి
లలిత సంగీత రికార్డిస్ట్
రంగస్థల నటరత్నము స్వర్ణపతక
ప్రశంసా పత్రవిజేత
ఆధ్యాత్మిక గ్రంథముల రచయిత
87వ సంతముల యాకృతి కర్త



మెడికల్ ఆఫీసర్‌గయున్న
యుప్పసవ్యక్తి యల్. వి. గోపాలరావు
రంగస్థల నటరత్నము
ప్రసూతి వైద్య శేఖరుడు

శ్రీ

# బద్ధ ముక్త చైతన్య స్వరూపులు



సద్గురుమూర్తి

దివ్యశ్రీ 'ముస్నంగి పున్నయ్య పంతులు' గారికి

తమ శిష్యుడగు

విజయగోపాలుని భక్త్యంజలి

పరిణత జ్ఞాన విజ్ఞాన ఘన సంపన్నులు,

సాహిత్య స్వరాట్, తత్త్వశాస్త్రవేత్త

పర్యాన గ్రంథ రచయితయగు మహామనీషి



శ్రీ విద్యోపాసకులు

శ్రీశ్రీ ఆచార్య పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

*M. A., M. Litt., Ph. D., D. Litt., H. T. A. H.*

*Retd Prof. of Head of Dept. of English*

*University of Nagapur.*

*Life member of Trinidad Academy of Hindiusm,*

*59 Vidya Vihar,* **NAGAPUR.**



*Prof :* P. S. Sastri M. A., M. Litt. Ph. D., D. Litt.,
Life member of Trinidad Academy of Hinduism.
University of **NAGAPUR.**

# వైశారది

శ్లో॥ గణేశ్వరంచ గాయత్రీం మాతరం పితరం తతః
గురూంశ్చ దర్శనాచార్యాన్ వందేఽహం మోక్షకాంక్షయా.

ప్రతి దర్శనమునకు నిర్దిష్టమైన పారిభాషిక పదములున్నవి. ఈ పదములను చక్కగా అర్థము చేసుకొనవలసిన అవసరమున్నది. ఏ దర్శనమును చూచినను ఆయా విశిష్ట పదజాలముతో అన్యదర్శనముల విమర్శ కన్పించగలదు. ఇట్టి సందర్భములలో అన్యదర్శనముల పారిభాషిక పదములకు విపరీతార్థము తీయబడినవి కూడ. ముఖ్యముగా శాంకరాద్వైతమున గల కొన్ని మౌలికపదములకు ఇతరదర్శనములలో అపార్థములు, విపరీతార్థములు ఇవ్వబడినవి. అద్వైత వేదాంతమున నీతార్థ, నేయార్థ వివరణ లుండుటయే దీనికి ముఖ్యకారణము. ఇట్టి పరిస్థితిలో అద్వైత వేదాంతమున కన్పించు మౌలిక శబ్దములను విశ్లేషించి, వివరించుట చాల అవసరము.

శాంకర సంప్రదాయమున శాక్తేయ సిద్ధాంతములు కొన్ని ప్రవేశించినవి. శివాద్వయవాదము, ప్రత్యభిజ్ఞావాదము, శాక్తేయము అనునవి తంత్రాగమములతో మిశ్రితములై, వ్యాకరణ దర్శనముతో, యోగదర్శనముతో ఘనిష్ఠ సంబంధమును పొందినవి. అభినవ గుప్తపాదులు వీటిని అద్వైత వేదాంతముతో సమన్వయింప జూచిరి. శాక్తమున, అద్వైతమున కొన్ని

శబ్దములు సమానముగా కన్పించుచున్నను, వాటి అర్థములు సమానము కావని అభినవ గుప్తపాదులు గుర్తించి వారి ప్రామాణిక గ్రంథములను సంస్కరించిరి. ఈ విషయమును తెలియని వారు అద్వైత వేదాంత సంప్రదాయమును కొంత వరకు కలుషితము చేసిరని గ్రహించుట అవసరము.

జీవితా దపిహి సత్యధర్మ పరిపాలనా గురుతరేత్యస్య లింగమేతత్ అని బృహదారణ్యక భాష్యమున (2-5-17) శ్రీభగవత్పాదు లనిరి. సత్యాన్వేషణకు 'సహాంమధు ప్రవోచదృతాయన్' అని శ్రుతి. సత్యాన్వేషణకు పారిభాషిక పదముల అర్థములను వివరించుట ప్రధానము.

ఈ కృషికి పూనుకున్న శ్రీ విజయగోపాలరావు గారు కొంతవరకు విజయమును సాధించగలిగిరి. వివిధదర్శనములను అవగాహనచేసికొనిన పట్టువరు కలసిననే ఈ పదపరిజ్ఞానము పూర్తికాగలదు. అందుకీ గ్రంథము నాందీవచనమును పలికినది.

శ్రీ దేవితో ఆరంభించుట సముచితము. ప్రతి పదమును విశ్లేషించి ప్రయోగమును వివరించిరి. అధిష్ఠానము, అధ్యారోపము, అధ్యాస అను మౌలిక పదముల విశ్లేషణ సమంజసముగ నున్నది. అధ్యాస మీద చెప్పవలసినది చాలకలదు. అధ్యాస శాంకరాద్వైతమునకు పునాది.దీనిని లెస్సగ తెలిసికొనవలెనన్న భామతిని, పంచపాదికా వివరణమ సమన్వయింపవలెను. ఇష్ట సిద్ధికారుడు సమగ్ర గ్రంథమునీపదమునకే వినియోగించినాడు. చాల క్లిష్టమైన పదమిది. గ్రంథ విస్తర భీతివలన సంక్షిప్త వివరణ నిచ్చి రనుకొందును.

మాయా శబ్ద వివరణము కూడ సంక్షేపముగా నిచ్చిరి. ఈ పదమునకు శాక్తేయు లిచ్చు వివరణ అద్వైతవేదాంతము కన్న విలక్షణమైనది. అవిద్య, అజ్ఞానము, మాయ మొదలగు పదములకు భామతీ ప్రస్థానమున

ఒక అర్థము, వివరణ ప్రస్థానమున వేరొక అర్థము కలవు. మాయా శక్తి మనకు అధ్యాసతో గల సంబంధమును వివరించవలసిన అవసరమున్నది. 'ఇంద్రోమాయాభిః పురురూప ఈయతే' అను ఋగ్వేద శ్రుతి (6-47-18) మాయ యొక్క వివిధ రూపములను ప్రస్తుతించినది. అధ్యాసతో మాయకున్న సంబంధమునీగ్రంథమున గుర్తించిరి.

పరిపాటి పదములలో అవ్యక్తము, అవ్యయము, అపవాదము, అనవద్యము, అస్తోకము, అభిర్వాపము, ఆభాస,అభావము మొదలగు వాటి నిచ్చినారు. అభావమును గూర్చి భాట్ట మీమాంసకులు, తర్కపాదమున భాష్యకారులు విస్తృతముగా చర్చించిరి. ఈ రచయిత అభావ శబ్దవివరణ ను పూర్తిగా చేసిన బాగుండెడిది. ఇట్లే చైతన్య శబ్ద వివృతి కూడ స్థూలముగనే యున్నది. అవచ్ఛిన్న శబ్ద ప్రయోగమున భామతి, వివరణ ప్రస్థానములలో భేదమున్నది. చిదాభాస, కూటస్థ పదముల వివృతి బాగున్నది.

శాంకరాద్వైత విభాగమున ప్రధాన విషయముల వివరణ కలదు. ప్రమాణములను స్థూలముగా వివరించిరి. 'శ్లోకవార్తిక' మీ విషయమున మనకు గల ప్రధాన గ్రంథము. అర్వాచీనమైన 'వేదాంత పరిభాష' మరొక ముఖ్య గ్రంథము.

కాశ్మీరశైవము, శక్తితత్త్వము, ప్రత్యభిజ్ఞావాదము అనువాటి నిందు చేర్చుట సముచితము. ఈ వాదములను చక్కగా తెలిసికొనినపుడే అద్వైత వేదాంత దర్శనము పరిరక్షితము కాగలదు. అద్వైతమున ఉపయుక్త భావములను వివరించుటకు కొన్ని పదముల విశ్లేషణ నిచ్చినారు.

తన్మాత్ర, వివర్తము,కూటస్థుడు,సగుణనిర్గుణములు, అవ్యాకృతము, ఉపహితము, ప్రమాత మొదలగు శబ్దములను స్థూలముగా వివరించినారు. ఖ్యాతి శబ్దమును గూర్చి చెప్పవలసినది చాలగలదు. ఐనను కొంత చక్కటి వివేచన నిచ్చినారు.

పంచకోశములను చెప్పి, మహావాక్యములను స్పష్టపరచుట సము చితముగా నున్నది. అవస్థాత్రయమునే తీసికొని చెప్పి, తురీయ తురీయాతీతముల ప్రస్తావన తర్వాత చెప్పినారు. ఈ పంచావస్థల విషయమున గౌడపాదుల ప్రభావము కాశ్మీర శివాద్వయవాదముపై బాగుగా కలదనుటకు వసుగుప్త, ఉత్పలదేవ, అభినవగుప్త, క్షేమరాజ, వరదరాజాదుల రచనలు నిదర్శనములు. మహా వాక్యను యాయులై స్ఫోటవాదము నంగీకరించిన కాశ్మీర శైవ, శాక్త, భాట్ట, ప్రత్యభిజ్ఞావాదులు శాంకరాద్వైతమునకు ప్రత్యర్థులని గుర్తించుట చాల అవసరము. ప్రథమాధ్యాయ, తృతీయ పాదమున శ్రీ భగవత్పాదులు, వాచస్పతి మిశ్రులు వీరి స్ఫోటవాదమును తిరస్కరించిరి. ప్రాభాకర మీమాంసకులు, విశిష్టాద్వైతులు స్ఫోట నంగీకరించిన వారు. స్ఫోటమంగీకరించనిచో శాక్తేయము సిద్ధము కాకపోయినచో, ఈ శాక్తేయులు అద్వైత వేదాంత బాహ్యులు కాగలరు.

సృష్టికార్య విధానములను వివరించి త్రిగుణములను వివరించినారు. సత్త్వరజస్తమస్సులు గుణములు కావని, పదార్థములని సాంఖ్య తత్త్వ కౌముదిలో శ్రీ వాచస్పతి మిశ్రులు నిర్ధారించినారు. ఇవి వరుసగా కారణ, సూక్ష్మ, స్థూలశరీరములు. తర్వాత యోగాచార బౌద్ధుల ఆలయ విజ్ఞాన ప్రసక్తి కలదు. దిఙ్నాగుని ఆలంబన పరీక్షను శ్రీ భగవత్పాదులు తర్కపాదమున త్రోసిపుచ్చిరి.

'యదంతర్జ్ఞేయ రూపంతద్బహిర్వదవభాసతే'

అను ఆలంబన కారికను శ్రీ భగవత్పాదులు చక్కగా త్రోసిపుచ్చినారు. 'బహిర్వదితి వత్కారం కుర్వంతి' అని శ్రీ శంకరుల అవహేళన.

అష్టమూర్తుల వివరణలో మహాకవి కాళిదాసు తన శ్లోకమును ఇట్లు వివరించిరి.

శ్లో॥ యాస్సృష్టిః స్రష్టురాద్యావహతి విధిహుతం యాహవిర్యాచ హోత్రీ
యేద్వేకాలం విధత్తః శ్రుతి విషయ గుణాయాస్థితావ్యాప్యవిశ్వమ్ ।
యామాహుః సర్వబీజప్రకృతిరితి యయాప్రాణినః ప్రాణవంతః ।
ప్రత్యక్షాభిః ప్రపన్న స్తనుభిరవతు వస్తాభిరష్టాభిరీశః. ॥

అర్థము : పంచభూతములు సూర్యచంద్రులు, యజమానుడనబడు కర్త కలసి అష్టమూర్తులు.

పదపరిజ్ఞానమున తురీయ శబ్ద వివరణ కలదు. ఓంకార శబ్ద వివరణ జాగున్నది. అ, ఇ, ఉ. మ్ లే గాక మరొక మూడు ధ్వనులీ శబ్దమున కలవని శాస్త్రేయులు చెప్పుదురు. ఇవి సప్తవ్యాహృతులు. వ్యాహృతులు : భూః, భువః, స్వః (సువః) మహః, జనః, తపః, సత్యం. పరిపాటి పదములలో ఉచ్ఛ్వాస నిఃశ్వాసల శబ్దరూపములు. ఇవి వీటినే 'హంసః' అని, 'సోఽహం' అని అందురు. కావుననే ఆత్మను హంస అని బృహదారణ్యక శ్రుతి చెప్పినది. ఓంకారమును గ్రీక్ భాషలో లొగోస్ అని అందురు. ఈ ఓంకారమునకు జాన్స్ గాస్పెల్ వ్యాఖ్యాతలు విపరీతార్థమును సృష్టించి పాడు చేసిరనుటలో అతిశయోక్తి లేదు.

ఈ వేదాంత పదపరిజ్ఞానమును చక్కగా వివేచించి, ఇతోధిక కృషితో అద్వైత వేదాంత నిఘంటువును సమగ్రముగా రచించుటకీ గ్రంథము తోడ్పడ గలదను విశ్వాసము నమ్మకౌరాదు. ఈ ప్రయత్నము నకు శంకు స్థాపన చేసిన శ్రీ విజయగోపాలరావు గారభినందనీయులు.

*శ్రీ ఆచార్య పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి*

ప్రమోదూత గణేశ చతుర్థి శుక్రవారం 1990-8-24



# భక్త్యంజలి

**దివ్యశ్రీ** మున్నంగి పున్నయ్య పంతులుగారు :
ఈశ్వరానుగ్రహ మున్ననే సద్గురు సన్నిధి ప్రాప్తించు నందురు విజ్ఞులు. సగుణ నిర్గుణముల సామరస్యపు చవులూర నాకు, తత్త్వశాస్త్ర బోధకు శ్రీకారము జుట్టిన వీరే నా సద్గురువులు. సంస్కృతాంధ్ర ఆంగ్ల హిందీ భాషలలో ప్రవీణులు. పరతత్త్వ విషయమున ప్రస్థానత్రయ భాష్యవేత్త లును అనితర సాధ్యమగు సాధకులును; నివాసము గుంటూరు పట్టణము.

వీతన్నామ మూలపద విచారణ జేసి, మిమ్మానందింపజేయ నభి లషించుచున్నాను, అనుమతించండి. మున్నంగి యనెడు ఉపనామమునకు మూలము ముని+అంగి యగు ***మున్యంగి***. కాలక్రమమున తద్భవమగు మున్నంగిగ వెలసినదీ ***ముని*** పురమే.

స్థూల సూక్ష్మ కారణ శరీరముల సంపుటియే మానవుని మూర్తి. ఈ దేహత్రయ విచ్ఛిత్తియే తపస్సున కుద్దిష్ట ఫలము. పావన కృష్ణా తీర మున నున్న నా మున్యంగియే మునుల తపోనిష్ఠకు పరమావధియై మున్నంగి యను తద్భవ నామముతో చిరస్థాయి నొందినది.

ఇక నా గురుదేవుని ***ప్రాకృత నామము పున్నయ్య*** పంతులు. దీనిని విశ్లేషించిన పూర్ణ+ఆర్య పూర్ణయార్య యగుచున్నది. దీనికి తద్భవమే పున్నయ్య. కాగా – పంత్, పండా, పంతులు అను శబ్దములు పండితునకా భాస పదములుగ వ్యవహరింపబడుచున్నవి. కనుక మునిపురపు పుణ్యమూర్తి యగు పండితుడు మున్నంగి పున్నయ్య పంతులను తాత్ప ర్యమే గ్రాహ్యాంశము.

పరమార్థతః :- లభించు లక్ష్యార్థ మేది యన - స్వ స్వరూపేణా వస్థానమే గాని బాహ్య భావ మెట్టిదియు నేతి-నేతి- యనియే.

ఇందుననే నా గురుదేవులు స్వస్వరూప నిష్ఠాగరిష్ఠులనియే నా భావన, విశ్వాసమున్ను. గురుదేవా! ధియో యోనః ప్రచోదయాత్ !

తన మమతలు, మనోబుద్ధ్యహంకారములు, నీరాజనములుగ సమర్పించు

అంతేవాసి
విజయ గోపాలుడు
చిత్రకళా తపస్వి



శ్రీః

# మంగళాచరణ విషయమున నొక మాట

'శ్రీ' యనున దొక పదము. అందంతర్గతమై యున్న పవిత్ర పారమార్థిక భావముల పురస్కరించుకొని గ్రంథారంభమున నా పదమునే మంగళాచరణమున కెన్నుకొంటిని. మరియు అకారాది వర్ణాను క్రమణిక ననుసరింపకయే, గ్రంథమును 'శ్రీదేవి' యను నామవాచక పదముతో సుప్రారంభము జేసి – విస్మృతనే తత్త్వ శాస్త్రమునకు బీజశక్తి సదృశములగు అధిష్ఠాన, అధ్యారోప, అధ్యాస పదముల పరామర్శించితిని.

ఈ గ్రంథ రచనలో 'పద పరిజ్ఞానము' (భావము) దెలుపుటయే గాక ఆ పదము ఏ ఏ తాత్త్విక బోధల జేయుట కుపకరించునో అద్దానిని 'ప్రయోగము' (*application*) అను పేరుతో వ్రాయు విధానమును ప్రవేశపెట్టుటొక విలక్షణ విధానమని దీని ప్రయోజనమును గ్రహింతురు గాక !



శ్రీదేవి (*the spirit principle*)

శ్రీ యన 'సాహిశ్రీరమృతా సతామ్'

# పద పరిచయ వాక్యములు

ఒక భవన నిర్మాణమునకు పునాది, శిలాఫలకములు, ఎంత ప్రధానమో ఒక శాస్త్రము నవగాహన జేసికొనుటకు కొన్ని మౌలిక పదములును అంతటి ప్రాధాన్యత గలవియే. వాటి యందలి గ్రాహ్యాంశములు వాటి ప్రయోగములును అంతటి ప్రాధాన్యములే.

ముందు మూడు మౌలిక పదములు - అధిష్ఠానము, అధ్యారోపము, అధ్యాస అయధ్యాసచే సంభవమగు అధ్యారోప భ్రాంతియు ప్రతిష్ఠా ప్రతిపాదకములగు మూడు పదములు. కనుక మన పద పరిజ్ఞానమును వీటితో ప్రారంభించుదము. కాగా, వీటితో ప్రగాఢ భావ సంభరితములగు మరొక రెండు పదములు భ్రాంతి, మాయ యనునవి. ఇవి బహూథా చర్చనీయాంశములు. కనుక వీటి చర్చ నిర్ణీత స్థానముల యందుపలబ్ధముగా గలదు.

## శ్రీ దేవి

శ్లో॥ సకుంకుమ విలేపనామ్। అళికచుంబి కస్తూరికామ్।
సమంద హాసి తేక్షణామ్। సచరచాప పాశాంకుశామ్।
అశేషజన మోహినీమ్। అరుణమాల్య భూషాంబరామ్।
జపాకుసుమభాసురామ్। జప విధౌస్మరేదం బికామ్॥

పైశ్లోక భావము శ్రీ లలితా త్రిశతియందు ప్రస్తుతింప బడిన శ్రీదేవి యొక్క ప్రాకృత రూపదర్శనమే. ఇకనాదేవితాత్త్విక రూపాను భూతిని బొందుదము :—

శ్రీ యన "సాహి శ్రీరమృతాసతామ్" అను శ్రుతివాక్యమున కను గుణ్యముగ ఋగ్యజుస్సామములను మంత్రజాతులు మూటితోగూడిన, నాల్గు వేదముల హృదయమును ప్రతిపాదించి తెలిపెడివిద్యయే శ్రీవిద్య. వాగర్థములకభేదము నిర్ధారింపబడియున్నందున శ్రీవిద్యను శ్రీదేవిగనే ఆహ్వానము జేసికొనవలయును. ఈమెయే సకల జగన్నిర్మాణాత్మక" చైతన్యము *(She is the creative intelligence)*. "అఘటిత ఘటనా పటీయసి పారమేశ్వరశక్తిరేవ మాయ" అని వ్యాసపుత్రుడగు శ్రీశుకుని నిర్వచనమై యున్నది. కనుక శ్రీవిద్యాధిదేవత చిచ్ఛక్తియై యుండియు జడశక్తివలె నావిర్భవింప సమర్థమని దెలియుచున్నది. *She is the substrate intelligesnt sfiri'ual energy capable of manifesting as material energy. She is thus both cosmic and supra-cosmic energy.* ఆరు దైవతముల నుద్దేశించి మనకు ఆరుమతములు ప్రచారమున నున్నవి.

శ్లో॥ శైవంచ వైష్ణవం శాక్తం సౌరమైనాయకంతథా ।
స్కాందంచ భక్తిమార్గస్య దర్శనానిషడేవహి ॥

ఈ కారికయందు "శాక్తం" అని జెప్పబడిన మూడవదర్శ
దైవతమే శక్తి. ఆమెయే శ్రీదేవి. ఆమెయొక్క నిర్గుణ స్థాయియేకాశ
పరబ్రహ్మము: సగుణస్థాయి దృష్టిలో విశ్లేషించిన ఈ దైవతము శివకే
వాది సర్వాత్మిక యనియు,నిర్గుణ స్థాయియందు సర్వసాకార దైవతములక
అధిష్ఠాన తత్త్వమగు నిర్గుణకారణ బ్రహ్మమేననియు పర్యవసించుచున్నది.
కనుకనే ఈ తత్త్వము "పుంరూపం వాస్మరేద్దేవీం స్త్రీరూపంవా విచింత
యేత్" అనుసూక్తి భావమును సమర్థించుచున్నది. *The spirit Principle of Sree Vidya is more Comprehensilde. It is both transcendental and immanent. It ineludes all the six dieties of devotionalism with out the least effect to its original substoate nature.* కనుక పారమార్థికముననిది అమూర్త నిర్గుణతత్త్వము: *A prineiplc Capable of creativity with a personality.* మరియు
నది మాయావిలాస ప్రభావసంజనిత మగు వ్యావహారికావస్థయందు కరచర
ణాది విశేష విశిష్టమై భాసించుననియు తెలియుచున్నది.

ప్రయోగము : పరమేశ్వరాంశయగు ఆదిశక్తి, శివకేశ
వాది పురుషమూర్తులుగను, లలిత, అంబిక రాజరాజేశ్వరి, శ్రీదేవి యనెడి
స్త్రీమూర్తులుగను, భక్తకోటిచే భావింపబడి, ఉపాసించి ఆరాధింపబడు
చున్నది. ఈదేవి అంశల సంభావించి నానమస్సుల నర్పించుకొను
చున్నాను. శ్రీదేవీ ! నమోస్తుతే !

పరమాత్మా ! విజయతేతరామ్ !

*N, B. The self itself serving as the object to its own self Constitutes Vimarsa. The self presents two distinct aspects, both subejective and objective in its own Integral entity through the operation of Maya Sakti. This idea lends support to Swagatha Bheda in the integral whole and is in Conformity with the principle of Polarity. Or swagatha bheda supporded by Sri Appaiah deekshita.*

# పారిభాషిక పదములు

**1 అధిష్ఠానము :** ఇది సర్వమునకు ఆధారము, ఆశ్రయమునగు చున్నది. ఇంతియే గాక కారణ రూపమగు మూల పదార్థమున్ను నిదియే. దీని ఉనికి సదా సుస్థిరమై త్రికాలా బాధితమైనట్టిది కనుక నిది నిత్యసత్యము. అనగా కాలముతో సంబంధించనిది. కనుక మార్పు అను పదము అధిష్ఠానమున కన్వయింపబడజాలదు. మార్పులేనిది అచల తత్త్వమే గావలయును. మరియు స్పందన లేని దాని యందు మార్పునునది సంభవము గాదు. దీనికి రజస్తమస్సుల రూపమగు గుణదోషముల సంసర్గము ప్రాప్తించదు. గనుక నిది నిర్గుణమే గావలయును.

*"సర్వేంద్రియ గుణ భాసం ।*
*సర్వేంద్రియ వివర్జితం ॥"*

అను శ్లోక పాదానుసారము ఇంద్రియములు లేకున్నను ఇది తాను ప్రకాశించుచు సర్వమును ప్రకాశింప జేయు సామర్థ్యము గల 'ఎరుక' యగుట వలన ఈ అధిష్ఠానము కేవల జ్ఞాన మాత్ర సత్త గలిగినట్టిది ఆంగ్లమున దీనిని **The Basic material or the Thing in – itself (without any appearances** నామరూప రహితము) అని చెప్పబడు చున్నది. ఇదియే **(the Primal substrate material)** గా సంభావింపబడు చున్నది. పదార్థ మన-ఇంద్రియ గోచరమగు నీ భౌతిక పదార్థమని గాదు భావము. ఇది యొక అవ్యక్త, అగోచర, శక్త్యాత్మక పదార్థము గావచ్చును. **(a mysterious unknown Static energy or power)** దృశ్యములుగ తెలియబడుచున్న సర్వ నామ రూప ఇతర సంభావ్యములకున్ను ఇదియే ఆశ్రయము ఆధారమునని చెప్పబడుచున్నది. దీని ఉనికి త్రికాలాబాధితము

దీని వ్యాప్తి అనంతము దీని ప్రతిభ ఆరాధ్యయోగ్యము ఇదియొక నిరాకార నిర్గుణ, నిరంజన, నిశ్చల, కేవల, ఏకైక నిజతత్త్వము - unaffected by the challenge of known changes. కనుక నిది శివశక్తియే ('శివశ్శక్త్యాయుక్తో యది భవతి ప్రభవితుం' అను శ్లోక పాదానుసారము) యను అనుభూతిని బొందవలయును. ఈ యనుభూతియే అధిష్ఠానము.

'ప్రయోగము' (application to express the subject matter)

తత్త్వశాస్త్ర దృష్టికి అధిష్ఠాన మను నీ పదము ఒక్క పరబ్రహ్మమునకు మాత్రమే అన్వయించును. కనుక నిది చరమ భావ రూపమగు శక్తియే. అనగా an abstract All mighty Principle. అధిష్ఠాన చైతన్య మనగా పరమార్థ తత్వమే the ultimate witness. దీనికి ప్రతియోగియగు పదము ఆభాసయే. (a relative witness). ఇది ప్రతిబింబ స్థాయి తత్త్వమే గనుక సాపేక్షికమే.

*N. B.* బోధనా విధానము నందు - ఫలాన రూపమునకు ఫలాన పదార్థము అధిష్ఠానమని వివరించినప్పుడు మాత్రము ఈ పదమునకు ఉపమానపు విలువ మాత్రమే కల్పింపబడును.

ఇట్టి నిరంజన, నిష్క్రియాత్మక నిత్య సత్య పదార్థము నందు, నామ రూపములతో భాసించు అసత్పదార్థము లెట్లు సంభవము లగునను శంక కలుగక పోదు. అందుకు సమాధానము - సర్వాధిష్ఠానమగు సత్పదార్థ రూప జ్ఞానము కలుగక పోవుటే మొదటి కారణము.

రెండవది - రజస్తమస్సుల ప్రభావము కించిజ్ఞుడగు జీవునిపై ప్రసరింప - తమోగుణశక్తిచే, జ్ఞానేంద్రియశక్తులు ఆవరింపబడి మందగించగా, రజోగుణ ప్రభావ విక్షేప శక్తి వలన రూపము వక్రీకృతమై వస్తువునందు భంగిభేదము దృశ్యమానమగుటయే విశేషము.

**2. అధ్యారోపము :** ఎక్కడా ఉనికి లేని దానికి ఉనికి యున్నట్లు భావించుట. అధిష్ఠాన మనేది లేకుంటే అధ్యారోపమను పదమే రూపొంది యుండెడిది గాదు. అధ్యారోపమను ప్రక్రియ లేకుంటే అధిష్ఠానమను పదము ప్రసక్తమై యుండెడిది గాదు. ఇవి వేదాన్తమున ప్రముఖమగు జంట పదములు. అధి అంటే పైన, ఆరోపము = అందు లేని భావ రూపములను ఉన్నట్లు కల్పించుకొని ఆ కల్పితమునే అధిష్ఠాన పదార్థము నందు పై నున్నట్లవలోకించి ఆ చూడబడినదే నిజమని సంభావించుట. ఆంగ్లమున సూపర్ అంటే పైన ఇంపోజిషన్ అంటే మోపుజేసి యుంచుట (the act of putting upon) తాత్పర్య మేమన—అబాధితమగు, నిత్యమగు, మార్పు జరుగు టసంభవమగు సత్య పదార్థమే అధిష్ఠానము.

ఒక స్థానము నందు ఊహాజనితమగు లేక స్మృతి జ్ఞాన సంజనితమగు ఒక వస్తు రూపమును దర్శించుటే అనగా నొక మృషా వస్తు దర్శనమే అధ్యారోపము. ఇదియే 'పైన' ఆరోపించి యుంచుట అను పద భావము. స్వరూపముతో అచటయున్న దానిపైన - దృశ్య మాన మాత్రమైన మరొక పదార్థపు స్ఫూర్తి బొంది అసలు వస్తువు పైన మోపియుంచుట మాత్రము గాదు. ఈ పదము యొక్క భావము. ఇట్టి భ్రాంతి జ్ఞానము వలన కలిగిన రూపము ఏ వస్తువు నందు భాపించునో - ఆ వస్తువు అధ్యారోపితము. ఆ నిజవస్తువే అధిష్ఠానము (Sub Stratum).

ఉ॥ ఒక త్రాడు నేలపై బడియున్నది. కనీ దృష్టి యందలి లోపము వలననో వెలుగు నందలి మాంద్యము చేతనో, తాను ఒకప్పుడు చూచియుండిన సర్పము యొక్క స్మృతి అపుడు కలుగుటచే ఆ త్రాడొక పాముగా స్ఫురించును. దీనినే త్రాడుపై పాము నధ్యారోపించుట యందురు. ఇచట సాపేక్షికముగ, త్రాడు నధిష్ఠానమనియు, స్ఫూర్తి నిచ్చిన పామును అధ్యారోపమనియు అందురు. పూర్వ మొకప్పుడు పామును చూచియున్న

వానికి, దాని స్మృతిజ్ఞానమిప్పుడు భ్రాంతి జ్ఞానముగ పరిణమించి సర్పముగ స్ఫూర్తి నిచ్చుటయే అధ్యారోప ప్రక్రియ. ఈ పాము రాశి రూపముగ (mass or Physical substance) లేకున్నను ఉన్నట్లే స్ఫూర్తి నిచ్చును. ఇందలి గ్రాహ్యాంశమేమన - ఈ స్ఫూర్తి పూర్వకమగు, రూపము నందలి రాశి, వికృతములగు చిత్తవృత్తులలో స్మృతి జ్ఞాన రూపములో మాత్రమే యగును. స్వప్నము నందలి వస్తువుల రాశియు నిట్టిదే, కాని దీని యందు ఊహ కూడా కొంత సంకలనమగును. ఇందు భౌతికమగు రాశి యున్నదా అంటే - ఉన్నట్లే దృగ్గోచర మవుతూ యుంటుంది. కాని సులోచనముల ధరించి తన దృష్టిని సరిజేసికొన్నను, ఒక దివిటీని దెచ్చి వెలుగును. సరి జేసుకున్నను ఆ పాము ఆవరణ తాడుపై తొలగి, అది పాము-కాని పాము యొక్క రూపము మాత్రమేనని తెలియబడును. కనుక అధిష్ఠాన (త్రాడు) రూప జ్ఞానమును కలిగిన పిమ్మట మాత్రమే భ్రాంతి జ్ఞానము తొలగిపోవు ననుటయే గ్రాహ్యాంశము. (An apparent thing super imposed on the Substratum).

**Prayogam :** A Prayogam is making use of a word with some esoteric meaning or Lakshyardham which exactly suits in a particular context to substantiate a particular affirmation.

ప్రయోగము : దృశ్యమన బడుచున్న జగత్తు తాత్త్వికదృష్టి యందు నిజమైనదిగాదని, వ్యావహారిక దృష్టికి సత్యమైనట్టిదిగనే భాసించు చున్నను, పారమార్థిక దృష్టికి మిధ్యగనే తెలియబడునను మిథ్యాభావ బోధ కుపకరించును. కానీ సత్యస్వ రూపమును మనన నిధిధ్యాసములచేత అంతర్ముఖతను సిద్ధించుకొని అనుభూతి పొందువరకే ఈ జగన్మిధ్యాత్వము సంభావింపబడును. పిమ్మట నిది మిథ్యగాదనియు, జగత్తు బ్రహ్మమే నను అనుభూతియు సిద్ధించును.

*N, B :* ఈ భావమొక అద్వైత సిద్ధాంతమునకు మాత్ర మన్వయింప బడుచున్నది.

అతస్మింస్తద్బుద్ధిః — ఏ లక్షణములు ఒక వస్తువునందు లేవో, ఆ లక్షణములనే ఆ వస్తువున కారోపించి విశ్వసించుటే అధ్యాస (*i* అవి ఆ వస్తు లక్షణములే యని విశ్వసించుటే అధ్యాస)

**3) అధ్యాస :** ఒక వస్తువునకు లేని నీరూపగుణ భావములను ఆ వస్తువునం దారోపించి, అవి యదార్థముగ అదే వస్తువు నందున్నట్లు విశ్వసించుటయే అధ్యాస. ఈ మూడక్షరముల పదమునకు అద్వైత సిద్ధాంతమున అద్వితీయ స్థానమున్నది. ఈ మూడు అక్షరములు శాఙ్కరాద్వైతమను పేరును సముపార్జించి ఆయనకు చిరస్థాయిని గల్పించినవి.

ఎట్లన :- పదార్థము రెండు విధములుగ దెలియబడుచున్నది. మొదటిది :- తన సహజ నిజ స్వరూపమునం దెన్నడును ఎట్టి మార్పును బొందక యుండు అధిష్ఠాన పదార్థము. ఇది కేవలము అవ్యక్తమే. రెండవది. వ్యక్తమగు రాశి రూప పదార్థము (*mass*). అధిష్ఠానము నిర్విశేషము అంటే దానికి *qualities* గాని *attributes* గాని యుండవు. కాని, ఈ రాశి రూప వ్యక్త పదార్థమునకు విశేషణము లుండి వర్ణించి చెప్పబడు చున్నవి. ఇది భౌతిక పదార్థములచే రూపొంది, మూర్తి మంతమగును. *appearances are formed by it.* రాశి లేకున్నను, భ్రాంతి జ్ఞానముచే రూపొందునవియు కొన్ని గలవు. వీటికి పదార్థము స్మృతిజ్ఞానము మాత్రమే. ఈ స్మృతిజ్ఞాన భ్రాంతి పదార్థములచే వస్తు రూపములు గోచరించుటయే అధ్యాస. ఇట్టి రూపములే *illusions* (*seeing what is not here*) భ్రాంతి జ్ఞానసంజనిత మిథ్యా జ్ఞానములు. "స్మృతిరూపః పరిత్ర పూర్వ దృష్టావ భాసః అధ్యాసః ॥

ఇదివరకు చూడబడిన ఒక వస్తువు ఇప్పుడు చూడబడుచున్న వేరొక వస్తువు యందు స్మృతిపూర్వకముగ భాసించుటే అధ్యాస లేక అధ్యారోపము నకు కారణము. ఇందు భౌతిక పదార్థరాశి యుండవను విషయము మాత్రము ప్రధానమైనట్టిది. స్మృతిజ్ఞానమే ఇందు రాశిగ పరిగణింపబడును. ఉ॥ రజ్జు సర్ప భ్రాంతి అనగా, ఒక త్రాడునందు భ్రాంతి జ్ఞానముచే స్ఫూర్తినిచ్చు పాము ఆకారము. పదార్థముగ ఇచట చూడబడుచున్నదొక త్రాడు మాత్రమే. ఇది రాశివల్ల రూపొందిన వస్తువు మాత్రమే. కాని, అది మనకు పాముగ గోచరించి స్ఫూర్తి నిచ్చుటే అధ్యాసా విధానము. ఇందుకు కారణము. దృష్టి యందలి లోపమో వెలుగునందలి మాంద్యమో అని చెప్పబడుచున్నది. అధ్యాసనే అవిద్య యనియు వ్యవహరించుచున్నారు. అవిద్య యంటే విద్య లేక పోవుటగాదు. అది తమో గుణము యొక్క ఆవరణశక్తి. ప్రజ్ఞను మందగింప జేయు (*Dulls the intellect*) రజోగుణము యొక్క విక్షేప శక్తి (*property of distortion*) ఆ బుద్ధిని వక్రీకరింప, ఈ రెంటి యొక్క ప్రాబల్యము వలన ప్రాప్తించు మానసిక స్థాయి. కనుక అవిద్య అధ్యాసలను మానసిక స్థితులు పదార్థ ప్రభావ ప్రసరణ పూర్వకముగు మానసిక స్థితులుగ గ్రహించిన యడల అవిద్యకు అధ్యాసకును సూక్ష్మ మగు భేదమున్నట్లు తెలియుచున్నది నాకు.

అధ్యాసకు కారణములు : 1. అధిష్ఠాన పదార్థమగు పరబ్రహ్మ యొక్క స్వరూప జ్ఞానము లేకుండుట. 2) అట్టి దానిబుద్ధి తత్త్వముపై ఆవరణ విక్షేపశక్తుల ప్రభావపు ప్రసరణ ప్రాప్తించి ఒక మిథ్యారూపము స్ఫురించుట, ఈ మిథ్యావస్తు జ్ఞానము బుద్ధితత్త్వముపై తన స్వరూప ముద్రను వేయుట.

***(an impression of the false apparent appearance)*** అను వాటి సంకలనము వలన రూపొందిన ఒకవేమ గుర్తియే అధ్యాస,

తత్త్వ విచారణ చేయగా అధిష్ఠాన పదార్థపు సత్తకు సంబంధించని మరొక మిథ్యాసత్త యొక్క కార్యమే (*effect of a false existance*) అధ్యాస. ఇది అధిష్ఠానమునం దారోపితమై, అధ్యారోపిత పదార్థ-మనబడు చున్నది. సూక్ష్మగ్రాహకులు దీనిని వివర్తమనియు వ్యవహరింతురు.

**అధ్యాస యందు భేదములు :**

1) అర్థాధ్యాస : అర్థమన నొక వస్తువు. వస్తువున కన్వయించి చెప్పునప్పుడర్థాధ్యాస యందురు.

2) జ్ఞానమునకు వర్తించి చెప్పునప్పుడు జ్ఞానాధ్యాసయనియు యందురు.

3) స్వరూపాధ్యాస : ముత్యపుచిప్ప యందు గోచరించు రజతము వంటిదీ స్వరూపము. అట్టి రజత రూపదర్శనమే స్వరూపాధ్యాస.

ప్రయోగము : ఆత్మయందు అనాత్మ పదార్థములగు అహం కారము మున్నగునవి శుక్తి యందలి రజతము వలె భాసించుటయే గాని స్వరూపతః రజతము యుండదని బోధించుట కుపకరించును.

4. రెండు భిన్న పదార్థములు సిద్ధమైయుండ, ఆ రెంటి సంబంధ మున్ను ఇట్టిదని చెప్పవీలు లేనట్టిది.

ఉ॥ స్వచ్ఛమగు నొక స్ఫటికము ప్రక్కన నొక జపా కుసుమ పుష్పము నుంచి, పరిశీలించిన ఆ రెంటికిని పరస్పర సంబంధ మేదియు తెలియబడదు. కాని, ఒకదాని కొకటి దగ్గరలో యుంచబడిన - -- పుష్పము యొక్క ఎరుపురంగు ఆ స్ఫటికమునందు ప్రతి ఫలించి, స్ఫటికమే ఎఱ్ఱగా నున్నదను భావమును కల్పించుట మన కనుభవమే. మరియు నీ రక్తవర్ణ మాస్ఫటికమునందు సహజముగనే యున్నదను భావమును మనకు గల్పించుట వలననే దీనిననిర్వచనీయమందురు. కానీ. వకగ్రిష్టల్

యొక్క గోడకి స్పర్శపొందిన కిరణము సప్తవర్ణములుగ విడిపడి, వాటిని పరిశీలించిన, భౌతికశాస్త్రదృష్టి కిదియును అనిర్వచనీయముగాదేమోనని పించును.

అధ్యాసను కొందరు ఆరు విధములుగ విభజించి దెలిపియున్నారు.

అధ్యాస (6 విధములు)




వీటిలో మనకు ప్రయోజనకారియగు దానిని మాత్రము వివరింతును. అదే అన్యోన్యాధ్యాస. ఒక ఇనుపగుండు ఎఱ్ఱగ కాలియుండె తాను అగ్ని యొక్క ధర్మముల ప్రదర్శించును. అంతే అగ్నియే గోళరూపమున నున్నట్లు తెలియబడును. ఈ ఇనుప గుండుకు వేడి, కాలే గుణం వంటి అగ్ని లక్షణములే ప్రాప్తించి అది అసలైన అగ్నియే ననిపించును.

ప్రయోగము : చైతన్యము పారమార్థిక పదార్థము, అహంకారము వ్యావహారికమునై యున్నవి. ఈ రెంటికి సంబంధములేదు. చైతన్యమునకు

అహంకారము నందధ్యాస గలుగదు. అనగా మిథ్యారూప ప్రపంచముల విషయమున, వాటిస్ఫూర్తిచే నిజరూప భానము కలుగదు. కానీ చైతన్యము యొక్క తాదాత్మ్య సంబంధము అహంకారము నందు ప్రతీతమగుచున్నది. అనగా, ఆత్మత, అనిర్వచనీయముగ పుట్టుచున్నది. అనిర్వచనీయమను పదము పరమాత్మకు సంబంధించి నందున ఇచట అన్వయింపననువగు చున్నది.

## తత్త్వత్రయాధ్యాస :

జీవుడు ఈశ్వరుడు, జగత్తు, అనునవి మూడు ప్రధాన తత్త్వములు; *N. B :–* ఆత్మతత్త్వ వివేకము అను నా గ్రంథము నందు 'మాయ' యను దానిని కూడ నొక తత్త్వముగ నిర్ణయించుటకు ఉపపత్తితో యత్నించితిని. పరిశీలింపండి. ఈ తత్త్వములకు అధిష్టానము పరమాత్మయే. త్రిపుటియని చెప్పబడు మొదటి మూడు తత్త్వములను తెలిసికొను వాడెవ్వరన.... దేహమునం దంతర్యామిగ నున్న చైతన్యమేగదా! తనకుతానై యున్నది ప్రకృతి, ప్రకృతికి సంబంధించి తనకు తానై యున్నాడు, జీవుడు. ప్రకృతికి సంబంధించి యుండియు అద్దానిని తన వశమునందుంచుకొని సృష్టి కార్యనిర్వహణము జేయుచున్నాడీశ్వరుడు. ఈ మూడు తత్త్వములను అధ్యాసతో కూడుకొని యున్నవే. అధిష్టానమగు చైతన్యమునందు ఈ త్రిపుటి భాసించుటయే తత్త్వత్రయాధ్యాస. ప్రకృతి జీవునిలో సంబంధించియున్న అదిపిండాధ్యాస (*microcosom*). ఈశ్వరునితో సంబంధించియున్న అది బ్రహ్మాండాధ్యాస (*macrocosmic error*) యందురు. తత్త్వత్రయాధ్యాసకు *the triple super imposition* అని ఆంగ్లము. ఒక్కమాటలో అధ్యాసయన ఆ వస్తుధర్మము లీ వస్తువు నందును, ఈ వస్తు ధర్మము లావస్తువు నందును తెలియబడు చుంటయే.

ప్రయోగము : పంచకోశ ధర్మము లాత్మయందును ఆత్మ ధర్మములు కోశముల యందును ద్యోతమగుటయే అధ్యాస. అధ్యాసను జీవేశ్వర జగత్తత్వములకు వర్తింపుటయే తత్త్వత్రయాధ్యాస.

అధిష్ఠాన పదార్థమగు చైతన్యము తన మాయాశక్తిచే గుణత్రయాత్మకమగు అజ్ఞానమును ప్రసరించి, జీవ, ఈశ్వర జగత్తులను భాసింపజేయగా, ఈ మూడును భిన్నములును అనాదులును అగు తత్త్వములుగ మనకు గలుగు విశ్వాసమే భ్రాంతి జ్ఞానము, ఈ భ్రాంతి జ్ఞాన ఫలితమే తత్త్వత్రయాధ్యాస. తాదాత్మ్యాధ్యాస:....తాను ఏ యుపాధితో చేరియుండునో అది తనకు అన్యమేనని గుర్తించక అదియే తాను, తానే అదియని విశ్వసించుటయే తాదాత్మ్యము. ఇట్టిది ఉపాధులకు సంబంధించినది. ఇక ధర్మములు....గుణములకు సంబంధించినవి, భ్రాంతిని సంసర్గాధ్యాస యందురు. అంతఃకరణ ధర్మములు జీవునివిగ జీవుని ధర్మములు అంతఃకరణవిగ అన్యోన్యములుగ పొందు భ్రాంతియే తాదాత్మ్య భావము. అంటే అనన్యతా-ఏకరూపత ఇందు ప్రధానము. ఒక ఇనుపగుండు ఎర్రగా కాలియున్నప్పుడు తానే అగ్నినని భావించుకున్నట్లుండుటయే తదాత్మ్యము.

(ఇది మొదటి మూడు పదములకు పూర్తి వ్యాఖ్య.)

ఈ చేతులు, కాళ్ళున్నూ, ఒకే శరీరమును తమ యునికికి ఆధారముగ జేసికొని యుండుటయే సామానాధికరణ్యముతో యుండుట. (*a common basis*) ఇందు :....

ఇందు 1. ముఖ్యసామానాధి కరణ్యము 2. బాధ సామానాధి కరణ్యము అను ద్వైవిధ్యమున్నది.

ఒక సిద్ధాంతమును బోధించుటకు, ఈ శరీరముతో యీకాళ్ళు చేతులకు గల సంబంధమును ముఖ్యముగ పరిగణించ వలయునా ? లేక (బాధయన త్రోసిపుచ్చుట) ఆ సంబంధము త్రోసిపుచ్చి (అనగా పరిగణింపక

మిగిలిన దానిని పరిగణింప వలయునా ?) అను విధానముల చర్చయే ఈ ద్వైవిధ్యము.

**ప్రయోగము :** పరబ్రహ్మము నాధారము జేసికొని నామరూపములు గోచరించుచున్నవి. ఇవి త్రికాలా బాధితములుగ సత్యమైనవా లేక తాత్కాలిక దృశ్యములా (మిథ్యా భావములా) యని పరిశీలింప సహకరించునీ సామానాధికరణ్య భావములు.

1. ముఖ్య సామానాధి కరణ్యము : *This is an inductive method.* దీని ముఖ్య ప్రయోజనము కార్య కారణములకు అనగా నామ రూపములకు - చైతన్య తత్త్వమునకు ఏకాశ్రయత్వమును తెలుపుటయే - అనగా నామరూపములకు, చైతన్య తత్త్వమునకు ఆశ్రయము పరబ్రహ్మమేనని తెలుపుటయే!

*N. B* : విశిష్టాద్వైత సిద్ధాంతమున జీవేశ్వరు లిరువురును నిత్య సత్యములేయను భావమున్నది గదా! కనుక నీ జీవేశ్వరు లిరువురకును అధికరణము (ఆశ్రయమైన వాడు) నారాయణుడే నందురు విశిష్టాద్వైతులు. ఇందు ఆధార ఆధేయములు (ఈశ్వరుడు జీవుడు అను ఇద్దరూ) ముఖ్యముగనే పరిగణింప బడినారు గనుక దీనిని ముఖ్య సామానాధికరణ్యమందురు, కనుక విశిష్టాద్వైత సిద్ధాంత నిర్ణాయక మీ ముఖ్యసామానాధికరణ్యము. ఈ విధానమునకు శైవమునందును అనుయోగి (*supporting view*) భావమున్నది. అదే <u>శివ విశిష్టాద్వైతము.</u> శైవమున శివచైతన్యము వేరు, శక్తి యగు పార్వతి చైతన్యము వేరు. ఐనను యీ రెంటిని ఒకటిగ భావించుట లేక ముఖ్యముగ భావించుట లేక అవి భాజ్య దాంపత్యమును తెలుపుటయే శివవిశిష్టాద్వైతమున ముఖ్య సామానాధి కరణ్యభావము.

2. బాధసామానాధికరణ్య భావము. బాధయన నొప్పి - యనిగాదు, ఒక అభిప్రాయమును నిరసించి త్రోసిపుచ్చుటని భావము, కార్యకారణము

లగు (జీవేశ్వరులు గాని శివశక్తులు గాని) రెండుగా భాసించినందున, వీటిలో కార్యమగు దృశ్యమును, భ్రాంతిచే కలిగినట్లు దెలిసికొని, దానిని త్రోసిపుచ్చి, అధిష్ఠాన పదార్థమగు పరబ్రహ్మను మాత్రము, సత్య వస్తువుగ దెలిసికొను ప్రక్రియ బాధ సామాన్యాధికరణ్యము, *This is the Deductive method* అనగా సాపేక్షిక దృష్టితో విశ్లేషించి వివేచించిన తెలియబడు దానిని మాత్రమే నిజ వస్తువుగ గ్రహించుట. *Aiming at the absolute Principle & rejecting the relative principle is* బాధ సామానాధికరణ్యం,

గ్రాహ్యమగు జీవునకు గాని దృశ్యమానమగు నాతని యుపాధికి గాని (*the soul rnd his body*) ఒక సమానమగు అధికరణ (*Common Basis*) యున్నది, అదియే ఈశ్వరుడు ఈతడు జీవునకును ఉపాధికిని సామాన్యమగు అధికరణము. జీవేశ్వర జగత్తులు మిథ్యచే ప్రాప్తించిన తత్త్వములు గనుక, వాటిని నిరసించి (బాధించి) అధిష్ఠానమగు పరమాత్మయే నిత్య, సత్య స్వరూప మని ఆరూఢము జేసికొనుటయే ఈ పద ప్రయోగమునకు ప్రయోజనము.

3. వ్యధికరణ్యము (*noun*) వయ్యధికరణ్య మనగా వేర్పాటు (*seperation*). ఒక తత్త్వమునకు వేరొకటి ఆధారమై యున్నను, అవి రెండును వేరువేరనియే భావించుట వయ్యధికరణ్యము. ఉ॥ ఒక ఆసనమున ఒకరు ఆసీనులై యుండి, ఈ ఆసనము నాదియను మమ కారముతో ఐక్యతను లేక ఏకత్వమును ప్రకటించుకొన్నను, వస్తుతః ఆ యాసనము ఆసీనుడున్ను వేరై యుండుటే సత్యమని గ్రహించు వేర్పాటు భావమే వయ్యధికరణ్యము.

ప్రయోగము : ఇది ద్వైత సిద్ధాంతమును బోధించుటకుపకరించును, కనుక బాధ సామానాధికరణ్యము, ముఖ్య సామానాధికరణ్యము, వ్యధికర ణములనునవి, అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతముల ప్రత్యేకతల బోధించుట కుపకరించును.

## మాయ

ఇంత వరకును తత్త్వ శాస్త్రమున మౌలికములగు మూడు పదముల — అధిష్ఠానము, అధ్యారోపము, అధ్యాసలను పదముల వివరించి యుంటిని. ఇకనాకభిమాన పాత్ర మగుపదము మరొకటి గలదు. ఏమందురా ? "మాయ". మాయ యని నంతనే ఏదో మర్మ మున్నదని తేలిక భావముతో త్రోసిపుత్తురు. గానీ దానిని సర్వాత్మనా భిన్నకోణముల నుండి దర్శించి, పరిశీలించి దాని స్వరూప స్వభావముల గ్రహించని వారు దాని కార్యముల నదుపున బెట్టుకొనలేరు, తత్త్వసాధన చేయలేరు, దాని పరిధి నతిక్రమించి ముక్తులై పారమార్థికతను సిద్ధించుకొనలేరు. కాని ఇది శాక్తేయులకును అద్వైతులకును నొక గొప్ప సరిహద్దు గోడగ రూపొంది స్థిరపడి యున్నది.

దీని విషయమున రెండు మాటల జెప్ప నుత్సహించు చున్నాను. "మా" యన లేనిదని ఒక భావమును పలువురు దెలుపుచున్నారు. పరిమిత పరచునది యని మరికొందరు విజ్ఞులు దెలుపు చున్నారు. *(that, which Causes a measure or limit is maya)*. పరిమిత పరచుట యనునది ఉపపత్తిగల యొక సద్భావ సంపన్న పదము.

మాయను శాక్తేయులొక తత్త్వముగనే మన్నించి మాన్యముగ పరిగణించి ఉపాసించు చున్నారు, ఆరాధించు చున్నారు. అద్వైతులు దీని నొక శక్తిగ అంగీకరించినను ఒక తత్త్వముగ మన్నింపరు. ఇది యొక నిర్మాణాత్మక శక్తి యని ప్రవచింతురు గాని జడశక్తియనియే నిర్ధారింతురు, అపవదింతురు — కాని ఉపాసింతురు, అనగా తమ సాధనకు

దీనినొక సాధనముగ గ్రహింతురు. తాత్త్వికదృష్టికి మాయయొక విశిష్ట మగు శక్తిగాదందురు. లౌకిక దృష్టికి మాయ అధర (న్యూన) భూమిక యందలి ఆవరణ విక్షేపశక్తుల సంపుటియని మాత్ర మంగీకరింతురు.

ఆత్మాశ్రయ వస్త్వాశ్రయ భూమికలు *(the Subjective and objective aspects)* రెండును ఒకే తత్త్వముగ నుండి క్రియాశక్తి ద్వారా ఆవిర్భావము బొందుటయే మాయాశక్తి యొక్క ప్రధాన కార్యము. కనుక పరశివుని యొక్క సంపూర్ణతను, ఆయన ఈశిత్వమును నిర్ణయించుటకును, నొక తత్త్వముగ మాయ అత్యంతావశ్యకమే. *Polarity of the subjective and objective aspects with their products as its manifestations is Maya.* ఈ భావ మద్వైత సిద్ధాంతముతో స్వల్పముగ భేదించుచు ఈ మాయ కొక స్థాయీ భావమును గల్పించి తెలుపును. "విజయా ఏవ మాయా శక్త్యాః" అను సూక్తి మాయకొక అస్తిత్వపు హక్కును *(Locus Standi)* నిర్ధారించుచున్నది.

అద్వైతులు కేవల పరమార్థ తత్త్వమును మాత్రమే మన్నింతురు గనుక 'శక్తి శక్తి మతోరభేదః' యను శ్రుతి వాక్యార్థము నంగీకరింపక నపవదింతురు. మరియు "శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం" అను శ్లోకపాద భావమునున్ను నిరసింతురు. పారమార్థిక దృష్టికి శివుడు శక్తియు కలసి ఒకే తత్త్వముగాజాలవని వీరి వాదము. అనగా అద్వయ మిథునభావము నంగీకరింపరు. "పాదోస్య విశ్వాభూతాని త్రిపాద స్యామృతందివి" అను మంత్ర భావము నవగాహనకు దెచ్చుకొనరు.

శివ పదమున శ్ + ఇ = 'శి' యగుననియు, ఇందు ఇకారము శక్తి బీజమనియు, ఇకారమును తీసివేసిన 'శ' పర్యవసించి శవ యనునది

శవ శబ్దమగుననియు, కనుక లౌకిక దృష్టికి మాత్రమీ శివశక్తుల అద్వయ మిథున భావము నన్వయించి చెప్పదగునుగాని పారమార్థిక దృష్టి కంగీకారముగానేరదనియు అద్వైతుల అభిమతము. శాక్తేయులు న్యాయ వైశేషికాది దర్శన శాస్త్రముల యందలి భావముల గ్రహించి సమన్వయ ప్రయత్నము జేసి యున్నందునను, అద్వైతులు కేవలము శ్రుతివాక్యముల భావములకు మాత్రమే కట్టుబడి యున్నందునను ఈ శాఖామతములు రెంటికిని భావభేదములు పొసగి వైరుధ్యము ప్రాప్తించి అవి మనకును సంక్రమించి యున్నవి. మన ముందు తరముల వారికిని ఈ వారసత్వపు హక్కులనివార్యములేగానున్నవనుట తథ్యము. కనుక విచక్షణతో వివేకమును బొంది వర్తించి భావితరములవారిలో సామరస్యమును పెంపొందించవలయుననుటయే ఈ చర్చకు గ్రాహ్యాంశము.

మాయకు (శక్తికి) స్థాయీ భేదములు జెప్పబడి యున్నవి. అసలు ఉనికిలేనిదానికి స్థాయి లేమిటని ప్రశ్నించువారికి బోధనా సౌకర్యము కొరకు ముందవి వర్ణించి తరువాత తార్కిక ప్రతిభతో నిరసించ వచ్చును గదా యందురు.

**1. అవిద్యాస్థాయి :** ఇది వ్యక్తిగత స్థాయి *(individual level)* ఇందు మాయ త్రిగుణాత్మకము: జీవాత్మపై తన అవిద్యా ప్రభావమును ప్రసరించును. అందుననే అతనికి ప్రమాతృత్వమారోపింపబడి కూటస్థుడనబడుచున్నాడు.

**2. విశ్వాత్మకస్థాయి :** *(the Cosmic level)*. ఇందునను మాయ త్రిగుణాత్మకయే. కాని, చైతన్యమునకు వశమై యుండును. అందుచే యీస్థాయి యందది పూర్ణస్వతంత్ర శక్తి యుక్తముగాదు. ఐనను శుద్ధ సత్వప్రధానమైనట్టి దనియే యనిగుర్తుంచుకొనవలయును

మాయ ఈశ్వరాధీనమై యున్నను సృష్టిని తన అభీష్టానుసారముచేయ సమర్థమై యున్నది.

**3. అవ్యక్తస్థాయి** *(the indefinable State)* లేక అనిర్వచనీయస్థాయి. ఇది అనుభూతియుక్త వైభవస్థాయియే. ఇది శుద్ధ చైతన్యమునాశ్రయించి *(depending on the Unity Consciousness)* యుండి, సుషమానిధానమై సర్వప్రాభవాధారతత్వమై తెలియబడును. కనుకనే జిజ్ఞాసువుల విచారణ కిది యొక ప్రధానపదముగ పరిగణించబడు చున్నది.

*N. B.* అద్వైతమునందు మాయా శబలితుడు ఈశ్వరుడని చెప్పు చున్నారుగదా! అట్టితరి మాయా శబలితుడను పదము, పై దెలిపిన పూర్ణ ప్రజ్ఞాభావము నెట్లు సమర్థింపనగును? ఇందుకు వారి సమాధానము—ఏకత్వస్థాయియందు స్పందన గలిగిననే నానాత్వసంభూతి కాస్పదము గలుగుననియే, మాయ యను శక్తి నూహించి ప్రతిష్ఠించుకున్నారని తెలుప బడుచున్నది. మరొక సూక్ష్మమేమన—ఏతత్త్వమునకైనను (పరబ్రహ్మకు వలె) ఆద్యంతములు లేవనిన — మాధ్యమికస్థాయిని సంభావింపనెట్లు పపన్నమగును? కనుకనే సృష్టియే లేదను అజాతవాదమును ప్రతిపాదించి దెలిపిరద్వైతులు. అందుచే శాక్తేయులు పరిగణించిన శివశక్తి పూర్వక మాయకును అద్వైతులు సంభావించి ప్రతిష్ఠించుకున్న జడశక్తి పూర్వక మాయకును గల భేదమును సునిశితముగ పరిశీలించి విశ్లేషించి వివేచించిన —శాక్తేయులు చెప్పునట్టి తత్త్వస్థాయి సత్యమా అద్వైతులు దెలుపునట్టి కల్పనాస్థాయి సత్యమాయని నిర్ణయించుకొను నావశ్యకత ఎదురగుచున్నది. విజ్ఞులగువారు వివరించి నిర్ధారింప నభ్యర్థించుచున్నాను. నా భావము నెరుంగ నెంతువా?—భౌతికమున జడశక్తి పూర్వకమును, పారమార్థికమున

చైతన్యశక్తి యుక్తమగు భావములు రెంటికిని స్థానముగలదనియే విశ్వసింతును.

ఈ గ్రంథ రచనకుగలిగిన స్పందన ప్రేరణలకు కారణము శాక్త అద్వైత దృక్పథములకు సామరస్యమును సము పార్జింప యత్నించుటయే.

*(Polarity of the subjective and objective aspects and the Consequent apparent manifestations, otherewise termed as as appearances and illusions is Maya.*

పరశివుని యొక్క పూర్ణత్వమును నిరూపించుటకును, ఆయన ఈ శిత్వమును నిర్ధారించుటకును మాయ యను తత్త్వము ఆవశ్యకమగు చున్నది. ఇది అద్వైత సిద్ధాంత భావములతో స్వల్పముగ భేదించుచున్నను మాయకొక స్థాయీ భావమును నిరూపించును. "నిజయా యేవమాయా శక్త్యాః" అనునట్లు మాయకొక అస్థిత్వమును *(Locus Standi)* నిర్ధారించును. అనగా మాయ శివుని యొక్క సహజ స్వతంత్ర శక్తియే నని నిరూపించు చున్నది. మాయ సత్యము. అది శివశక్తియేనని శివ సూత్రములయందు *రమాకాంతుడు* దెలిపెను. కనుకనే దీనిని అఘటనా ఘటన పటీ యసి పారమేశ్వర శక్తిరేవ మాయయని పలువురు ప్రముఖులు (శుకుని స్థాయివారు) దెలిపిరి. ఇదియే దుర్ఘటత్వము. ఈ భావమును తన సంక్షేపశారీరకమను గ్రంథమునందు సర్వజ్ఞాత్మమునియు పేర్కొనెను. కాని మాయకును శివునకును మధ్యనొకవిధమగు భ్రాంతిరూప సంబంధమున్నదనియే సర్వజ్ఞాత్ముడు నుడివెను. **అభినవగుప్తుడు** మాయను, స్వతంత్ర (స్వయం నిర్ణయాధికారము గల) శక్తి గల యట్టి దని, అందువలననే రూపముల గల్పించి రూపములనే గాక, జాతులను *(Species)* గూడ నిర్ణయించునట్లు ఆస్తికములగు షడ్దర్శనములయందును పేర్కొనబడి

యున్నదని దెలిపెను. స్వతంత్ర శక్తి యన — సర్వోత్కృష్ట మగు విమర్శా శక్తియేనని ఆయన భావము. స్వతంత్రమన — శివునియొక్క విమర్శాశక్తికి బాహ్యారూపమని అభినవ గుప్తుని భావము. అనగా కైవల్య స్థాయి యందలి-సంవిత్‌నందు ఆత్మాశ్రయ కర్మాశ్రయ భావములకు విరుద్ధ భావముల సృష్టించుటయే. మాయను వర్ణించవచ్చును నిర్వచించవచ్చును. అందుచే మాయ అనిర్వచనీయము గాదు.

## మాయ ఒక తత్త్వమేనని శాక్తేయుల శపథము.

శ్లో॥ శివశ్శక్త్యా యుక్తోయదిభవతి శక్తః ప్రభవితుం
న చేదేవదేవో నఖలు కుశలః స్పందితు మపి ।
అతస్త్వాం ఆరాధ్యాం హరిహర విరించాదిభిః అపి ।
ప్రణంతుం స్తోతుంవా కథం అకృత పుణ్యః ప్రభవతి (శ్రుం. ల.)

ఉపాసనా సౌలభ్యము నుద్దేశించి అద్వైతులు మాయను పలు తెరంగుల ప్రసక్తముజేసి శక్తిని లక్ష్యముగ జేసికొని ఒక దైవతముగ ఆరాధించు చున్నారు. శక్తినొక తత్త్వముగ మన్నింపకున్నను ఈ విధానము శాంకరీయుల కంగీకారయోగ్యమై ఆచరణయందున్నది. కాని, అద్వైతులు మాయనొక నిర్మాణాత్మక శక్తి *(a coalescing force)* గ మాత్రమే మన్నించి దీనికి తాత్త్వికస్థాయి లేదని నిర్ధారించి అది యొక తత్త్వముగాదని అపవదింతురు. కాని, దీనికి ముందు దెలిపిన మూడు స్థాయీ భేదముల మాత్రము విశ్లేషించి తెలుపుదురు. బ్రహ్మనైనను ఆయన కైవల్య స్థాయియందేగదా అనుభూతికి మనము నిర్ణయించు కొందుము. కనుక మాయకును కైవల్య స్థాయినే లక్ష్యముగ పరిగణింప వలసి వచ్చినపుడు, బ్రహ్మను మాయను అద్వయ మిథున భావముతోనే

పరిగణించుటే సమంజసము గాదా ? ఈ రెండు భావ పదార్థములను అవిభాజ్యములని యంగీకరించిననే మాయయు నొక తత్త్వముగనే పరిగణింప బడవలసి యున్నది. లేదా ఆ పూర్ణయ్యు పూర్ణత్వమునకే పరిష్కారము లభింపదు. ఈ దృష్టిలో నీ సృష్టి యెట్లు సంభవ మందురా ? "అగుణుండగు పరమేశుడు జగముల గల్పించు కొరకు చతురత మాయా సగుణుం డయ్యెను" అను పోతన మహాశయుని సూక్తి మాయకు సగుణ కార్యబ్రహ్మ స్థాయిని గల్పించుట లేదా ? ఇట్టిది ఒక తత్త్వమే యగునా ? లేక వాగా రంభణ మాత్రమే యగునా ? విజ్ఞులైన వారు వివరింతురని విజ్ఞప్తి జేయుచున్నాను.

**మాయ :** కాశ్మీర శైవమునందీ మాయ ఒక తత్త్వముగనే పరిగణింప బడుచున్నది. జీవేశ్వరభేద రహితమగు శుద్ధ చైతన్యము నాశ్రయించియుండు నీభావము యొక్క పరిశీలన ఆత్మావలోకనమున కత్యంత ప్రముఖమై యున్నది. ఇది అనాది. అనగా మరొకతత్త్వమునుండి కార్యరూపమున యుత్పత్తి నొంది యుండనిది. కారణ రూపమైన నొక తత్త్వమునకు కార్యమైనట్టిదిగాదు. ఇదిజగత్తత్వమునకు సంబంధించి ప్రభవించినదందురా—కుమారునివల్ల తండ్రియు కార్యమునుండి కారణము, ఉనికిని ప్రాప్తించుకొన్నట్లే పరిగణించవచ్చును. కేవల చైతన్యమునుండియే ప్రభవించినదందురా—ఆ చైతన్యమే వికారి యగును. కనుకనే ఇదిఅనాది పదార్థ మని సంభావింపవలయును.

ఇది త్రికాలాబాధితమైనది. కనుకనే 'సత్తు' అనవచ్చును. కాని జ్ఞానమువలన లయించి బాధిత మగునందున సత్తుకన్న విలక్షణ పదార్థమన వలెను. సత్పదార్థముగ ప్రతీతి త్రికాలముల యందును లేదు. గనుక వంధ్యాపుత్రునివంటి అసత్తనవచ్చును. *N. B.* జ్ఞానమువలన పదార్థదృష్టి లయించవచ్చునుగాని పదార్థమే లయించదని నాభావము.

కాశ్మీరుసందలి త్రికసిద్ధాంతవాదుల అభిమతాను సారము మాయ సంవిత్ అగు మహేశ్వరుని మహోత్కృష్టభావ సంకలన పూర్వక స్వతంత్ర శక్తియే. ఇదివాస్త వాత్మిక ఏకాత్మిక, యనియు నానాత్వమునకు ప్రతి యోగియనియు చెప్పబడినది. నిమ్నస్థాయియందుమాత్రమను యోగశక్తి గావచ్చును.

కనుక నిది వర్ణనీయము మరియు నిర్వచనీయము. కాని, అద్వైత సిద్ధాంతానుసారము అనిర్వచనీయ మనియే చెప్ప బడుచున్నది. కనుకనే-త్రికవాద సిద్ధాంతులు ఖ్యాతి యందుజెప్పబడిన ఐదు భేద భావములను *(theories of explaining false knowledge)* గ పరిగణించక, అపూర్ణ ఖ్యాతియను నొకదానిని ప్రతిష్ఠించి చెప్పిరి (దీనిని *positive nescience of the Completeness of things or events*). త్రిక సిద్ధాంతాను సారము మాయ వర్ణనీయము కాని అనిర్వచనీయమనియు జెప్పబడు చున్నది. రమాకాంతుని అభిప్రాయానుగుణముగ—శివుని ఈశిత్వ పూర్ణత్వ ములకు మాయయేమూలతత్త్వము. పరిపూర్ణ పారమార్థికస్థాయియందు మాయను శివుని స్వతశ్శక్తిగనే పరిగణింపవలసినస్థాయి యున్నది. (*Locus Standi*— భాగస్వామ్యపుహక్కు) యున్నట్లే చెప్పబడినది. అనగా శివునికి సంబంధితశక్తి *(alien power)* గాక స్వతశ్శక్తిగనే నిర్ధారింపబడినదీ మాయ.

ఆవరణ విక్షేపసహిత అనాద్యనిర్వచనీయ భావరూపాజ్ఞానమే మాయ. దీనికి పరా ఉపరశక్తులు రెండూ యున్నను శంకరులీరెంటినీ మూలప్రకృతి యను ఒకే పేరుతో వ్యవహరించి అనువదించి తరువాత నిది మిథ్యయని అపవదించి యుండిరి. అందుచే దీని నొకతత్త్వముగ నంగీకరించి యుండలేదు. "మియతే అనేన ఇతిమాయ *(that by which forms are measured or limited by dimensions)* యను భావమును

*(Cognition)* బోధించు అఖ్యాతి అసత్ ఖ్యాతి యందు దెలుపబడిన విష యములు ఈ విషయగ్రహణమున కుపకరించును.

ధౌత వస్త్రములపై రంగులు వేసినయెడల భిన్న దృశ్యములు రూపొంది తెలియబడినట్లు మాయ యొక్క ఒక సాపేక్షిక *(relative)* వ్యాపారము వలన అది, జీవేశ్వర జగత్తులుగ దెలియబడు చుండును. కనుక నీ మాయాకార్యములు ఇంద్రియ జ్ఞానా పేక్షతో సత్యముగను, అతీంద్రియ జ్ఞాన దృష్టికి మిథ్యగను, సంభావింప బడుచున్నవను వివేక మును పొందినవారికి మాత్రము అద్వయ - శాక్తేయ సిద్ధాంతములకు సామ రస్యమును సముచితముగ దెలుపబడగలవని నా విశ్వాసము.

ఉత్పలుడు మాయకు ప్రధాన కార్యములు మూడని దెలిపెను. 1. వ్యక్తులయందు పరిమిత జ్ఞానమును మాత్రము గలిగించుట. 2. మనస్సు నందు జ్ఞాన, సంకల్ప, అధ్యాసల గలిగించుట. 3. వస్తువులు (కర్మాశ్రయ ములు) సంవిత్ యందంతర్గతములై "పాదోస్య విశ్వాభూతాని" యను శ్రుతి వాక్యానుసారము) యున్నను వాటి యునికికి బాహ్యాభావమునే గలిగించుట. 4. మన యనుభవమున నాలుగవదిగ మరొకటియు గలదు. శివశక్తి వి ఆత్మాశ్రయ, కర్మాశ్రయ అంశలతో వివేచించి, గుర్తించుజ్ఞాతగ, గుర్తింప బడు జ్ఞేయముగ దెలుపునది ఈ మాయాశక్తి ప్రభావమే.

జాగ్రత్తునందు నేను బ్రహ్మము నెరుగను అను అజ్ఞానము ప్రతీత మగును. స్వప్నమునందు పదార్థము నానాభంగుల యందు ప్రతీతమై స్ఫూర్తినిచ్చుటకు మాయయే యుపాదానము. సుషుప్త్యనంతరము నేనే మియు నెరుంగనను స్మృతియు అందలి ఆనందమున్ను మాయా కార్యమే.

ఇట్లు మూడవ స్థలి యందును ప్రతీత మగు చున్నందున, మాయ అసత్తున కన్న విలక్షణమైనది. ఇట్లు సద సద్విలక్షణముగ నున్న ప్రతిభనే అద్వైతులు మిథ్యయనియు అనిర్వచనీయమనియు అను చున్నారు. కనుకనే ఈ మాయా స్వరూపమును విశ్లేషించి వివేచించనివారు సత్తు చిత్తనుచూ కూర్చుంటే అహంబ్రహ్మ - వరకే లభించును గాని అస్మి అనబడే స్థాయి సిద్ధించదు.

చైతన్యమువలె మాయయు సద్రూపమే యగునెడల ద్వైతభావ స్థాపనకే అవకాశము ప్రాప్తించును.

వాచస్పతిమతము — అజ్ఞానము జీవునకాశ్రయమై బ్రహ్మను అజ్ఞానమునకు విషయమును జేయును. ఇది శాస్త్రదృష్టికి సమీచీనముగాదని కొందరుతాత్త్వికుల భావము. స-రి-గ-మలను స్వరములకు సంగీతశాస్త్రము నందెంతటి ప్రాముఖ్యముగలదో అంతకు మించిన ఆయువుపట్లు తత్త్వ శాస్త్రమున అధిష్ఠానము, అధ్యారోపము, అధ్యాస, మాయ భ్రాంతి, యను పదములకు గలవు. బోధకులు యీపదములకు వాచ్యార్థముల మాత్రము వివరింతురుగాని ఆయువపట్లను ప్రదర్శింప ప్రతిభగలిగి యుండరు. ఉ॥ అధిష్ఠాన పదమునకు మూలము, ఆధారము అనిమాత్రము దెలుపుదురుగాని అది ఎప్పటికి ఏవిధమగు మార్పు జెందనిదైయుండవలెనను భావమును ఉద్ఘాటించిజెప్పని యెడల ఆపదమునకు జీవశక్తియే నశించి పోవును. మీదుమిక్కిలి సిద్ధాంతములే వక్రీకరించు ప్రమాదమున్ను గలుగ గలదు. ఒక తటాకమునకు చెరువు అని అర్థము జెప్పిన మాత్రమున సమగ్రభావము శ్రోతకు హృదయంగమము గాజాలదు. అది ప్రయివేటు యాజమాన్యమో ప్రభుత్వ యాజమాన్యమో అది స్వతంత్రమో, అస్వతంత్రమోగూడ తెలియ పరచని యెడల ఎట్టిచర్యకునూ యోగ్యముగాజాలదుగదా ! అట్టి సమగ్ర

జ్ఞానమే పైఐదు పదములకును అనగా అధిష్ఠానము, అధ్యారోపము, అధ్యాస, మాయ, భ్రాంతి యను పదములకు ఆవ్యకమ అనివార్యమునగుచున్నది.

ఇంతవరకును మాయకు నాకు దెలిసియున్న
స్థూలవిషయముల వివరించి యున్నాను.

శంకరుడు బోధించిన మాయా స్వరూప వివరణయందు అధ్యాసకు ప్రధమస్థాయి పునాదిగ పరిఢవిల్లు చున్నదీ మాయే. కనుక పరమాత్మ యొక్క పూర్ణత్వ ఈశిత్వములకు (ఈశానత్వము) మధ్య మాయతో ఉప హితత్త్వ మత్యంత ఆవశ్యకము, అనివార్యము అగుననియు, ఆదిశివుని స్వీయ శక్తియేగాని ఒక అనుబంధశక్తిగ సంభావ్యము గాదనియు యీ చర్చకు గ్రాహ్యాంశము మరియు తాత్పర్యమును.

మాయా మహత్మ్యము సంపూర్ణము

---

## కొన్ని పరిపాటి - పదములు :
## అర్థములు : భావములు :

**1. అవ్యక్తము :** ఎయ్యది నేత్రాదిజ్ఞానేంద్రియముల మాధ్యమముతో తెలియబడదో, ఆరవ ఇంద్రియమగు మనస్సుచేతను తెలియబడదో అనగా అద్దాని సహజస్వరూపము బాహ్యేంద్రియ అంత రీంద్రియముల మాధ్యమముతో తెలియబడదో అట్టిది అవ్యక్తమనబడు చున్నది. *N. B.* ఈ పదము సాధారణముగ మూలప్రకృతికి అన్వయించి ప్రయోగింపబడుచున్నదిగాని, అంతరంగిక బోధానుగుణముగ పరబ్రహ్మకు మాత్రమే అన్వయించదగియున్నది.

ఒకప్పుడు నా మిత్రుడు సహచరుడునగు కథాగాన కళాప్రపూర్ణ బ్రహ్మశ్రీ పాతూరి మధుసూదనశాస్త్రిగారు తనబ్రహ్మవిద్యా దీపిక యందు—అవ్యక్తం నామ సాంఖ్యాది కల్పితప్రకృతిర్న, సాకింత్వాత్మరథ రూపేణ శరీరం తదితిశ్శృతం॥ అని దెలిపి యున్నారు. (కఠవల్లి 4)

సత్వరజస్తమోగుణ పూర్వకమగు ప్రకృతియే అవ్యక్తమని సాంఖ్యులు జెప్పు చున్నారు. కానీ, ప్రకృతిని దెలిసికొన నవకాశమున్నది, గనుక అట్టి వ్యక్తమగుదానిని అవ్యక్తమన గూడదు—అది కేవలస్థాయి పరమేశ్వర తత్త్వమునకే వర్తించునని నిర్ధారింపబడినది. అవ్యక్తము ఆత్మకు రథరూపమున నుపయుక్తమగు చున్నదని, బుద్ధిసారథిగ మనసు పగ్గముగ ఇంద్రియములను గుఱ్ఱములచే గ్రహింపబడు విషయము లనియు చెప్పబడినది. విషయములన ఆయా ఇంద్రియముల కనుగుణ్య మగు సుఖ దుఃఖ కారకములగు భావములు. కనుక భోక్త ఆత్మేంద్రియ మనస్సులతో గూడినవాడు.

మం॥ మహతః పరమవ్యక్తాత్ పురుషః పరః ।
పురుషాన్నపరం కించిత్ సాకాష్ఠానా పరాగతః॥ (కఠవల్లి॥)

ప్రయోగము : అవ్యక్తమను పదము సాధారణముగ ప్రకృతికిని, సాపేక్షికముగ *(in a relative sense)* సూక్ష్మశరీరము నకున్ను, నిరపేక్షికముగ *(in the absolute sense)* పరమాత్మకును వర్తించుచున్నది. కనుక ఒకేపదమును ప్రకృతి, సూక్ష్మశరీరము పరబ్రహ్మ అనుభావములకు వర్తింపజేయుచున్నారు. ఇట్టి బహుళార్థాన్వయ ములు నిశ్చితాభిప్రాయకారకములు గాజాలవు. ఇది పదపరిజ్ఞానావసరమును దెలుపుచున్నది గదా !

**2. అవ్యయము :** పంచభూత సంబంధము లేనిదని అనగా అశబ్దం (ఆకాశముగానిది): అస్పర్శం = వాయుభూత సంబంధము లేనిది): అరూపం (అగ్నిభూత సంబంధము లేనిది): అరసం = జల భూతగుణము లేనిది: అగంధం = పృథ్వీభూత సంబంధమగు వాసన లేనిది: కనుక నది అప్రాకృతము. అదియే బ్రహ్మపదార్థము. అందుచే అవ్యయము, అనగా నశింపులేనిది, నిత్యసత్యమగునట్టిదనియు అర్థము.

**3. అపవాదము :** ఒకరు ప్రతిపాదించిన భావమును కార్యకారణముల చర్చతో పూర్వపక్షముజేసి కాదని త్రోసిపుచ్చుట *(a process of negation by antithesis)*. అతన్ని రసనము, అతద్వ్యావృత్తి, ప్రతిషేధము అనునవి దీనికి పర్యాయపదములు.

**ప్రయోగము :** అధిష్ఠానమగు పరబ్రహ్మ తత్త్వము ప్రకృతికి సంబంధించనిది గనుక క్షీణించినశించదని, దృశ్యమానమంతయు ప్రాకృతముగనుక ఉనికి లేకుండ బోవునని బోధించుట కుపయోగించుపదము.

**4. అనవద్యము :** మార్పులేనట్టిది: *the changeless.*

**5. అస్తోకము :** ద్వంద్వభావము *(duplicity)* లేనిది.

**6. ఆవిర్భావము :** మూర్తిమంతమగుట. భూతపరిణామ పూర్వకమగు మార్పులవలనగాక (పరిణామముచే గాక) పారమార్థిక శక్తియే మనకు నామరూపములతో భాసించి వ్యవహారమునకు వచ్చుట *manifestation)*. ఇట్లు మూర్తిమంతమగుట ఆరంభవాదులు జెప్పు అదృష్టముచేగాదు, భౌతికవాదులు జెప్పు పరిణామ ప్రక్రియచేతనుగాదు,

వేదాన్తులు జెప్పు వివర్తదృష్టివలననుగాను, శాక్తేయులుమన్నించు పార మార్థిక శక్తియే స్వయంశక్తితో మూర్తిమంతమగు విధానమే ఆవిర్భావము పొందుట.

**7. అవిద్య** శుద్ధసత్వము రజస్తమోగుణముల కలయికవల్ల మలినమై ఆవరణవిక్షేప శక్తులసంతరించుకున్న పిమ్మట అది అవిద్యగా ప్రసక్తమగును. అదియే అజ్ఞానకారకము. కనుక అజ్ఞానమన అభావము గాదు. రజస్తమోగుణముల ప్రభావపరిధియందలి సూక్ష్మపదార్థమే అజ్ఞాన కారకమగు అవిద్యయని నానిర్వచనము.

**8. అలీకము** అసత్య వస్తువు లేక అభావపదార్థము. ఉ॥ వంధ్యాపుత్రుడు, గగనకుసుమము.

**9. ఆభాస** భావపదార్థపు ఒకతళుకు మాత్రముగ - లేనట్టి పదార్థమే ఉన్నట్లు గోచరించుట. ఉ॥ ఎండమావులలో నీరులేదు. ఉన్నట్లు గనే అదృశ్యము ఒక తళుకుగా గోచరించుట.

**10. ఆవిష్కరణ** బహిరంగపరచుట.

**11. ఆవిర్భావము** రూపొందుట, మూర్తిమంతమగుట ఆవిర్భావప్రక్రియతో రూపొందుట మిథ్యకు సంబంధించినదని వేదాన్తులు, మూలశక్తియే రూపొందునని శైవశాక్తేయులు చెప్పుదురు.

**12. అభావము** లేకుండుట. ఇదినాలుగు విధములు

**i ప్రాగభావము** ప్రాక్ అనముందు, లేనట్టిది. అనగా ఒక కార్యమునకు ముందు కాలమున ఉనికి లేనట్టిదై, తరువాత కాలమున యునికి సంభవమైన సందర్భమున ప్రాగభావమనబడును.

ii అత్యంతాభావము ఒక సంఘటనకు, ముందు ఉనికి లేకయుండి తరువాత కాలమునను ఉనికి సంభవముగాకనేయుండుట, *Ever nonexistant.*

iii ప్రధ్వంసాభావము బీజరూపమున కూడ లేకనే సంపూర్ణముగ నశించుట.

iv అన్యోన్యాభావము వెలుగు చీకటి రెండూ ఒకే కాలము ననుండవు, ఒకటియుంటే రెండవది లేకపోవుటకే అన్యోన్యాభావ మని పేరు. రెంటిలో నొకదానికి ఉనికి వ్యక్తమైనప్పుడు రెండవదానికి ఉనికి లేకపోవుట.

**13.** అనుమితి సంభావించుట *Inference.*

**14.** అనుమేయము సంభావింపదగినది.

**15.** ఆభాస స్వయం ప్రకాశమగు నొకవస్తువు ప్రతిబింబించగా, ప్రాప్తించిన, సహజవస్తువుయొక్క ప్రతిరూపము ఆభాస *(a reflection)*

**16.** చేతన రజోగుణప్రభావముచే ప్రాప్తించిన ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తుల భావసమష్టి. ఇదిప్రాణశక్తితో గూడియున్న తత్త్వమయి ఒకయుపాధిని పొందియుండును. ఆ యుపాధి శుద్ధమాయ. ఇది క్రియాశీలి యగు పారమేశ్వర శక్తి.

**17.** చైతన్యము ఉపాధి రహితమగు దివ్యశక్తి; సత్ చిత్ - ఆనందములు దీని స్వరూపలక్షణములుగ విలసిల్లు ఏకైక కేవల

తత్త్వము. దీనినే ఎరుక *(consciousness)* ప్రజ్ఞ, జ్ఞానము, దృక్ అను పేర్లతో వ్యవహరింతురు. దీనిలక్షణములు.

శ్లో॥ చైతన్యం పరిపూర్ణమేకమచలం జ్యోతిర్మ. యంవ్యాపకం ।
తత్పంచాక్షరి మంత్రవాచ్యమమలం సూక్ష్మాతిసూక్ష్మంపరం ।
లింగంబ్రహ్మ సనాతనం సుమనసాధ్యాతవ్య రూపంసదా ॥

ఇదియే కారణబ్రహ్మము లేక నిర్గుణబ్రహ్మము అద్వితీయము కనుక ఏకైక కేవలతత్త్వము, పరిపూర్ణము. అవ్యక్తమను పదమునకు సూటిగ నన్వయింపదగు పరబ్రహ్మతత్త్వమిదియే. ఇది సత్వోద్రిక్తమై వ్యఖ్య (వ్యక్తము) అను ఆవరణశక్తి యైనది. రజోద్రిక్తమై మహత్తను విక్షేపశక్తియయ్యెను మరియు తమోద్రిక్తమై అహంకారమనెడు స్థూల శక్తిగ పరిణమించెను. దీనియందు ప్రతిబింబించిన హిరణ్యగర్భ చైతన్యము విరాట్టనబడును. అనగా ఆ పరమాత్మనుండి ప్రకృతి పుట్టెను. మంత్రం॥ 'తస్మాద్విరాడ జాయత' (ప్రకృతి). విరాటో అధిపూరుషః (పు. సూ). చైతన్యము ప్రకృతి యందు ప్రతిఫలింపగా ఆప్రకృతి బింబమే జీవ తత్త్వమును బొంది విరాట్పురుషుడని ప్రసక్తమగు చున్నది. సజాతోఅత్య, రిచ్యత=మనుష్యులు జంతు జాలములతో గూడిన ప్రపంచోత్పత్తి యయ్యెను.

**18. అమానిత్వము** ఆత్మస్తుతి నభిలషించమండుట,

**19. అవచ్ఛిన్నము** కప్పబడి, ఆవరింప బడియున్న శబలితమై యున్న, పరిమితికల్పింపబడి యున్న *(that which is Conditiond)* ప్రయోగము = అంతఃకరణమున చైతన్యముచే గలుగు పరిమితిని

దేలుపుటకును, మాయచే ఈశ్వరుడు అవిద్యచే జీవులను ఎట్లు పరిమితమగు చున్నారో దేలుపుటకు పకరించును.

ఉ॥ *A.* అంతః కరణమున అనంత చైతన్యమును పరిమిత పరచి ఘటస్థుడని వ్యవహింతిచినట్లు.

*B.* అనంత ఆకాశమును ఒక కుండలో ఇమిడి నంతవరకు పరిమిత పరచి ఘటాకాశమని పేరిడినట్లు.

కాని, కుండయందలి ఆకాశభాగము అనంతమగు ఆకాశము నందంతర్గతమైనట్టిదేనని గుర్తుంచుకొనవలయును. అందుచే ఘటాకాశము బోధనాసౌకర్యము నుద్దేశించి కల్పించిన పదమేనని తెలియబడుచున్నది. మహాకాశమునందొక సూక్ష్మాంశమే ఘటాకాశముగ, కుండయొక్క పరిమాణమునందు పరిమితపరచబడుటయే అవచ్ఛిన్న భావబోధకము.

**20. అనవస్థాదోషము** *Regresus ad infinitum.* తేంపులేని కల్పనతో ఒకనిర్ణయమునకు రావీలుగానిస్థితి. అనుస్యూతమగు కల్పన. ఉ॥ గింజలేనిదే చెట్టు కలుగుటయెట్లు, చెట్టులేనిదే గింజలభించుట యెట్లు ? అను రీతికల్పనా సంభాషణ. అన్యోన్యాశ్రయ సంబంధంచెట్టు గింజకుగలదు. ఇట్టి దోషములే మరికొన్ని న్యాయదర్శనమున చెప్పబడి యున్నవి.

**21. అవ్యాకృతము** వికృతిపొందనిది. అంటేపరిణామ ప్రక్రియచే రూపాంతరము బొందనితత్త్వము - *the change less principle.* పారమార్థికమునదిది బ్రహ్మకు మాత్రమే వర్తించును.

**22. అధ్యవసాయము** కృతనిశ్చయము, *determi-nation* నేతి నేతిప్రక్రియవల్ల *determinatisest negation.*

**23. అధికృతము** ఒక ప్రసంగమునందలి విషయము.

**24. అనుమితి** *Inference* ఒకవిధానమునుబట్టి మరొక భావమును ఊహించి గ్రహించుట.

**25. ఆవృతి** ఆవరణము — ఆవృతము : ఆవరించబడినట్టిది.

**26. సాంఖ్యము** అనగా సంయక్ఖ్యాతి ఇదియే వేదాంతదర్శనశాస్త్రము. దీనిభావము, సత్యమగు అధిష్ఠానపదార్థముయొక్క జ్ఞానము *(Right knowledge of the Substratum)*. ఇది బాదరాయణనిభావము. తత్త్వముల సంఖ్యానుసారము 25 తత్త్వములతో జరుగు జగన్నిర్మాణవిధానము కపిలునిసాంఖ్యదర్శనము నందున్నది. దానిని కపిలసాంఖ్యమంచురు.

**27. వాసన** ఒక కోరికను గలిగించు అజ్ఞాతప్రేరణ *n instinct.*

**28. విభవము** మహిమ.

**29. విప్రతిపత్తి** వ్యతిరేకభావము: *contradiction.*

**30. కారణశరీరము** *the causal body A product of Avidya which acts as the seed.*

**31. కర్మ - అకర్మలు** కర్మయనక్రియాపూర్వకమగు కభావమునామ. కర్మసంజ్ఞచే దెలియబడునది "ప్రకృతి". ఇది దేహం

క్రియమనో బుద్ధ్యాత్మకమగునొక కర్మాశ్రయ (*objective*) తత్త్వము. స్వాపరిణమించుచు మార్పులజెందుచుంటచేనిది మిథ్యయని జెప్పబడు చున్నది.

**32. అకర్మ యన** తూష్ణీం భావముతోగూడిన నైష్కర్మ్య గాదు నిర్వ్యాపారత్వమునుగాదు. ఇట్టి అకర్మయునొక నిర్వ్యాపారస్థితియని ప్రతీతిగలదు. కాని, కర్మయందకర్మ నుపలక్షింపవలయుననుటలోను దృశ్యమునందు — చిన్మాత్రము, నిర్వికారమునగు ఆత్మనుదెలిసికొనుటయే గాని స్వస్వరూపధర్మమగు అచలస్థాయిననుభూతి బొందుటగాదను లక్ష్యార్థ మును గ్రహించుటయే పరమార్థమగును.

శ్లో॥ కర్మణ్యకర్మయః పశ్యేదకర్మణిచకర్మయః (గీత 4-18)

దేహేంద్రియ మనోబుద్ధులతో గూడినది (*matter*). అకర్మ యన - నిర్వికారనిరంజన జ్ఞానమాత్రమగు స్వస్వరూపము.

కర్మ = నామరూపాత్మకము అకర్మ = చిన్మాత్రమగు ఆత్మ తత్త్వము. కర్మయందకర్మను చూడవలెననగా దృశ్యమాన జగత్తునందు చిన్మాత్రము నిర్వికారమునగు ఆత్మను దెలిసికొనుటయేగాని స్వస్వరూప ధర్మమగు అచలస్థాయియనుభూతిగాదని దెలిసికొనవలె ననుటయే గ్రాహ్యాంశము.

**33. ప్రాజ్ఞుడు** భూతభవిష్యద్వర్తమాన విషయక జ్ఞాతృత్వముగలవాడు. అనగా తానుప్రకాశించుచు సర్వమునుప్రకాశింపజేయు తత్త్వము.ఇదియే జ్ఞానస్వరూపము.

**34. భోజ్యము** జాగ్రత్స్వప్నసుషుప్తులయందు పొందు అనుభవము. ఆయాయవస్థాభేదాను గుణ్యముగ ఆయనుభవములు భంగీ భేదములతో గలుగు ననుభూతులును.

**35. భోక్త** ఆయాయవస్థలలో విశ్వ, తైజస, ప్రాజ్ఞ నామములతో వ్యవహారమునకువచ్చు జీవభేదములతో అనుభవించునది.

**36. అభిమానించుట** ఒకానొకతత్త్వముతో తాదాత్మ్య భావమునుబొందువాడు. ఉ॥ ఈశరీరమునాది ఈశరీరమేనేనను తాదాత్మ్య భావమునుబొందుటయే అభిమానించుట. వ్యష్టిగ విశ్వతైజస ప్రాజ్ఞులును, సమష్టిగవిరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతులును ఆయాస్థూల సూక్ష్మ కారణ శరీరులకభిమానులు.

**37. విప్రతిపత్తి** భేదము, భేదభావము.

**38. ధర్మము** దానము; ఆస్తులకు ఉపాదానపదార్థము నొసగుట; ఒకవస్తుసహజగుణలక్షణములు. ఉ॥ వాయువునకుస్పర్శ అగ్నికి దాహకము, వేపకుచేదు చేరుకుకుతీపిధర్మములు; ఒకయుద్యోగమునందు నిర్వహింపనగువిధి: "దేహస్యధారకాద్ధర్మః" దేహమును ధృతితో జీవ శక్తితో నిలిపియుంచువాడు అనగాఇచ్చట ధర్మశబ్దము జీవునికివర్తించును.

ఈదృష్టితో జరామరణనిర్ముక్తాః స్వర్వేధర్మాస్స్వభావతః" (గౌడపాదకారిక 10 - అలాతశాంతి).

ఇంకసర్వేధర్మాః అనుపదము సర్వజీవులకు, వారుప్రదర్శించు కర్తృత్వభోక్తృత్వ అహంకారాది జీవధర్మములకు వర్తించునని చెప్పబడి నది. ఇంకననే విజయగోపాలమను నాగ్రంథములో సర్వధర్మాన్ పరి త్యజ్య అనుపదమునకు "సర్వజీవధర్మాన్ పరిత్యజ్య"యను లక్ష్యార్థమును సూచించి చిత్కాతపస్విగ అభినందనలకనుగ్రహపాత్రుడ నైతిని. "చోదనా లక్షణోఽర్థః ధర్మః" (పూ. మీ)

**39. వ్యాకృతము** ఒకరూపాన్నితీసుకున్నది.

**40. అవ్యాకృతము** నామరూపములులేనట్టిది.

**41. నిర్వికల్పము** రెండుపక్షములుగా జెప్పవీలులేనిది. *that, without an alternative.*

**42. నిరుద్ధము** నిరోధింపబడినది.

**43. రోచిస్సు** కాంతి *effulgence*

**44. ప్రమాత** *subjcet*

**45. ప్రమేయం** *objcet*

**46. ప్రమాణము** *means of knowledge*

**47. ప్రమితి** ప్రమ *knowledge*

**48. నిష్ప్రపంచము** ఆత్మతత్త్వము: ప్రపంచముగ స్పష్టముగాని ఏకైకమూలపదార్థము.

**49. ప్రపంచ్యతే** సృష్టీకరించబడుచున్నది.

**50. చిదాభాసుడు** తత్త్వశాస్త్రములయందలి ఆభాసయన - స్వయంప్రకాశ తత్త్వము యొక్క ప్రతిబింబము: మరియు సత్పదార్థము "చిత్" అను నామముతో వ్యవహరించబడుచున్నది. కనుక చిదాభాసుడను పదము చిత్పదార్థపు ప్రతిబింబమను భావమును గలిగించుచున్నది.

*N. B.* ఒకనిర్దృక్పరిధియందు ఒకబింబమునకొక ప్రతిబింబము గోచరింపసాధ్యమగునుగాని, అనంతపరిధిగలిగి విభువై, సర్వము తానై యున్న నాబ్రహ్మతత్త్వమునకు బింబమెట్లుప్రాప్తించగలదను శంకకవకాశముగలుగుచున్నది గదా ! అనగా బింబరూపమే లేనిదానికి, ప్రతిబింబమెట్లు సందర్భపడగలదను శంకకొందరికైనను కలుగకపోదు. ఇందుకు, పరిమితభావముతో నూహించితెలుసుకొనదగిన ప్రత్యగాత్మనే బింబముగ భావింపగలిగినయడల మనచర్చసామరస్యమును సంతరించుకొని సాగిపోవచ్చును. అస్తు ! ఐతే అద్వైతసిద్ధాంతమున బోధనాసౌకర్యము నుద్దేశించి ఈప్రతిబింబమునకొక వ్యక్తిత్వము నాపాదించిన, *(personification)* అది చిదాభాసుడుగ ప్రసక్తమగును.

జన్మాంతరవాసనలతో, సంస్కారములతో, మలినమై యున్నట్టిదీ మనసు. ఇట్టిమలినమగు మనస్సునందున ప్రాప్తించిన ప్రతిబింబమునందు ఆవాసనలుసంస్కారముల ప్రభావముచే దేహాత్మభావము మొలకలెత్తి తాదాత్మ్యస్థాయివరకును పెంపొందించునీ చిదాభాసునకు. అప్పుడు ఈతనికి కర్తృత్వభావమును *(Subjectivity)* భోక్తృత్వభావమును (సుఖదుఃఖముల భోగించుచుండుభావము) కలిగించి "అహం" అనుబుద్ధి జాతినిపూర్తిగ ప్రాప్తింపజేయును.

ప్రయోగము : అద్వైతులు - పరబ్రహ్మమునకు ఈ కర్తృత్వ భోక్తృత్వ అహంభావముల నారోపించిన నంగీకరించదు శాస్త్రము.

బ్రహ్మమునకీ ముప్పుదప్పించి, కేవల బ్రహ్మ భావమును మాత్రము నిర్ధా
రించిదెలిపి, కర్తృత్వ భోక్తృత్వములను భావములను చిదాభాసున కారో
పించిదెలుపుటకే ఈపాత్ర అద్వైత వేదాంతులచే సంభావించి కల్పించబడినది
అద్వైతమున కన్యములగు మతముల యందీచిదాభాసుడు ప్రసక్తముగాడు.

ఈతడే సేశ్వరసాంఖ్యుల పురుషుడు. కానీ, ఈతడు ద్వైతవిశిష్టా
ద్వైతులచే ప్రసక్తముజేయ బడుచున్న జీవుడు మాత్రముగాడు. ఏలనన—
ద్వైతుల జీవునకుగల ప్రత్యేక వ్యక్తిత్వము, నిత్యసత్యత్వమున్ను ఈచిదా
భాసునకు వర్తింపపొసగదు.ఈతడు శ్రీసురేశ్వరాచార్యుల మానసికపుత్రుడు
శ్రీవిద్యారణ్యస్వామి కనుంగుమిత్రుడు. ఈతనిదొకకల్పిత మాధ్యమిక
పాత్ర. ప్రయోజనమన్ననో బ్రహ్మకునిస్సంగత్వము, నిర్వికారతయు
నిర్ధారించిదెలుపుటయే.

వాసనలు, సంస్కారములతోగూడి మలినమైన అంతఃకరణము
నందు భాసించు ప్రత్యగాత్మయొక్క వికృతప్రతిబింబముగ నీతని
వర్ణించుటయందు సామరస్యముగలదు. చిదాభాసునకిదియే నానీరాజనము

## కూటస్థుడు

ఈపదము వేదాంత శాస్త్రమునతరచుగ ఎదురగుచునే యుండును, దీనికి
"కూటోపంచనోమాయ" యను నిర్వచనమొకటిగలదు. కూటముఅనగా
అసత్యరూపప్రదర్శనము: అంతర్దోషము, అపాతరమణీయత అను భావములే
హెచ్చుగాతెలుపబడుచున్నది. ఉ॥ కూటసాక్ష్యము (క్రియ). కూటమన
వస్తుసముదాయము. ఇట్లురూపగుణక్రియా, సంఖ్యలకు సంబంధించి
తప్పుగా వాడబడుచుండుట అందరకువిదితమే. ఇందుకు ప్రమాణవచనము
కూటరూపం, కూటసాక్ష్యవచనం ఇత్యాదౌ కూటశబ్దః ప్రసిద్ధేలోకే । తథాచ

అవిద్యాది అనేక సంసారబీజం అంతర్దోషవత్ । మాయా ఽ విద్యావి వాచ్యతయా ప్రసిద్ధంయత్ తత్కూటం: తస్మిన్ కూటేస్థితం కూటస్థం తదధ్యక్షతయా (శంకరభాష్యం)

శాస్త్రదృష్ట్యై ఇట్టితత్త్వము శివశ్శక్త్యాయుక్తో యదిభవతిశక్తః ప్రభవితుం, అనుశ్లోకమున జెప్పబడిన శివునిదివ్యశక్తియే. ఇదిపరమ శివునితో యోగమువనుండుయోగమాయయే । కానీ, ఇది త్రిగుణాత్మిక ప్రకృతియైన తరువాతమాత్రమే కూటోపంచనామా యందునసీపదమునకు అన్వయింపసందర్భములు లభించును. ఇట్టికూటమునకు (త్రిగుణకూటమున కధ్యక్షుడుగనుండువాడే ఈచెప్పబడిన కూటస్థపదముసూచించును. రాశిరివ స్థితం అనునపుడే దేహేంద్రియమనోబుద్ధి కూటమునందుండు పరమాత్మ యొక్క జీవరూపాంశమేటొపాధికాంశమే కూటస్థుడని తెలిసికొనవలయును. మాయాంతుప్రకృతింవిద్ధి । మాయినంతు మహేశ్వరంఅనుశ్వేతాశ్వతర ఉపనిషద్వాక్యానుగుణ్యముగ మాయయన ప్రకృతియని, అవ్యక్తమైన మహేశ్వరుడనియు తెలియపచ్చుచున్నది. కూటమనరాశి (జడప్రకృతి). *(matter)*; దేవుడు అంతర్యామి *(Spirit)* అనియు దెలియు చున్నది. కనుక కూటము అను పదమునకు ప్రకృతి, హిరణ్య గర్భుడగు అంత ర్యామియని మరియు అవ్యక్తమగు పరమాత్ముడనియు విశదీకరింపబడు చున్నది.

తథాచ అవిద్యాది అనేక సంసారబీజా అంతర్దోషవత్ మాయా అవి ద్యాది శబ్దవాచ్య తయా ప్రసిద్ధంయత్ కూటం (శంకరభాష్యం)

1. తస్మిన్‌కూటేస్థితం కూటస్థం: తదధ్యక్షతయా ।
2. కూటోరాశి: రాశిరివస్థితం కూటస్థం (శం. భా.)

పైకిషేడిపండువలె చక్కగా కనిపించుచు లోపలదోషములతో. గూడియుండెడిది కూటము. ఇదియే జడప్రకృతి (రాశి = *matter*). దీనికి గల రెండవఅంశ హిరణ్యగర్భరూపశక్తితో *(spirit)* గూడియుండునది. ఇదియే అంతర్యామి; దీనినే దేవుడనివ్యవహరించుచున్నారు. *Spirit* అనగా ఉపాధితోకూడియున్న చైతన్యము.

కనుక కూటమనుపదమునకు ఇప్పుడు అసత్యప్రదర్శనకుపకరించు వస్తుసముదాయము అనుఅర్థము ఒకవర్గముగ తెలియబడుచున్నది. ఇది లౌకికదృష్టితో చెప్పబడుఅర్థము.

పారమార్థికదృష్టితో నిదిమాయ యనిగ్రహించనగును. "అఘటనా ఘటన పటీయసిపారమేశ్వర శక్తిరేవమాయ"యని శ్రీశుకుడు ప్రవచించిన దృష్ట్యా ఇట్టిమాయనొక తత్త్వముగ సంభావించియున్నారు శైవశాక్తేయులు. ఇట్టికూటమున కధ్యక్షుడుగనుండువాడే పారమార్థిక కూటస్థుడు ఈతడేఈశ్వరుడు మహేశ్వరుడు అనబడుచున్నాడు. ఐనను మాయనొక తత్త్వముగ నంగీకరింపరు అద్వైతులు. ఇదిశైవశాక్తేయులకు ప్రతియోగిభావము. కనుక కూటస్థుడను పదములౌకికముననొక ఆపాతరమణీయ సముదాయమునకును, పారమార్థికమున హిరణ్యగర్భుడనబడుపరాప్రకృతికిని మాత్రమేగాక మహేశ్వరునకును వర్తించుచున్నది.

ఇక బ్రహ్మతత్త్వమునందు స్థాయీభేదముల పరిశీలింతము.

1. పరబ్రహ్మమే మూలతత్త్వమగు సర్వాత్మక స్థాయి. దీనినే *The Unity Consciousness* అందురు. ఇదికారణ స్వరూపమగు అచల, నిర్గుణతత్త్వము.

2. పరమాత్మస్థాయి : ఇందాపరబ్రహ్మ మాయోపహితు డగును అనగా శుద్ధమాయతోసంసర్గముపొందుటచే సగుణబ్రహ్మ యనువ్యవహారమునకు వచ్చును. ఇది విశ్వాత్మకస్థాయి *the cosmic consciousness*. అద్వైతుల దృష్టిలో ఈతడే సృష్టికికారణము.

3. జీవుడు : అవిద్యావచ్ఛిన్నత వలన బ్రహ్మయొక్క అంశ జీవతత్త్వమని జెప్పబడుచున్నది. ఇదివ్యక్తిగతస్థాయి *(individual State)*

అవ్యక్తము, అక్షరమనుపదముల నవగాహనతో పరిశీలించిన - 1) భగవత్పరముగను, 2) జడప్రకృతిపరముగనూ కూడ ప్రయోగింపబడగలవనియే తెలియుచున్నవి. ఇట్లేకూటస్థపదమున్ను సందర్భానుసారము జడప్రకృతి, జీవతత్త్వము ఆత్మతత్త్వములగు మూటికినీవర్తింపజేయ నవకాశములగన్పించుచున్నవి. అవ్యక్తమనుపదమును సూక్ష్మశరీరమునకు వర్తించిజెప్పుదురు కొందరు. ఏమన —

శ్లో॥ అవ్యక్తాద్వ్యక్తయః స్సర్వాః ప్రభవన్త్యహరాగమే ।
రాత్ర్యాగమే ప్రలీయన్తేతత్రైవావ్యక్తసంజ్ఞకే ॥ (గీ. 8-18)

సృష్టికి మూలకారణమైన దవిద్యలేకమాయయని చెప్పబడెడిది జడప్రకృతియనిభావము. ఏమన - ప్రధానము (ప్రకృతి) సత్త్వరజస్తమోగుణాత్మకమని సాంఖ్యులు తెలుపుచున్నారు. కాని గీత 8-20లో పూర్వోక్తమైన అవ్యక్తమున కన్నను విలక్షణమైన మరొక అవ్యక్తమున్నదని ఇదే అక్షరపరబ్రహ్మమనియు ఈ విలక్షణమగు అవ్యక్తమునకే "అక్షర" మని పేరనియు తెలుపబడినది. మరియు అ 12లో 3వ. శ్లో॥ ఏత్వక్షర మనిర్దేశ్యమవ్యక్తంపర్యుపాసతే।సర్వత్రగ మచింత్యంచ కూటస్థమచలంధ్రువం॥

అని చెప్పబడియున్నది. ఇదియే కూటస్థపదమునకు పారమార్థిక భావ నిర్వచనము.

గ్రాహ్యాంశము : అక్షరం, అవ్యక్తం, కూటస్థం అను మూడు పదములను ఏకగ్రీవముగ పరబ్రహ్మ పరములేయని శంకరుని వ్యాఖ్య.

---

## శాఙ్కరాద్వైతము

జీవబ్రహ్మైక్యభేదమును దెలుపుచు,పిదపఅనన్యభావమును నిర్ధారించి దెలుపుసిద్ధాంతమే అద్వైతసిద్ధాంతము. ఇందు జగత్తుమిథ్యయని దెలుప బడును. మాయాశబలితుడై యున్నందున ఈశానుడగు ఈశ్వరుడును మిథ్య యనియే బోధింపబడును. ఇది ఉపనిషత్ప్రతిపాదితమై యున్నను — కొందరు శుద్ధాద్వైతమనియు మరికొందరు విశిష్టాద్వైతమని, వేరొకరు భేదాభేదవాదమనియు పలువిధములమలచి, వారివారితాత్త్విక ప్రతిభకను గుణ్యముగ రూపొందించిబోధింప సాగించిరి.అద్వైతమునకు గల్పించిన ఇట్టి భంగీభేదములలో శాంకరాద్వైతమను నొకతాత్త్వికవిధానము ప్రముఖమై గణుతికివచ్చియున్నది. ఉపనిషత్తులే అద్వైతసిద్ధాంతమునకు కాణాచియను భావముసుప్రతిష్ఠితమైయున్నను శాంకరప్రణీతమగు విశ్లేషణావిధానమునకు శాంకరాద్వైతమనుపేరు ప్రసక్తమగుచు, ఆయన అభిధేయమునకే అంకితమై విరాజిల్లుచున్నది. దీనికిగల ప్రాతిపదికను పరిశీలించి అంశముల పరిగణించుటావశ్యకము. అద్వైతమనునది కేవలము ఉపనిషత్ప్రతిపాదిత మాత్రమే యగునెడల అందిన్ని భావభేదము లెట్లుప్రాప్తించగలవను శంక గలుగకపోదు.

అద్వైత సిద్ధాంతమునకు మూలసూత్రము "కారణంపరమం సత్యం కార్యం వై వ్యావహారికం" అనియే చెప్ప బడుచున్నది. సత్యమును నిర్ణయించి గ్రహించుటకు వ్యావహారిక దృష్టితోనూ పారమార్థిక దృష్టితోనూ పరిశీలించి గ్రహించుట ప్రజానీకమునకు పరిపాటియై యున్నది.

పారమార్థిక దృష్టియన — నిత్యసత్యము లగు భావములను రాగద్వేషములచే స్పృశింప బడనీయక, జ్ఞానేంద్రియము లందించు భాషకు చెవి యొగ్గి ప్రభావితులుగాక, నిరంజనమగు దృష్టికి గోచరమగు నిత్యసత్య భావములను, శ్రవణమననములచే గ్రహించి నిదిధ్యాసతో నిశ్చయాత్మకము గావించుకొని సమాధియందనుభూతి బొందుటయే పారమార్థికదృష్టి. అస్తు! ఐనను, పారమార్థికరూపము సాధారణ ప్రజానీకమునకు యథాతథముగ, అనుభూతికి రాక రూపాంతరములలో తెలియ వచ్చుటలో కానుభవమై యున్నది, అనగా స్వభావ సిద్ధమగు రూప మొకటియై యుండగా మనఇంద్రియముల మాధ్యమమున లభించు జ్ఞానము, మారు రూపముల స్ఫూర్తిని ప్రాప్తింప జేయును. ఇది యొక స్ఫూర్తియేగాని వస్తు సహజమగు నిజరూపముగాదు. ఇది ప్రమాతకందు దృష్టి మాత్రసంజనిత రూపమేగాని తాత్త్వికమగు సహజరూపముగాదు. ప్రమాతకు ప్రాప్తించు జ్ఞానరూప దృష్టికిగోచరించు రూపమే స్ఫూర్తి. దీనియందు గలుగు విశ్వాసమే అధ్యాస. ఈమూడక్షరముల పదమే శాఙ్కరాద్వైతమను పేరును సుప్రతిష్ఠితము జేసినది.

కారణమనగా, ఈసృష్టికి ఆది కారణమేదో అదియే. *(the first cause)* విషయవివేక విచారణ మిమ్మును పరమాత్మ వరకును పయనింప జేయనవ కాశముల గల్పింపవచ్చును. ఇదియే పరమార్థమునకు ప్రయోజనము. అదియేనిత్య సత్యము, అవినాశి, అనాదియునగు పదార్థము.

కార్యమన ఆ కారణపదార్థము వలన సృజింపబడిన జగత్తు (దృశ్యము), *(the appearances)* అని భావము. కాలచక్ర పరిభ్రమణము నందివి యొకనాడు లయించక తప్పనందున నీదృశ్యముల వ్యావహారికములని సామాన్యుల చేతను, మిథ్యయని తాత్త్వికులచేతను చెప్పబడు చున్నవి. ఉనికి, యున్నంత కాలము మాత్రమే పరిగణింపబడినను, అదియామిథ్యా రూపమున సత్యముగనే స్ఫూర్తినిచ్చును గనుక కార్యములను అసత్య మనరాదు. కనుక వేత్తలు, కార్యములనిర్వచనీయములని చెప్పిసమన్వయు మును దెలిపిరి. సత్తు అసత్తు, సదసత్తు, సదసద్విలక్షము అను స్థాయిల దెలిపి వాటి నతిక్రమించిన స్థాయియే అనిర్వ చనీయమని దెలిపిరి.ఆస్థాయి యందలితత్త్వమే మాయాశక్తి. ఇదియే మాయకు నిర్వచనము. గనుక నాదృష్టికి మాయ అనిర్వచనీయముగాదు. ఈపైజెప్పిన లక్షణములు గలదియే మాయ. *N. B.* భ్రమగలుగు స్థానమునందు స్ఫూర్తినిచ్చు సర్పముగాని మరియేదియైనగాని, దాని విషయక మగుజ్ఞానము సాక్షికి మాత్రమే భాస్యమగును. కానీ, అవి అంతః కరణ పరిణామము వలన ప్రాప్తించినవి గావని మాత్రము గుర్తుంచుకొనవలయును. అంతః కరణకు పైస్థాయిది అతీంద్రి యస్థాయియే. ఈస్థాయియందనుభూతి నిచ్చునదియే అనిర్వచనీయతత్త్వము.కనుకనే ఇది అనిర్వచనీయమై ఒక్క పరమాత్మకు మాత్రమే అన్వయముజేయ యోగ్యమగుచున్నది. *It is a mysterious unseem force* అని పరమాత్మవిషయకముగ తన గ్రామఫోనురికార్డు యందు మహాత్మగాంధిగారు ప్రవచించియున్నారు. దీనినే "మాయ" గా సంభావింప వచ్చునని నాభావము.

ప్రాతిభాసికమను పదమునకర్థము - వస్తువు ఒకటిగాయుండ - దానికిసహజమైయుండనికొన్ని క్రొత్తరూపగుణములసంభావించి దానియం

దారోపించి ఆరూపగుణములతో గూడిన క్రొత్తవస్తువే అసలువస్తువని విశ్వసించుటయే. ఈవిశ్వాసమునకే స్ఫూర్తియనియు అధ్యారోపమనియు, దీనికికారణ మధ్యాసయనియు పేర్లు. దీనినేమరికొంతపైస్థాయి యందు సందర్శింపగలవారికిది వివర్త మనియు దెలియబడి వివర్తదృష్టి యననేమో తెల్లముగాగలదు. కానీసమగ్రభావమును సుస్పష్టముజేయగలదియు, అవిద్య, అజ్ఞానమను పదములకుగల అన్నిపేర్లను అలింగనముజేయగల పదము భ్రాంతి. ఈభ్రాంతిని గ్రహించినవారికి మాత్రమే శాంతి. ఈ స్ఫూర్తిని లేక భ్రాంతినికలిగింపజేసిన వస్తురూపము అధిష్ఠానపదార్థముపై నిజముగా యున్నట్లే సంభావించి విశ్వసించుటయే అధ్యారోపము. ఆత్మాశ్రయ వస్త్వాశ్రయభావముల సంసర్గముబొందినపుడు ప్రాప్తించునదియే "మాయ" ఆ మాయాకార్యమే అధ్యాస; అధ్యాసయే భ్రాంతిజనకము; ఈభ్రాంతిజ్ఞానమే ఈ మిథ్యాపూర్వక జగత్త్వమునకు మూలకారణము మిథ్యాభావబోధకమగుమాయావాదమే శాంకరాద్వైతమునకు పట్టుకొమ్మ. ఈపట్టుసడలించుటకే రామానుజుడు **శ్రుత ప్రకాశికయను** తనగ్రంథమునందు శంకరదర్శనమును పూర్వపక్ష మొనరింపయత్నించెను. కాని, ఫలితముల ప్రభావమును ఇదమిద్ధమనిచెప్పసాహసించజాలము.

మరొకవిషయమేమన — కేవలభ్రాంతి పూర్వకమగు అధ్యాసకు పూర్వానుభవపూర్వకమగు స్మృతిజ్ఞానముకూడ నొకసహకారి కారణమని దెలియుచున్నది. ఇదియే పదార్థముగాని — పదార్థము. ఇందలి పదార్థరాశి స్మృతి జ్ఞానమేగావచ్చును లేదా ఆకారములు అధ్యాసవలన ప్రాప్తించు భావరూపములేగావచ్చును *(appearances and illusions)*. ఈ అల్పవివేక ప్రాతిపదికపై శంకరాద్వైతమున నెదురగు విశిష్టభావముల గ్రహింప యత్నింతము :—

1. శివ - శక్తులకు అద్వయభావమున్నదని శైవశాక్తేయుల విశ్వాసము. ఇందు సృష్టికార్యము శివునినుండియే ప్రారంభమగునని శాక్తేయుల జెప్ప - కాదు ! సగుణబ్రహ్మమునుండియే ప్రారంభమగునని అద్వైతులు నిర్ధారించిదెలుపుటవలన సృష్టికార్యమున కంకురార్పణయందే భేదభావము ప్రతిష్ఠింపబడినది. శాక్తశాంకరీయుల భేదభావములకిదియే నాంది.

2. శాంకరాద్వైతమున జీవన్ముక్తికపకాశ మంగీకరింపబడినది. జీవన్ముక్తియన మాయాస్వరూపమునుదాని కార్యములనుగ్రహించి అదువునకు తెచ్చుకొని ఆవరణవిక్షేపశక్తులకు వశుడుగాకయే "జగద్బ్రహ్మ" యనుదృష్టితో జీవయాత్ర గడుపుకొనుటయేగాని ఈప్రమాత ఇష్టేయుండగా జగత్తేలయించి పోవుటగాదు. ఇతర సిద్ధాంతములవారు క్రమముక్తి, విదేహముక్తులనంగీకరింతురుగాని జీవన్ముక్తినొప్పరు.

3. శాంకరాద్వైతమున శక్తినిజడముగనే పరిగణింతురు. అది బ్రహ్మసాన్నిధ్యముననుంటచే క్రియాకారకమగుచున్నట్లనుభూతిని మాత్ర మిచ్చునని నిర్ణయింతురు. ఇది "శక్తి శక్తిమతోరభేదః" అనుభావమున-కంగీకారముగలేదు. మరియు అంతఃకరణమునకు చింతనాశక్తియు దేహమునకు ప్రాణశక్తి కార్యములజేయుదక్షత, జడతత్త్వమునకెట్లు సంభావ్యములగును ?

4. శాంకరాద్వైతము జ్ఞానకర్మల సముచ్చయవాదము నంగీకరించుటలేదు. ఈరెండునిష్ఠలకును అధిష్ఠానము పరబ్రహ్మమేనని అంగీకరించునెడల — బాధసామానాధికరణ్యముచే సర్వభావములును అపవదింపబడి బ్రహ్మతత్త్వమొకటియే సిద్ధించును. అద్వైతమునంకేనిష్ఠలు

రెండును లక్ష్యమునకనుయోగిసాధనము కేగాని నిరంకుశ ద్వైత భావస్థాపన సాధనములుగావు. *These are not factors to esatablish, absolute dualism but are conducive to monism only.* గ్రాహ్యాంశ మేమన — సాధనములనబడునీనిష్ఠలు అధ్యాసదోషనివారణకు మాత్రమే ఉపకరించును. బ్రహ్మసిద్ధపదార్థముగనుక ఆత్మత్త్వమును సిద్ధించుకొనుటకు మాత్రముగావనియే.

"అద్వైతం సిద్ధిరిత్యేవద్వైతం సాధనమాహయః"

యనుశ్లోకమునందలి సాధనములవిషయమున జెప్పబడిన ప్రయోజన మీదృష్టికనుగుణముగనే, అవిలక్ష్యసిద్ధికుద్దేశింపబడినవిగాక, అధ్యాస నివారణకుద్దిష్టములైనవి మాత్రమనుటయే నిశ్చితార్థము.

5. శంకరాద్వైతమున పారమార్థిక సత్యమును బోధించుటకు ప్రాతిభాసికసత్యవివరణయే సుబోధక సాధనముగ సంభావింపబడినది. ఏమన — మిథ్యాప్రపంచకమున మనకు సర్వదా నెదురగు సంఘటనలు ప్రాతి [illegible]సికము లేగనుక, వస్తుస్వరూపమును ప్రదర్శించుటకు ముందు ప్రతి భాసవిశెట్లు ప్రాప్తించునో దాని స్ఫూర్తి ప్రాప్తించుటయందు భంగీభేదము లెవ్వియో [illegible]ర్వనివారికి పారమార్థిక స్వరూప బోధకు అన్యథామార్గము లభిం[illegible] గనుక, నీప్రాతిభాసిక రూపములపై నొకదృక్కును జ్ఞాననేత్రము నుండ [illegible]సరించుటత్యంతావశ్యకము. శాంకరాద్వైతమున నీప్రాతి భాసికము నకుగ[illegible]ంపబడిన ప్రముఖస్థాన మీ మిథ్యాభావనివారణకేనని గ్రహించవల[illegible]ను.

[illegible]ాధ్యమిక బౌద్ధుడగు నాగార్జునుడు ప్రాతిభాసిక సత్యమునకు ప్రాధాన్యత గల్పింపకపోయినను శూన్యమను పదమును బ్రహ్మకు పర్యాయ

పదముగ జెప్పియున్నందున ఆతడు ప్రాతిభాసిక సత్యమునంగీకరించినట్లే మనము సంభావింపవచ్చును. ఎట్లన—శూన్యమును బ్రహ్మగా నంగీకరించిన సర్వదృశ్యమానములున్ను అధ్యారోపితములైనట్లే గదా !

6. మరొక ప్రధాన విషయమేమన—"నేతినేతి" యను ప్రక్రియ. బ్రహ్మస్వరూప బోధవిషయమున ఇది ఇట్టిదను ఋజుభావ పూర్వకముగ బోధజేయబడినయడల (*positive statements*) ఆయనంత తత్త్వము నకు పరిచ్ఛిన్నత్వ మాపాదింపబడి, దాని వ్యాప్తి పరిమిత పరుపబడుట కవకాశము గలుగును కనుక న - ఇతి = నేతి యను తిరోభావ పూర్వక బోధనావిధాన మనుసరింపబడినది. నేతి యన—ప్రమాతవగు నీవుచెప్పిన ఈ లక్షణమును బ్రహ్మపదార్థమునకు గావు అని అపవదించి త్రోసిపుచ్చు టయే. నేతియన చిదంచనేతి అచిదంచనేతి ఇది చిత్తుగాదు—అచిత్తుయు గాదు అనగా నవిసల్లక్షణము లైనను నీవు జెప్పినవి బ్రహ్మకువర్తింపవు. అనిభావము.

7. శాంకరాద్వైతమున వివేకము గలిగించుటకు మరొక అవ్యక్త అనిర్వచనీయ భావ పదార్థమును పరిశీలించి గ్రహించవలసియున్నది. అదియే మాయ. శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమున జ్ఞాన ప్రబోధము నుపలక్షించి శంకరులు ప్రయోగించిన పదమే ఈ మాయ. ఇది జడపదార్థమనియే సంభావించి చెప్పబడినది. కానీ జడమగుదానికి మనోలక్షణమగు చింతనాశక్తి, ప్రాణ లక్షణమగు చలనశక్తియు యుండవుగదా ! ఐనను సాపేక్షిక భూమికయందు అనగా జగత్తత్వ పరిధియందు మాత్రము పరిగణింపబడక తప్పవు. కాని పారమార్థిక భూమియందు మాత్రము పరిగణింపబడు నవకాశములేదు, అంకురమునకు బీజము, బీజమునకు

దంతర్యామిగనున్న బీజశక్తి "శ్లో॥ బీజస్యాంతరివాఙ్కురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పునర్మాయాకల్పిత దేశకాలకలనా వైచిత్ర్యచిత్రీకృతం" అను శ్లోకమున నెట్లు చిత్రీకరింపబడినవో గ్రహింపగలుగువారికి "అఘటనా ఘటన పటీయసి పారమేశ్వరశక్తి రేవమాయా" యనుసూక్తి ఎంతటి వెలుగు ప్రసరింపగలవో విశదమగును.

సాక్షాత్పరమేశ్వర శక్తిరూపమైయుండి అఘటనాఘటన సమర్థమగు శక్తి జడమగునా ? లేక ధృతిమతియగు తత్త్వమే యగునా ? యని నాప్రశ్న "శివశ్శక్త్యాయుక్తోయది భవతి శక్తః ప్రభవితుం" అను శ్లోక భావానుసారము ఈశక్తి నాకారాధ్యము- నాకేగాదు పరమహంసలగు పీఠాధిపతులకును విధి యుక్తముగ నారాధింపవలసినదై యే యున్నది.

అద్వైతమునందు భేదములు——

1. శుద్ధాద్వైతము : బ్రహ్మకు మాయకును కార్యకారణ సంబంధమున్నదను సిద్ధాంతము.

2. భేదాభేదవాదము(భట్టభాస్కరునివాదము)ఆత్మపరిచ్ఛిన్నమైనందున భేదము; అసలు బ్రహ్మతో ఏకీభావముంటచేత అభేదము. కనుక కైవల్య స్థితియందుకూడ భేదాఽభేదభావములుండును. నింబార్కునిదిగూడ భేదాభేదవాదమే.

అవిరోధ మనుత్పాదమనుచ్ఛేద మశాశ్వతం
అనేకార్థమనానార్థమనాగమ మనిర్గమం
యః ప్రతీత్యసముత్పాదం ప్రపంచోపశమంశివం
దేశయామాససంబుద్ధ స్తంవందే వదతాంపరం ॥

(నాగార్జున మాధ్యమికకారిక)

**భావము :** ఇందలి — అవిరోధం: పుట్టుకలేని నాశము లేని రాకపోకలులేని మున్నగు అద్వయ బ్రహ్మనిర్వాణ లక్షణములు

బొద్దులజెప్పిరి. మరియు మాండూక్య కారికలు 2-32 నంబను జెప్పబడి యున్నవి.

రజ్జు సర్పము సత్‌గాని, అసత్‌గాని, సదసత్‌గాని ఈ మూటికినీ విలక్షణమగు మరొక అనిర్వచనీయ తత్త్వమనిగాని చెప్పవలయును. ఐనను ఇప్పుడు మాయ పరమేశ్వరశక్తియే యగు తత్త్వమని నిర్వచింప బడినది. గుణకర్మల పరిశీలించిన, అవి గుర్తింపబడకున్న అనిర్వచనీయ మనవచ్చునుగాని, నిరపేక్షిక పారమార్థిక భూమికయందు, మాయ మహేశ్వరులకు అద్వయమిధున భావమున్నదనియే జెప్పవచ్చును. కనుక సాపేక్షిక తత్త్వములయందలి, మాయవలననే అధ్యాస ప్రాప్తించుచున్నదని శంకరులు ప్రవచించి యుండిరి. ఈ తాత్పర్యమును గ్రహించినయడల విషయము సుగ్రాహ్యము కాగలదు. ఈ పదరచనకు సూత్రము 'అతస్మిం స్తద్బుద్ధిః' అనగా ఒక వస్తువునందు లేని రూప గుణ భావములను ఆ వస్తువున కారోపించి అవి, ఆ వస్తుగత స్వాభావిక గుణములుగనే విశ్వసించుటయే అధ్యాస.

ప్రయోగము : ఒక పదముయొక్క నియతార్థము, జ్ఞేయార్థముల గ్రహించి ఇది అది కాదని గ్రహించుటయే అధ్యాసవిచారణకు ప్రయోజనము.

గ్రాహ్యాంశము :అసలు స్ఫూర్తినిచ్చుచున్న వస్తురూపము, రాశిగా (*mass*) నచట లేకున్నను లోగడ చూడబడిన వస్తుస్మృతివలన అది ప్రాప్తించి అధ్యారోపితమగును. కాని ఈ స్మృతి రూపసర్పముకూడ రాశిరూపమున గోచరించి అది అసలు సర్పమను విశ్వాసమును కలుగ జేయుటయే అధ్యాస. అధ్యాస, భ్రాంతిజ్ఞానము, అవిద్య, అజ్ఞానము పర్యాయపదములు.

సజ్జన సమ్మతమైయున్న అద్వైత సిద్ధాంతమునకు శాంకరాద్వైత మను విలక్షణనామ మెట్లు సిద్ధించెనో వివేచించి తెలిసికొంటిమి. పునరుక్తి యనుకొనక ఇందలి అంశముల కొన్నిటిని గుర్తించుకొన యత్నించుటా వశ్యకముగ స్ఫురించి మరల పేర్కొనుచున్నాను.

1. అద్వైతమున ప్రధానసూత్రము "కారణం పరమం సత్యం-కార్యం వై వ్యావహారికం"- దీనిభావము కారణమగు బ్రహ్మసత్యము; తత్కార్యరూపముగ ప్రభవించిన జగత్తు మిథ్యయనియు, జగత్తుకూడ బ్రహ్మమేనని విశ్వసించి అనుభూతిని బొందగలుగు వరకు యీమిథ్యా భావమంగీకరించదగినదే. కొందరు కారణమగు బ్రహ్మను అనిర్వచనీయ మందురు; కాని. జ్ఞానికి ముఖ్యలక్షణం, సర్వజ్ఞత్వమే గనుక - ఈ భావము జ్ఞానికి వర్తించదు.

బ్రహ్మయునికి విషయమున, ఋజుభావము లుపయోగించి - ఇట్టి వాడిట్టివాడని జెప్పవచ్చును గాని ఇది ఆయనకు పరిమితమును గల్పించును గనుక అట్లుజెప్పరాదనిరి. పోనీ ఇట్టివాడుగాడని చెప్పినయెడల నిజరూప మెన్నటిని తెలియబడదుగనుక న - ఇతి = నేతి యను ప్రక్రియనుపయో గించుకొందమని కొందరు దెలుప, కాదు —— అనుకూలభావములు వద్దు ప్రతికూల భావములువద్దు అనిర్వచనీయమంటే అందరినీ సంతోషపెట్టి నట్లుంటుందని కొందరు విజ్ఞులొక పరిష్కారమార్గమును నిర్ణయించి దెలిపిరి

2. బోధనాసౌలభ్యము నుద్దేశించి మాయ నొక తత్త్వముగ నంగీకరించవచ్చునుగాని అప్పుడు ద్వైతభావము ప్రాప్తించునను భయము స్ఫురింప——దీనినొక తత్త్వముగనే పరిగణించక ఇది జడము పొమ్మంటే బాగుండునను సంకల్పము గలిగి మాయ నొక తత్త్వముగ నంగీకరించ మనిరి. మీరు మిక్కిలి జడమునకు మనోలక్షణములగు చింతన, సంకల్ప శక్తులగు మనోలక్షణములు, జీవక్రియాకారకములగు ప్రాణ శక్తులు ఎట్లు

గలుగును కనుక నిది జడముగాదని కొందరనిరి. మరికొందరు విజ్ఞులలౌక పరిష్కారమార్గము జూపిరి. ఏమన—సాపేక్షిక భూమికయందు జగత్తత్వ మునకు పరిమితపరచి—పారమార్థిక దృష్టికి అఘటనా ఘటన పటీయసి పార మేశ్వర శక్తిరేప మాయయనిరిగాని—మాయ పారమేశ్వరశక్తిమే యగు నెడల అది ఆరాధ్యమే గదా ! గుణకర్మల పరిశీలించి నిర్వచనీయమో అని ర్వచనీయమో యనవచ్చునుగాని—నిరపేక్షిక పారమార్థ భూమికయందు మాయ మహేశ్వరున కద్వయ భావముతో ఒకే తత్త్వముగ నంగీకరింప వలయుననుటే సమంజసముగ దోచుటలేదా ? అనిర్వచనీయ పదమొక లౌకికభావ సూచకముగలేదా.

3. సాపేక్షికతత్త్వములయందు మాయనే అధ్యాసగ శంకరులు పరిగణించుటయందు సామరస్యము గన్పించుచున్నది. ఈ అధ్యాస పదరచ నకు సూత్రము "అతస్మిం స్తద్బుద్ధిః" అనుపదమే.

ప్రయోగము : నియతార్థ జ్ఞేయార్థములకుగల సంబంధ మును సామరస్యముతో గ్రహించుటయే అధ్యాసపదమునకు ప్రయోజనము.

గ్రాహ్యాంశము : సగుణ నిర్గుణ పదభావముల నియ తార్థ జ్ఞేయార్థములద్వారా నివృత్తికి సహకరించునను బోధయే అధ్యాసపద వివరణకు లక్ష్యము. అధ్యాస పదవివరణమే శంకరాద్వైతబోధకు పునాది ఫలకము. ఒకరు జడమని మరియొకరు శక్తియునియు తమ తార్కిక ప్రతిభల ప్రదర్శించుటగాదు. అష్టాంగ యోగసాధన లేనిదే శక్తి ప్రాప్తిం చదు. శక్తిలేనిదే కైవల్యసిద్ధి లభింపదు.

## త్రిపుటి

సంబంధిత భావముల దెలుపు మూడు పదముల సంపుటిని త్రిపుటియందురు. ఇందుకొన్ని భేదములుగలవు.

**1. పద, వాక్య, ప్రమాణములు :** i పదమువ్యాకరణభావ బోధకము, ii వాక్యము మీమాంసకు సంబంధించినది, iii ప్రమాణమన న్యాయదర్శనమునందు ప్రతిపాదించి దెలుపబడిన ఒక సిద్ధాంతము. ఇది విషయనిర్ణాయక త్రిపుటి.

**2. ప్రమాత, ప్రమేయము, ప్రమాణము :** i బుద్ధీంద్రియముల ద్వారా జ్ఞాన సముపార్జన జేయువాడు *the Subject or Soul.* ii విషయ విచారణకను ప్రవర్తించు నొకవస్తువు ప్రమేయము. *matter or gagat.* iii ప్రమాణము : ఇందు ప్రత్యక్ష,అనుమాన,శబ్దములు. ప్రధానములు : మరియు, ఉపమాన, అర్థాపత్తి, అనుపలబ్ధియను మూడు (ఉపప్రమాణములును) గలవు. ఇది జ్ఞానసముపార్జనా త్రిపుటి.

**3.** అగ్ని, జలము, పృథ్వి అనునవి సృష్టికార్యమునకు సంబంధించిన త్రిపుటి.



# ప్రమాణములు

ప్రమ : ప్రమాజ్ఞానమున కేది సాధనము గలదో దానిని ప్రమాణమందురు. జ్ఞానము భిన్నభిన్న స్వరూపములతో వ్యక్తమగు చున్నది. అందు 1. ప్రమాజ్ఞానము ప్రమాతనాశ్రయించినది. 2. స్మృతి జ్ఞానము - సాక్షి నాశ్రయించినది. 3. భ్రాంతిజ్ఞానము 4. సంశయజ్ఞానము అనబడునవి సాక్షి నాశ్రయించినవి, వీటిని ప్రమయనరాదు. అంతఃకరణ వృత్తిరూప మేద్దిగలదో అదియే ప్రమాత నాశ్రయించి యుండునది. దానినే ప్రమ యందురు. స్మృతి భ్రాంతి, సంశయజ్ఞానములు మూడును ప్రమకు చెందినవిగావు. అంతఃకరణ వృత్తిరూప జ్ఞానమేదియో అది ప్రమాతనాశ్రయించినందున దానినే "ప్రమ" యందురు. కావున స్మృతి కన్నభిన్నమైన జ్ఞానమునే ప్రమ యనవలయును. ఇదియే యదార్థజ్ఞానము. ప్రమయన అబాధితార్థమును విషయము జేయుజ్ఞానము. మాత్రమేప్రమ. భ్రాంతి జ్ఞానము అబాధితార్థమును విషయము జేయదు. కనుక దానియందు ప్రమ లక్షణము లేదు. ఎవనిమతములో స్మృతి జ్ఞానమందు ప్రమా వ్యవహారము గలదో వానిమతమునందు స్మృతిజ్ఞానమును అంతఃకరణవృత్తి యందురు గాని అవిద్యావృత్తి యనరు: సాక్ష్యాశ్రితమనియు యనరు — దానిని ప్రమాత్రాశ్రితమనియే యందురు.

*N. B.* వేదాంత సిద్ధాంతానుసారము ఇంద్రియములకు ప్రమాజ్ఞానముయొక్క కారణతలభించదు. ఏమన - చైతన్యమునకు నాలుగు భేదములు జెప్పబడుచున్నవి — 1. ప్రమాతృచైతన్యము 2. ప్రమాణ చైతన్యము 3. ప్రమితి చైతన్యము (ప్రమాచైతన్యము) 4. ప్రమేయ చైతన్యము (విషయచైతన్యము) ఇట్లు చైతన్యమునకు పేరు ప్రమయన బడును. ఆ చైతన్యము నిత్యము, ఇంద్రియజన్యముగాదు.

ప్రమాణములు ఆరుగ వర్గీకరింపబడినవి.

1. ప్రత్యక్షము 2. అనుమానము 3. శబ్దము 4. ఉప మానము 5. అర్థాపత్తి 6. అనుపలబ్ధియు.

వీనిలో చార్వాకుడు (విరోచనుడనబడు నాస్తికుడు)ప్రత్యక్షప్రమాణ మును మాత్రమంగీకరించును. వైశేషిక దర్శనకర్త యగుకణాదుడును సుగతమతానుసారులును (బౌద్ధమునందలి శాఖలకలయిక) అనుమానమును కూడ నంగీకరింతురు. కనుక కణాదులు ప్రత్యక్ష, అనుమానములగు రెండుప్రమాణములను అంగీకరింతురు. కపిలుని అనుయాయులగు సాంఖ్యులు మూడవదగు శబ్ద (వేదఉపనిషద్వాక్యములు శబ్దములు) ప్రమా ణమును కూడ అంగీకరించుచున్నారు. 4వ ప్రమాణము ఉపమానము. చతుష్పాత్తులగు సర్వజంతువులలో ఒక గవయము(గంగడోలు) మాత్రము గోవుకు గుర్తగుచున్నది. గనుక నీయుపమానముతో గోవును పోల్చుకొన వచ్చును గదా ! కనుక న్యాయదర్శన కర్తయగు గౌతమునిచే నీయుపమాన ప్రమాణమంగీకరింపబడినది.

పూర్వమీమాంసా శాస్త్రానుయాయులైన ప్రభాకర మతాను యాయులు 5వ. దగు అర్థాపత్తి నంగీకరించుచున్నారు. కారణము : ఒకడు పగలు భోజనము చేయనని చెప్పుచుండినను — అతనికిగల స్థౌల్యము కండపుష్టిని బట్టి రాత్రియందైననూ సుష్టుగ భోజనము చేయునని ఊహించి నిర్ణయింతుము గదా !

పూర్వమీమాంస యందలి నొకవర్గముపోరగు భాట్టమతానుసారులు ఆరవదైన అనుపలబ్ధి యను ప్రమాణము నంగీకరించుచున్నారు. ఇదిగాక, 6వ దర్శనమగు వేదాంతము నందును ఈ చెప్పబడిన షట్ప్రమాణములను

అంగీకారయోగ్యమని ఆమోదము పొందినవి. మన పరిసరములయందే పదార్థ ప్రతీతి లభింపదో దానిని అనుపలబ్ధి ప్రమాణ మందురు.

ప్రమాత, ప్రమేయం, ప్రమాణము అను త్రిపుటియందలిదీ ప్రమాణ మను పదము. ఒక విషయమై చర్చకు బూనుకొనియున్నప్పుడు విజ్ఞాన సముపార్జనకు దోహదముజేయు సాధనమే ప్రమాణము. ఇందు 1. ప్రత్యక్ష ప్రమాణము 2. అనుమానము 3. శబ్ద ప్రమాణములను నవి ప్రధానములు. 1ఎ ఉపమానము 1బి అర్థాపత్తి 1సి అనుపలబ్ధి యన బడునవి పోషక ప్రమాణములు (*auxilliary*) మాత్రమే. ప్రత్యక్షము, అనుమితి, శాబ్ది, ఉపమితి, అర్థాపత్తి, అనుపలబ్ధి అను ఆరు విధముల ప్రమ తెలియబడుచున్నది. ఇంద్రియ నేత్ర శ్రోత్రాది గోళకముల సూధ్యమ ముతో విషయగ్రహణముజేసిన మనస్సు దానిని చింతనజేసి విచక్షణజేసి, ఒకవిధమున నిశ్చయించి అందించు పదార్థవిజ్ఞానము ప్రత్యక్షప్రమాణ మని పేర్కొనబడుచున్నది. జనసామాన్యమునకు ఇదియే ప్రధాన ప్రమా ణము వస్తుధర్మ జ్ఞానసముపార్జక సాధనము. కేవలము దీనిపై ఆధారపడి దీనినే విశ్వసించువారు చార్వాకులన బడుచున్నారు. వీరు ఒక్క ఆకాశ మును దప్ప మిగిలిన నాల్గు భూతములను, వాటికార్యములను అంగీ కరింతురు. ఎవరు ఆకాశాది పంచభూతములను అంగీకరింతురో, వారిని లోకాయతికులందురు. ఇప్పటికీ మూడు ప్రమాణములు అంగీకరింప బడెను. కాగా వైశేషిక శాస్త్ర కర్తయగు కణాదుడన బడు మునియు, సుగతమతాను యాయులును (అనేక బౌద్ధమత భావసంకలన పూర్వక మతము) అనుమాన ప్రమాణము నంగీకరింతురు. పొగ ఎచ్చటనుండునో అచట అగ్నియున్నట్లేనని నిశ్చయించుట ఈ అనుమానప్రమాణము

వల్ల నే. అందుచే ప్రత్యక్షప్రమాణమునకు పోషకభావమును గల్పించునదై యున్నందున కణాదులు ప్రత్యక్ష అనుమాన ప్రమాణముల రెంటిని అంగీకరింతురు.

సాంఖ్యమత ప్రవక్తయగు కపిలముని మూడవదగు శబ్దప్రమాణము నంగీకరించెను. శబ్దప్రమాణమన వేదోక్తభావము, లేక నొకను పనిషద్వాక్యము, లేదా విశ్వసనీయుడగు నొకవేత్తయొక్క వచనమున్ను. విశ్వసనీయములు.గనుక నిచట శబ్దము నొక ప్రమాణముగ నంగీకరించిరి.

ఇక నాలుగవప్రమాణముగ నంగీకృతమైనది ఉపమానము. జంతువుల నన్నిటిని చతుష్పాత్తులుగ గ్రహించి జంతుజాతిని గుర్తించగలము గాని ఒక్క గోమాతకు మాత్రమే గవయము (గంగడోలు) ఉండుట ఒక ప్రతేకత. విలక్షణ మగు నీప్రత్యేకతను బట్టి గోజాతిని మనము గుర్తించ గలుగుచున్నాము. ప్రత్యక్షాది మూడు ప్రమాణములతోబాటు ఉపమానము నొక ప్రమాణముగ నంగీకరించుటకీ గవయ మొక వైలక్షణ్యముగ నుపకరించును గదా !

పూర్వమీమాంసైక దేశికులగు ప్రభాకరులు అర్థాపత్తి యనబడు ఐదవ ప్రమాణము నంగీకరించుచున్నారు. ఏకభుక్తము పగలుకూడ జేయని నొకవ్యక్తిదేహమునందు దెలియబడు స్థౌల్యమును కండపుష్టిని పరిగణించి ఆతడు రాత్రియందు భోజనముచేయుచున్నాడని గ్రహించుటకు గల యీ కారణమే అర్థాపత్తి. కనుక ప్రభాకరమతానుసారులగు పూర్వమీమాంసకులు దీనిని ప్రమాణముగనే అంగీకరించిరి.

ఇక ఆరవదగు అనుపలబ్ధిని పరిశీలింతము. దీనిని పూర్వ మీమాంసకులను భాట్టమతాను సారులంగీకరించుచున్నారు. *N. B.* ఈ యారును గాక మరికొన్ని ప్రమాణములును చెప్పబడియున్నవిగాని అవి ప్రసక్తముగావలసినంత ఆవశ్యకత గన్పించదు.

ప్రయోగము : 1. ప్రమ యందలిజ్ఞానము ప్రమాతనాశ్రయించినది. స్మృతియందలిజ్ఞానము ప్రమాతనుగాక సాక్షినాశ్రయించినదని, భ్రాంతిజ్ఞానమును సంశయజ్ఞానమున్ను సాక్షినే ఆశ్రయించినవని తెలియబడు చున్నందున వీటినికూడ ప్రమయనగూడదు.

2. అంతఃకరణ వృత్తిరూప జ్ఞానము మాత్రమే ప్రమాతనాశ్రయించినట్లు దెలియబడుచున్నవి. కనుక దానిని మాత్రమే ప్రమ యందురు. భ్రాంతిజ్ఞానము, స్మృతిజ్ఞానము, సంశయజ్ఞానములు ప్రమకు జెందవను విషయము నిర్వివాదము. స్మృతిజ్ఞానముకూడ అంతఃకరణ వృత్తిరూపముగా నందున ప్రమాతకు జెందవు కనుక వాటిని ప్రమయనరాదు. అందుచే ప్రమయొక్క లక్షణములు స్మృతికన్న భిన్నములని దెలియవలయును.

3. ఎవని మతమున స్మృతిజ్ఞానమునందు ప్రమయొక్క విషయముగలదో అట్టి మతమందు స్మృతిజ్ఞానమును అంతఃకరణ వృత్తి యందురు. కాని, అవిద్యావృత్తి యనరు. ఏలనన — ఎవరిమతము నందును అంతఃకరణవృత్తికి ఆశ్రయము ప్రమాతయే యగును. గాని, సాక్షిగాదు. ఈచర్చ, ప్రమయెట్టిది ? ప్రమాత ఎట్టివాడు ? స్మృతిజ్ఞానమెట్టిది సాక్షిఎట్టివాడు? అంతఃకరణ, పరిణామము పొందిప్రాప్తించు చిత్త

వృత్తులెట్టివని ఈవృత్తుల కాశ్రయము లెవ్వియని గ్రహించుట కుపకరించును. మరియు ఈ నీవృత్తులు సర్వములయించి బ్రహ్మాకారవృత్తి యొక్కటియే సుప్రతిష్ఠిత మగుటకు సహకరించును.

గ్రాహ్యాంశము : 1. అబాధితార్థమును విషయముగ జేయుజ్ఞానమునే ప్రమయని చెప్పవలయును. భ్రాంతిజ్ఞానమేదిగలదో అది అబాధితార్థమును విషయముగ జేయదు. కనుక దానియందు ప్రమాలక్షణము నంగీకరింపరాదు. 2. ఎవనిదృష్టియందు స్మృతిజ్ఞానమున ప్రమగలదో ఆతనిదృష్టియందు స్మృతిజ్ఞానమునున్ను అంతఃకరణవృత్తి యందురుగాని అవిద్యావృత్తి యనరు, సాక్షినాశ్రయించినదనియు యనరు. దానిని ప్రమాత్రాశ్రితమనుటయె సరియగు భావము. ఏమన — అంతఃకరణవృత్తికి ఆశ్రయము ప్రమాతయేగాని సాక్షిగాజాలడు.

---

## కాశ్మీరశైవము

కాశ్మీరుదేశమున శైవమతమున కనాదిగయున్న వ్యావహారిక నామము 'శైవ విశిష్టాద్వైతము. పిమ్మట కాలమునందు భావములు పరిణమించుచురాగా నిది 'శివాద్వైతము' అను పేరును సంతరించుకుని శివశక్తుల కద్వయభావమును నిర్ధారించి తెలుపుచు 'శివాద్వైతము'గ సుప్రతిష్ఠితమైనది. ఇందు శివుడే ప్రధానతత్త్వము: అనగా విమర్శాప్రకాశముల కేకత్వమే జెప్పబడినది. ఈ సిద్ధాంతమునకు త్రికశాసనమని పేరు. త్రికమన—చరమతత్త్వములు మూడు అను సంజ్ఞ. ఇందు శివతత్త్వ శక్తితత్త్వములు రెండును ప్రధానములు. కాగా, చిత్తమలినములతో గూడిన జీవాత్మ అణువను నభిధేయముతో మూడవదిగ వ్యవహరింపబడుచున్నది. వీటిని పరిశీలించి స్వరూపముల దర్శింప యత్నింతము.

1. శివతత్త్వము; ఇదియే సర్వమునగు సమగ్రజ్ఞానము, సర్వ వ్యాపకము (విభువు); సాక్షాత్పరశివతత్త్వము; కేవల చైతన్యరూప జ్ఞానము; అనంతము.

2. శక్తి : అట్టి పరతత్త్వమునం దంతర్యామియై యధి వసించి యుండి, దర్పణ దృశ్యమానమగు రూపమువలె తన యందేఉద్బుద్ధమగు నొక తాదాత్మ్యస్థితి బోధక తత్త్వమే "ఈశక్తి." ఇది ఇచ్ఛాజ్ఞానక్రియాత్మకము సృజన సంకల్ప సంభావ్యము. దీనిని మాలినీవిజయ సంభావించి ప్రస్ఫుటించి, నొక ప్రాతిపదికగ నిర్ధారించి దెలిపెను. ఇందుచే ఇదియే శివుడనియు శివుని ఐచ్ఛిక సంకల్పశక్తియనియు విశ్వసించవచ్చును. మరియు నిది, ఈశ్వరప్రత్యభిజ్ఞా విధానమునందు విమర్శాస్వరూపిణిగ నభివర్ణించబడినది, మరియు దృశ్యమాన జగత్తునందలి సర్వకార్యములను తనయందే గర్భితమై యున్న "పూర్ణాహంత" దెలుపు "ఇది" *(this is)* అనుభావముల కాత్మానుభూతిని గలిగించును. ఈ సిద్ధాంతమునకు మూలసూత్రము "శక్తి శక్తిమతోరభేదః."

1. మూలతత్త్వము శివతత్త్వము. ఇది ప్రకాశమను సాంకేతిక పదవాచ్యముగ నున్నది. ఇదియే కేవల జ్ఞానరూపచైతన్యము. శివునికి భైరవుడు, పరమభట్టారకుడు అనుపేర్లు పర్యాయములు. ఈతడు అనంతుడు అవిభాజ్యుడు సర్వజ్ఞుడు అను లక్షణములను నిర్దేశించిదెలిపిరి. ఆయన సహజస్వభావ పూర్వకమైయున్నదే "శక్తి". "చిదేవశక్తిః" అనువాక్యభావమిదియే. *It is a soat of reflex relation of self identity.* ఆయన తనను వ్యక్తపరచుకొన సంకల్పించినపుడు శక్తి ఆయననుండియే ఉద్బుద్ధమగును. ఇదియే ఇచ్ఛాశక్తి. శివుడు చిద్ఘన స్వరూపుడు. శక్తి

ఆయన స్వేచ్ఛా సంకల్ప పూర్వకమైనట్టి శక్తియే. అది ఆయన స్వరూప సంవర్శకము.

శక్తితత్త్వము : ఇది సంపూర్ణమగు అహంత (*Egoity*) దీనినే ఉత్పలుడు విమర్శయనెను. దృశ్యప్రపంచమును 'ఇది' అను ద్వంద్వభావముతో వీక్షింపజేయగల శక్తియొక్క అంశ. ఇది శివునినుండి విడిపడనిది అనగా శివేతరము గానిదగు అద్వయతత్త్వము. శక్తి ఒక భావరూపపదార్థముగాదు (*It is not abstract or Conceptual*) అది అభివ్యంజకతత్త్వమే. (*It is Concrete but unmonifest energy*). శివుడు తన స్వస్వరూపము నెరుక పొందజేయగలుగు దివ్య తత్త్వమే విమర్శయనబడుశక్తి. శివుడు 'అహం' అను పూర్ణభావమును తనయందు సంభావించుకొనజేయ గలుగు దర్పణమే ఎరుకయందలి అంశ యగు నీశక్తి. అనగా పూర్ణాహంతయందు సంజనితమగు 'ఇదంత'యే యూశక్తి. కనుక నది ఆయన స్వభావమేగానీ అన్యయుగాదు.

**3.** అణు : ఇది మల విక్షేపములతోగూడిన, వ్యష్టిమూర్తుల యందలి జీవతత్త్వము.

శివశక్తులొక ప్రతిక్రియాపూర్వక స్పందనవలన(*b) a reflex)a reaction* ఉన్ముఖమైనప్పుడు ఉచ్ఛూనావస్థ (తడిసి, నాని, ఉబుకుట) ప్రాప్తించును. అప్పుడాబీజమునందంతర్గతముగనున్న శక్తిని చలింపజేసి అంకురమును ఉత్పన్నముజేయ ననువుగ సిద్ధమైనస్థితియే ఉచ్ఛూనావస్థ. ఇది ఈక్షణచే (*Conception & projection of a thought*) అనగా సృష్టి సంకల్పముచే ఉద్బుద్ధమగును. ఇందు ఆత్మ తనయందుతానే రమించి ఆనందానుభూతి బొందు దివ్యస్థితి (సుషమానిధానస్థితి). ఇది తురీయావస్థ నధిగ

ఋంచినస్తాయి. కీనినొక ప్రాతిపదికగ్రహించి (*hypothesis*) మంద బుద్ధులగు జిజ్ఞాసువులకు బోధనాసౌలభ్యము నుద్దేశించి శక్తిని శివునినుండి విడిపరచి చెప్పుచున్నారు. *This may be understood as a formal suspended animation brought into play by autovibration for self expression enjoyment and creation.* కనుక 'శక్తి శివే తరముగాద'నుటయే గ్రాహ్యాంశము, నిశ్చితార్థమును.

శక్తిశ్చనో శక్తిమతోవిభిన్నా ।
తేనైతయో భేదమియం పృథక్త్వం ।
అమాత్రతాయాం నచశక్తిరస్తి ।
తేనస్వరూపం నహిశక్తియుక్తం ।
(మాలినీవిజయోత్తరవార్తికము)

కనుక ద్రష్టలేనప్పుడు శక్తికి ప్రసక్తియే లేదు. సర్వతంత్ర స్వతంత్ర మగునది ఏ స్వీయ ప్రభావముచే ఐచ్ఛికముగతానే నియమించు కొని *(self conditioned)* దృశ్యమును (జగత్‌గ) భాసింపజేసి కొనునో ఆశక్తియే దేవి అనబడుచున్న శక్తి.

*Etimological* గా పరిశీలించిన మా = *the power of voluntary self limitation* లేక అపచ్ఛేదమునకు ఆలంబన మిచ్చు నదియే యీ శక్తికిపదభావము. కనుక సారభూతమగు శివుని యొక్క స్వీయస్వతంత్రశక్తియే ఈ మాయ యనబడుశక్తి. ఇదియే పరి పూర్ణాహంత. ఇదియే ఆనందస్వరూపము.ఆనందస్వరూపమున భోక్తయు, ఈక్షణ ఉచ్ఛూనతలయందు శక్తియు అనుద్వైవిధ్యముతో తనను తాను ప్రస్ఫుటించుకొనగలది ఒక శివుడు మాత్రమే. ఏకమేవాఽద్వితీయం.

**తాత్పర్యము :** త్రిక సిద్ధాంతరీత్యా పశక్తిని సివ్యాఖ్యాత ఏ భంగిన జెప్పినను — పరమార్థమునందు — స్థూలసూక్ష్మరూపమగు దృశ్యమానమంతయు జడమగు నొకసుద్ద లేక రాశి *(mass)* వంటిది గాదనియే త్రిక సిద్ధాంత హృదయము. *The subtle and the resultant gross is not an inert inanimate gas or mass — be it mental or material.* ఉజ్జ్వలము ఉదాత్తము నగు భావభూమికను చేరి పరికించిన "సర్వము" అనబడువానియందు కొంత అనుద్భూతముగను *(unmanifest)* మరికొంత ఉద్భూతము *(manifest)* గను ప్రకటితమగు సమగ్ర ఏక తత్త్వమే అని ప్రస్ఫుటించుటయే, పరమార్థము. "పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి" అను శ్రుతి వాక్యభావమిదియే. గమనీయమగు మరొకవిషయమేమన — కుండమూకుడు, రాయిరప్ప మున్నగు జడశక్తి పరిణామ పదార్థములయందు స్వాతంత్ర్యశూన్య ఆభాసన — సదాశివ, ఈశ్వర మున్నగు చైతన్యపరిణామసత్తల యందు స్వాతంత్ర్యయుక్త ఆభాసన ప్రాప్తించును. ఈ సిద్ధాంతము ఒక ప్రశ్నకు కారణమగుచున్నది. ఏమన — కేవలఎరుక లేక జ్ఞాతృత్వ శక్తియుత మనదగు శక్తిదృశ్యమానమగు భౌతికపదార్థములుగ బహిర్గతమగుటఎట్లు అను ప్రశ్నకలుగుచున్నది. ఇందుకు త్రికవాదుల సిద్ధాంతమేమన — ప్రకాశ స్వరూపుడగు పరమశివునకు ప్రమాతృత్వము *(cognisership)* కలుగుచున్నది. మనము గమనించవలసిన విషయమేమన — ప్రమాతృత్వము లేనియడల ప్రకాశమే అభావమగు గదా ! ఋజువగు భావపదార్థము *(positive concept)* కాజాలదు గదా ! యని ఇపుడు సంవిత్ (ఎరుక) పూర్వకమగు సత్యవస్తువు తనను తానే ఎరుకచే ప్రతిఫలింపజేసి కొనుటకు బదులు ఇది దృశ్యమను భావముతో ప్రతిఫలింపజేసికొనుటచే తాను ఆవిష్కరణ రూపమును బొందుచున్నాడు. *This Samvit is the unelienated cons-*

*cious nature of Siva with all its contents unmanifested.* దీనిని ఇచ్ఛం పరామర్శ యందురు. దీనియందు రజోగుణశక్తి ప్రాణశక్తి అను స్ఫూర్తమైనప్పుడు రూపములను చేతనములందురు. తమోగుణ ప్రభావితము లైనప్పుడు రూపములను జడములందురు. కనుక దృశ్యమానమంతయు సత్య పదార్థరూపమేనని కాశ్మీరశైవులు విశ్వసింతురు. అనగా సంవిత్ యొక్క ఆవిష్కరణయేనని నిర్ధారించిరి. కాని శాంకరాద్వైతులు త్రిక వాదుల ఆవిష్కరణను భ్రాంతి జన్యభావములని యందురు. ఇది ఆభాస వాదము — ఆవిష్కరణగాదు.

త్రికసిద్ధాంతమునందు గుర్తుంచుకొనవలసిన ప్రముఖ భావములు :

1. ఈశ్వర ప్రత్యభిజ్ఞాసిద్ధాంతము నందభివర్ణింపబడిన శక్తి విమర్శ యనబడుచున్నది. శుద్ధ చైతన్యమునందకర్తృకముగ ప్రాప్తించు సహజ, స్వభావసిద్ధమగు స్పందనచే తెలియబడునది 'పూర్ణాహంత'. ఇది శివుని సమగ్ర జ్ఞాన స్వరూపము. ఇదియే 'అహం' అను సంజ్ఞచే సూచింప బడు పరమార్థభావము. (*this is the Iness*). ఇదియే 'త్రిపాదస్యామృతందివి' అని చెప్పబడు భావము. ఈ యధిష్ఠానమునందు దృశ్య పూర్వకముగ దెలియబడు నదియే 'ఇదం' అనబడు భావము(*This ness*). అహంత అధిష్ఠానముగను, ఇదంత అధ్యారోపితమనియు ఇదియొక పాద భాగము (*a fraction*) గను 'పాదోస్యవిశ్వాభూతాని' అనుశ్రుతివాక్యముచే దెలుపబడుచున్నది. ఈ అహం-ఇదం పూర్వకభావముల అవిభాజ్య సమగ్ర స్వరూపమే 'పూర్ణాహంత' యని జెప్పబడుచున్నది.

ఇదంయొక్క అధ్యారోపితభావస్ఫూర్తికి వలయు ఇచ్ఛాశక్తియే విమర్శ (అనగా *the Divine creative will*). పరమశివుని శక్తి తన

యందే అధివసించియుండ ఆయనయందు సంభవమగు అకర్తృకస్పందన వలన ప్రాప్తించు ప్రతిస్పందన (*a reflex - or an automatic throw, back*). ఒక పారమార్థిక ఇచ్ఛాశక్తిగ నుద్భూతనుగును. శివతత్త్వము తన ఆత్మానుభూతిని బొందుటకు వెలువరింపబడు తనస్వీయ శక్తియే 'శక్తి' తత్త్వము లేక విశదవాక్యములతో జెప్పవలసిన సాక్షాత్తు 'శివ శక్తి'యే. ఇదియే విమర్శాశక్తి. ఈ జగత్పరిణామమునందు సంభవమగు కార్య సర్వస్వమును (*the objective phenomina*) వెలువును. కార్యములన పరిణామక్రియలు పరిణమించి రూపొందు దృశ్యములు (*appearances*) ను. దీనినే 'ఇదం' (*this is*) అందురు. శక్తిగనే తన యందంతర్గతమైయున్న సర్వమును అనగా, అభివ్యక్తముగాని అవ్యక్త మగు (*a mysterious unseenforce*) తత్త్వమే ఈశక్తి. దీనిని భావ రూపమున (*abstract idea*) గాక వస్తురూపముననే దర్శింప జేయగల దీశక్తి. కారణరూపమును కార్యరూపమున నభివ్యక్తముజేయు పదార్థపు పూర్వరూపమే శక్తి. ఇది భావరూపమునగాక వస్తురూపమున(*Concrete*గ) (*mass or* రాశిగ)ను దర్శింపజేయవచ్చును. *Sakti Should not be conceived as a mere abstract Principle devoid of all conerete contents.* కనుకనే ఇది శివునియొక్క పారమార్థిక శక్తియని వివేచించి గ్రహించవలయును. శివుడు తన స్వరూపానుభూతి బొందుట కీశక్తియే దర్పణతుల్యము. శక్తి సర్వతంత్ర స్వతంత్ర సంభరితమై పరిమిత పరచ సమర్థమగు శివుని స్వీయశక్తియే. 'మా' యనలేనట్టిదనియే భావించిన అది అత్యంతాభావపదార్థమే యగును—కనుక పరిమితపరచుయను అర్థము చక్కగా అన్వయించి సూటిబోధచేయును.

1. అవధులులేని అనంతచైతన్యమునందు విమర్శాశక్తి (*Egoity*) ప్రభావమువలననే సర్వాత్మకుడగు బ్రహ్మ—ఈ విశ్వమునందలి కార్యము లుగ తాను భాసించు విధానమును తెలుపును.

2. దృశ్యమానమగు నీనానాత్వమును, ఏదో భావరూపమైనట్టిదిలే యని సంభావించి శివుడు ఈ విశ్వమున కల్లంతదూరమున నొక సింహాస నమునం దాసీనుడై యుండిన, ఈశిత్వమను భావమునకు సామరస్యము పొసగదు. *This is in agreement with the idea of an extra cosmic Deity of the Devotional Schools only but not with metaphysics.*

---

# ప్రత్యభిజ్ఞావాదము - పరిచయవాక్యములు

ప్రత్యభిజ్ఞయన మరల గుర్తించి గ్రహించుట. "ప్రతి అభిముఖ్యేన జ్ఞానం" అని దీనికి శబ్దార్థము. సృష్టిలో కార్యరూపమున చూడబడుచున్న వానిలో—దానికి కారణరూప పదార్థమగునట్టిదాని గుణములు లక్షణములను గమనించిచూచి—ఇప్పుడు కార్యరూపముననున్నది ఆదిలో అవ్యక్తమగు కారణమే నను అనుభవజ్ఞానముపొంది మరల గుర్తించుటయే ప్రత్యభిజ్ఞ, లేక మూలమగు కారణమును మరల గుర్తించుటని యందురు.

ఇది సిద్ధించినవారికి సర్వమునందును కారణ దృష్టియే గలుగునుగాని ఆచూడబడుచున్నది కార్యమను భావము కలుగదు. అంతర్యామియై (*latent*గ) యున్నప్పుడు అవ్యక్తమని సంభావింపబడినట్టిదే—సువ్యక్త మైనయెడల కార్యము (*result*) అనబడుచున్నదను సహజస్వరూపజ్ఞాన

మును సముపార్జించుకొనును. గనుక, మూర్ప్వ—వ్యక్తా-అవ్యక్తదశల పరిగ ణించినపుడు మాత్రమే సంభావ్యమగునుగాని అధిష్ఠానమగుకారణ పదార్థము నందసంభవము —అను బోధకుపకరించును ఈపదము. కనుక ప్రతి అంశమునకును వ్యక్తఅవ్యక్తరూపముల పరిగణించి విశ్లేషించనిదే తత్త్వ శాస్త్రమునందలి మౌలికమగు ప్రశ్నకు అనగా *What is the 1st cause of this phenominal world ?* అను ప్రశ్నకు పరిష్కారము లభించదు. చూచేది దృక్ అని, చూడబడేది కార్యరూపమగు వస్తువనిన్ని అంటారు. చూడబడేదానితో, చూచే దృక్ తాదాత్మ్యమును బొందుటయే తెలిసికొనుటయను ప్రక్రియ. దీనిని ఆంగ్లమున *Cognition* అందురు. చూడబడిన పదార్థము చూచినవాని స్మృతిపథమునుండి మరుగై మరల వానినే మరొకదేశమున మరొకకాలమున చూడగా 'ఇది - అదియే; అప్పుడు అక్కడ చూడబడినది, అని ఎరుంగుట; అనగా తిరిగి ఆ యనుభూతిని బొందుటయే ప్రత్యభిజ్ఞ: (*re-cognition*). ఇది స్థూలముగ గ్రహించదగు అర్థము (వాచ్యార్థము). ఇక లక్ష్యార్థమును గ్రహింతము: మరల గుర్తిం చుటయను నీ భావమును పారమార్థికమునకు అనువర్తించిన దృశ్శక్తి ఆవిష్కృతమై, అనగా అంతర్యామియైయున్న పరమేశ్వర స్వరూపము తానై స్ఫురింప 'ఈశ్వరోఽహం' 'ఈశ్వరుడనునేనే' అను జ్ఞాన ముదయించు టగా చెప్పబడును. 'ప్రతి ఆభిముఖ్యేనజ్ఞానం' అంటే అభిముఖముగానున్న దానిని జూచి 'ఇది—అదియే' 'ఈ జీవాత్మయనబడునది పరమాత్మయే' అను ప్రతిసంధానరూపమగు జ్ఞానమును బొందుటయే ప్రత్యభిజ్ఞ. వాక్యమునందు గర్భితమైయుండి మీమాంసచే తెలియబడు ఇట్టి సూచిత బోధమే ప్రత్యభిజ్ఞ. ఇదియే యీ వాక్యమునకు లక్ష్యార్థము.

ఇక ఒక దర్శనశాస్త్రముగ దీనిని పరిశీలింతము : ఇది కాశ్మీరు దేశమున వసుగుప్తుడను పండితునిచే ప్రతిపాదింపబడి ప్రసక్తమైన సిద్ధాంతము. అది శివ. శతాబ్దము. అతడు తన సిద్ధాంతములను కల్లటునకు బోధించెను. వీరిరువురును శివసూత్రములను, స్పందసూత్రములనుకూడ రచించి రూపొందించిరి. ఇందుచే కాశ్మీరశైవమునందు ద్వైవిధ్యము ప్రాప్తించినది. వసుగుప్తుడు స్పందసూత్రములను ఉత్పలుడు సోమానందుడు ప్రత్యభిజ్ఞాసూత్రములను వ్రాసియుంటయేయీద్వైవిధ్యమునకు కారణము. ఉత్పలుడు బాటను సూచించగా వసుగుప్తుడు అద్వైత సిద్ధాంతముల నందు జొప్పించుచు రాజబాటల నిర్మించి చూపగా కాశ్మీరశైవులు తమ శివవిశిష్టాద్వైతమునుండి అద్వైత శిద్ధాంత నిర్ధారణకు యత్నించి కృతకృత్యులైరి. కాశ్మీరమునందు అద్వైత సిద్ధాంతమే ఆచరణకువచ్చెను. ప్రత్యభిజ్ఞయందు చూచినవస్తువును శివుడుగనే గుర్తించి దానిని అనుస్యూతముగ అనుభూతిపొందుచు, అందువల్ల శివుడుగాని ప్రతిదియు మిధ్యగనే పరిగణించుటయే ప్రధానవిషయము. కనుక శివుడుగాని దొకటి యుండదనుటయే ఈవాదమునకు నిశ్చితార్థము. స్పందవాదమున, చైతన్యముతోగూడియుండిన ఆకర్తృకస్పందన (*A Spontaneous vibration accompanied by consciousness*) ప్రభవింప, మోక్షము ప్రాప్తించు ననియే విశ్వసింతురు.

కాగా, "ప్రతి అభిముఖ్యేన జ్ఞానం" ప్రత్యభి జ్ఞానమని తెలిసికొన్న తరువాత అసలు సూత్రమునొక దానిని పరిశీలింపవలసి యున్నది. అది "కారణగుణాః కార్యమనుప్రవిశంతి" అనునదియే. తాత్పర్యము - కారణముయొు దానిస్వరూపాన్ని, దానికి కార్యమనబడువానియందు జూచుటయే ప్రత్యభిజ్ఞ: కనుక ప్రత్యభిజ్ఞా దృష్టికి దృశ్యమానమగు సర్వము,

కారణస్వరూపమనియే సిద్ధాంతము. కనుక ప్రత్యభిజ్ఞ ఒకదృక్పథ మనియు, అంతియోగానీ కార్యములన్నియు వాటికి ప్రత్యభిజ్ఞా జ్ఞానము పలబ్ధమైన మరుక్షణముననే) కారణమగు శక్తిరూపమును మరుక్షణము ననే పొందవని, కార్యములు అందరికిని ఒకేసారి అదృశ్యములై పోవనియు, నాయుహ. ఇచ్చట కారణమనబడునది శక్తియే యనియు, అది అవ్యక్తరూపమగు పదార్థమేయనియు, దాని వలన ప్రాప్తించిన కార్యము లన్నియు ఆశక్తియొక్క వ్యక్తస్థితులేగాని అవ్యక్తస్థాయీ భావములుగా వనియు తాత్పర్యమును గ్రహింపవలయును. ఇదియొక గణనీయమగు గ్రాహ్యాంశము. ఇందలి తాత్త్విక భావమవగాహనకు వచ్చినవారికి మాత్రమే ఇందలి సత్యము సుగ్రాహ్యము కాగలదు. ఇట్టి వారికే "బ్రహ్మ సత్యం, జగద్బ్రహ్మ" యను వాక్యము నిత్యసత్యమే యగును. అట్లు జగద్బ్రహ్మయే యను విశ్వాసము అనుభూతియు పొందనివారికి ప్రత్య భిజ్ఞకలుగలేదనియే జెప్పవచ్చును. వారికి మిథ్య, మిథ్యగనే మిగిలి పోవలసినదే. ఇంతియేగానీ ప్రత్యభిజ్ఞ గలిగినదన్న వారికి ఈజగత్తం తయు నొక్కసారిగ, నిర్గుణ, నిరాకార, నిష్కలతత్త్వముగ మారిపోజాలదు. కనుక నీజడరూపమున దృశ్యములగు భవనములన్నియు, ఇనుము, రాయి, కలపతో, కట్టబడి పొంది యుండియు, అవి అట్లే కనుపించకపోవుట కవకాశము నాయట్టివారి కనూహ్యమే. ఏమందురా జ్ఞాన సిద్ధుడగునే బ్రహ్మజ్ఞమూర్తికో అట్లు సంభవింపనవకాశము గలదేమోగాని, సామాన్యు లగు సర్వజనులకును అట్లు సంభవమగుట అనూహ్యమగునొక అప్రాకృత పరిణామమే, గావలసివచ్చును. భౌతికములగు నీమానవశరీరములచ్ఛేదించి పరిశీలించి, వివేచించిన వారికి మాత్రమే 'నారీస్తనభరనాభీదేశములు మోహావేశకారకమేయగుగాని, "ఏతన్మాంసవికారయసాదం" అనుభావ

స్ఫూర్తి లభింపదుగదా! కనుక జిజ్ఞాసువులకు తత్త్వసాధకులకును గావలసినది దృష్టిభేదమేగాని దృశ్యములయందు సంభవములగు భౌతిక భావభేదములుగావు. స్థూలమునందే అంతర్యామిగనున్న శక్తియొక్క సూక్ష్మభావరూపమును దర్శించుట మాత్రము సాధ్యముకాగలదు. అపుడు మాత్రమే సద్వస్తువుయొక్క అపరోక్షానుభూతిని పొందగలడు. ఇదియే ప్రత్యభిజ్ఞకు లక్ష్యము.

ప్రత్యభిజ్ఞా ప్రవాచకులుగ శాక్తులు విశ్వమును విశ్లేషించి 36తత్త్వములతో గూడియున్నదని అంగీకరింతురు. ఇట్టి భిన్నతత్త్వములతో తాదాత్మ్యమే ప్రత్యభిజ్ఞయని ప్రవచింతురు. వస్త్వాశ్రయభావరూపములతో ఆత్మాశ్రయములు తాదాత్మ్యభావమును బొందినయప్పుడు మాత్రమే ప్రత్యభిజ్ఞాభావము ప్రాప్తమగును. *The fusion of the Subjective and objective phases only can cause the idea of at one ment* (తాదాత్మ్యము) లేక ప్రత్యభిజ్ఞ. కాశ్మీర శైవమునకు జెందిన ప్రత్యభిజ్ఞ, శాక్త, శైవ, ఆగమశాస్త్రముల నుండి రూపొందింపబడినట్లు తెలియవచ్చుచున్నది. శంకరుడును ముఖ్యముగ అయన గురువగు గౌడపాదుడును శాక్తేయాభిమానులనియే నావిశ్వాసము. శక్తికే ప్రాధాన్యత కల్పించి ఒకరు సుభగోదయమును రచింప, మరొకరు సౌందర్యలహరిని రచించుట గమనీయము. గురుశిష్యులిరువురును శ్రీ విద్యోపాసకులే గనుకనీ అద్వైతసిద్ధాంతభావములన్నియు శాక్త ఆగమములలో ప్రక్షేపింపబడినట్లును విశ్వసింపవచ్చును. ఐనను అద్వైత సిద్ధాంత ప్రతిపాదకు లందరును, శాక్తేయమును అద్వైతమున కన్నతక్కువ స్థాయి యందలి దిగపరిగణించి "నీవుచెప్పునది శాక్తేయ భావమనీ అద్వాని

నపవదించుచుండుట నాబుద్ధికి సమ్మతముగలేదు. శక్తి శివునినాశ్రయించి యుంటచే — చరమస్థాయి శివునికి కల్పించి సంతసింతురేగాని — ఈ రెంటికి గల సహజఅవినాభావ సంబంధమును గుర్తింపకుండుటయే ఈతరతమ భేదభావములకు కారణము. 'శక్తి శక్తిమతోరభేదః' యను సూక్తిని శాక్తేయ భావమని త్రోసిపుచ్చుదురేగాని అందందించబడుచున్న పూర్ణభావమును గ్రహించిమన్నించుట లేదు. ''శివశ్శక్త్యా యుక్తోయది భవతి శక్తః ప్రభవితుం'' అనుబోధ పూర్ణభావస్ఫోరకమని అంగీకరింపక పోవుటచే, అపూర్ణయ్య పూర్ణత్వమునకే పరిష్కారము ప్రాప్తింపక, "శక్తి శక్తి మతోరభేదః" యను చరమస్థాయి బోధయు పూర్ణత్వమును సమర్ధించి సార్ధకపరచుట లేదు.

"పూర్ణమిదం పూర్ణమదః పూర్ణాత్పూర్ణముదచ్యతే" పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమేవాఅవశిష్యతే ।
అను పూర్ణబోధయే ప్రత్యభిజ్ఞాబోధకు లక్ష్యమని గ్రహింపగలము.

## ప్రత్యభిజ్ఞావాద వివేకమునకు ఫలశ్రుతి :

సాధకునకు గావలసినది సత్యస్వరూప దర్శకమగు నిశితదృష్టియు, అంచు కారణ స్వరూపమును నవగాహన బొందదగుధృతి శీలతయు మాత్రమే గాని భౌతికరూపముల లయనివృత్తిగాదు. స్థూలము నందంతర్యామియై యున్న అవ్యక్త శక్తియొక్క ఉనికియేగాని అస్థూలరూప దృశ్యముల లయనివృత్తి మాత్రము ధ్యేయముగాదు.

# అద్వైత సిద్ధాంత విషయమున మననయోగ్యములైన శిఖరాగ్రభావములు

అద్వైత భావములకు సూత్రము "కారణం పరమంసత్యం-కార్యంపై వ్యావహారికం" అని. కార్యమును అసత్యమనరాదుకాని, అనిర్వచనీయ మనుట యుక్తి యుక్తమని పెక్కురందురు. కార్యము సత్తుగాదు, అసత్తు గాదు, సదసత్తుగాదు సదసద్విలక్షణమునుగాదు—గనుకనీ భావము లన్నిటిని విచేచించినయడల అది నిర్వచనీయమనియే జెప్పవచ్చునుగాని అనిర్వచనీయపదమును వర్తింపజేయ ననువుగాదందురు కొందరు. న + ఇతి = నేతి అనగా ప్రమాతనగు నీవు చెప్పు యీ భావముగాదు, ఇదికాదు కాదని త్రోసిపుచ్చు తిరోధాన విధానమున్ను నిర్వచన పూర్వకమే నందురు కొందరు కోవిదులు. ఈ సర్వసంశయాత్మక ప్రతిపాదనలకు "ప్రాతిభాసికసత్యమ"ను పద ప్రయోగముతో సామరస్యమును సంతృప్తిగ సమకూర్చి దెలిపిరి శ్రీ శంకర పూజ్యపాదులు. దీనితో నందరకు అధ్యాస తొలగినంత ప్రయోజనము గలిగి దీనికి శంకరాద్వైతమనుపేరు సుప్రతిష్టితమైనది.

2. బ్రహ్మస్వరూపమును వివరించి దెలుపుటకు ఋజుభావముల (*Positive ideas*) ప్రయోగించినయడల ఆయనంత తత్త్వమునకు పరిచ్ఛిన్నత్వ మాపాదింపబడునుగనుక, నేతినేతి ప్రక్రియను అన్వయ వ్యతిరేక భావములతో అభేద అనన్యభావముల ధృవీకరించి దెలిపిన—సమష్టి దృష్టికి కార్యమగు తమస్సే స్థూలశరీరముగను, సూక్ష్మ మగురజస్సే సూక్ష్మ శరీరముగను, సత్వము కారణశరీరముగను నీ బ్రహ్మాండము రూపొందిన

దను దృక్పథ మారూఢముకాగలదు. మరియు, నీ సృష్టికి మూలకారణ మెద్దియో వివేచించుటకు సౌలభ్యము సమకూరగలదు.

3. శాఙ్కరాద్వైతమును వివేచించుటకు రెండవదిగ పరిగణించ దగు భావము మాయ. దీనిని వేరొకతత్త్వముగ సంగీకరింపక పోగా, దీనికి జడమనునొక ముద్రవేసి యుంచిరి. జడమునకు మనోలక్షణములగు చింతనాశక్తి ప్రాణలక్షణములగు చలన, క్రియాకారక శక్తులును ఉండ వనియే జెప్పవలసి వచ్చును. ఈ లక్షణములు జగత్తత్త్వ పరిధియందే పరిగణింపబడగలవుగాని, పారమార్థిక భూమికయందు గాదనుట లోకవిది తమే. పారమార్థిక దృష్టికి — అనాద్యవిన్యాసహిత పారమేశ్వరశక్తిరేవ మాయ అను స్వరూపముతో తెలియబడు అఘటనా ఘటన సటీయసి యగు పారమేశ్వరశక్తియే మాయ, ఇట్టి నిర్వచనము శ్రీ శంకరునిచే జేయబడి నందున త్రోసిపుచ్చబడజాలదు.

మాయ అనిర్వచనీయమగుటో — రజ్జు సర్ప ఉదాహరణయందలి సర్పమున్ను ఒక అనిర్వచనీయ సర్పమేగావలసి వచ్చును. సాపేక్షికముగ (*relative*) గుణకర్మల పరిశీలింపవలసివచ్చిన అనిర్వచనీయ మనవచ్చు నేమోగానీ, నిరపేక్షిక పారమార్థిక భూమికయందు మాయ, మహేశ్వరుని కొక అద్వయమిథున తత్త్వమేనని జెప్పక తప్పదు. సాపేక్షికతత్త్వము నందలి <u>మాయనే అధ్యాసయని</u> శంకరులు ప్రవచించియుండిరని గ్రహిం చినయెడల విషయము సుగ్రాహ్యముగాగలదు. ఈ అధ్యాస పదరచనకు సూత్రము 'అతస్మింస్తద్బుద్ధిః' అదికానిదానియందు మరొకదాని ధర్మముల నారోపించి అదియే ఇదియనుకొని విశ్వసించుట. ఈ విశ్వాసమే అధ్యాస. కనుక శాఙ్కరాద్వైతమున — ప్రాతిభాసిక సత్యమునకు

ప్రాధాన్యత ఘనముగనున్నది. మాధ్యమిక బౌద్ధుడగు నాగార్జునుడు వ్యావహారిక పారమార్థిక సత్యముల నంగీకరించి ప్రాతిభాసికదృష్టిని ప్రసక్తము జేయకున్నను — శూన్యమనుపదమును బ్రహ్మకే పర్యాయముగ ప్రవచించియున్నందున ప్రాతిభాసికము నంగీకరించినట్లయ్యెను.

4. అద్వైతము—జీవ బ్రహ్మలకైక్యతను బోధించును. ఐక్యతకు ముందు రెండు భిన్నతత్త్వముల స్ఫూర్తి గలుగుచున్నది. కనుక నిచట అభేదభావము ప్రధానమగుచున్నది. అనన్యభావముగాదు. శాంకరాద్వైతమున అనన్యతా భావమునకే ప్రాధాన్యము దెలియవచ్చుచున్నది. ఏలనన—ద్వైతభావము అధ్యాసవలనమాత్రమే సంభవమగును. అట్టి అధ్యాస తొలగినయడల ఏకైక భావమగు బ్రహ్మమునకు అనన్యతయే సిద్ధించునుగనుక అభేదభావముగాదు అనన్యభావమే వర్తించును.

5. శక్తికి క్రియాసామర్థ్యము గలదందురు శాక్తేయులు. బ్రహ్మసాన్నిధ్యమునందుమాత్రమే క్రియాశీలియగునందురు శాఙ్కరీయులు, ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులు అంతఃకరణ ధర్మములందురు అద్వైతులు: అవి శక్తి ద్వారా చేతనుడైన పురుషుని ధర్మములందురు శాక్తేయులు.

6. శక్తి శివునియందుండును కనుక సృష్టికర్త శివుడే యందురు శాక్తులు. అది సగుణ బ్రహ్మవల్ల ప్రారంభింపబడి ప్రవృత్తి బొందునందురద్వైతులు.

7. నియతార్థ - క్షేమార్థములకుగల సంబంధమును సామరస్యదృష్టితో గ్రహించుటకు, తద్వారా నివృత్తికి ప్రయత్నించుటకు గలుగు సౌలభ్యమే అధ్యాసను గ్రహించి దానినుండి విముక్తులగుటకుప్రయోజనము.

"స్మృతిరూపః పరత్రపూర్వదృష్టావభాసః" అధ్యాసః యని అధ్యాసయందలి విషయవాసనలను సంస్కార స్వరూపముల నిరసనకును నిరంతరమననీయ మగువాక్యము అధ్యాసయే.

*N. B.* ఈ చర్చలోని యంశములు ప్రసక్తములైనప్పుడు మాయ జడమను విషయమున ప్రమాణవచనముల పేర్కొనగలరాయని ప్రశ్నించిరి కొందరు. సమాధానమునకు యీ క్రిందివాక్యముల వివేచించి మననము జేయ సూచించుచున్నాను.

మాయాంతు ప్రకృతిం విద్యాత్ । మాయినంతు మహేశ్వరం ॥
జడమగు ప్రకృతియే మాయయని తెలిసికొనుము. (శ్వేతాశ్వతర 10)

1. మాయయనబడు భావము ప్రకృతియే. ఆమాయ కధిపతి మహేశ్వరుడే (శ్వేతాశ్వతర)

2. బ్రహ్మపదార్థము ఏకైకము; మరి రెండవ తత్త్వమనునద్ధిలేదు. ఆదియందు బ్రహ్మముమాత్రమే యుండెను. ఆసద్వస్తువయే 'బహుస్యాం ప్రజాయేయ'యను కోర్కెకు కర్త. జడమగు ప్రకృతి (మాయ) గాదు. (ఛాందోగ్యము)

3. ఇంద్రుడు తన కోరికవలననే, బహురూపములదాల్చెను. కాని, ఆ కోరిక జడమగు మాయవలన గలిగినదిగాదు. (ఋగ్వేదము)

4. ఈక్షతైర్నాశబ్దః ప్రధానము జగత్కారణమని సాంఖ్యులనుచున్నారు.కానీ, జడమైన ప్రధానము జగత్కారణముకాగలదని శ్రుతి చెప్పలేదు. తలచుట చూచుటయను క్రియలకు కర్త చైతన్యమేగావలయును, కాని జడమగు ప్రకృతి (మాయ) కాజాలదు. 'మాయాంతుప్రకృతింవిద్యాత్'

# పదములు-అర్థములు (ద్వితీయ విభాగము)

**1. తన్మాత్ర** తత్—భూతముల యొక్క, మాత్ర=అంశ, అనగా, ఒక భూతము యొక్క పూర్వరూపాంశ. *(A unit in the prematerial state of an element.)* చెప్పబడనున్న భూతగుణమును పొందని పదార్థస్థాయి. ఉ॥ జలతన్మాత్రకు రసగ్రహణగుణముండదు; పృథ్వీతన్మాత్రకు గంధగుణముండదు. *These are therefore elements with-out their material properties (ie) Prematerial forms of elements.* తన్మాత్రలు పంచీకరణమును బొంది, వాటి భిన్నభిన్న అంశలు మరల సంకలనము బొందినప్పుడే అవి తన్మాత్రలస్థాయి నధిగమించు ఆయా భూతముల భౌతిక పూర్ణరూపధారులై ప్రవృత్తి బొందనర్హము లగును. ఆయంశల సంకలనమువలన అణువులై, అవి పిమ్మట కణములై *(molecules)* తమతమ వస్తు సహజ ధర్మముల బొందును.

**ప్రయోగము :** కొన్ని సందర్భములలో భూతములుగ ప్రసక్తములై యుండిన వాటిని, వాటిసహజ తన్మాత్రల స్థాయిలనే సంభావించ వలసి యుండును.

**2. చిత్తశుద్ధి** అవిద్యాఽస్మిత రాగద్వేషాభినివేశములు పంచక్లేశములు. ఇవి స్వాధ్యాయము ఈశ్వరప్రణిధానముల వలన మాత్రమే తొలగిపోవును. అప్పుడే చిత్తశుద్ధి ప్రాప్తించును. ఇందుల కష్టాంగ యోగములే సాధనములు.

**3. విపర్తము** ఈ పదమొక చిన్నపజిల్ *(PUZZLE)*గ ఎదురగుచూ యుంటుంది. అనగా నొకగడ్డు ప్రశ్నగ తెలియబడుచూ యుంటుంది. ఆగడ్డు ఎట్టిదో విని విశ్లేషించండి.

శ్లో॥ విశ్వం బ్రహ్మభిన్నమేవ స్వయంభవతు మర్హతి ।
అధిష్ఠానా నతిరిక్త స్వభావాత్ ॥

**భావము :** బ్రహ్మకు జగత్తు అభిన్నము — కాని జగత్తుకు బ్రహ్మాపూర్తిగా భిన్నమేనని; ఇందలి భావమైరుధ్యము నెట్లు సమర్థింప నగును ? వివేచించండి.

శ్లో॥ సతత్త్వతోఽన్యథా ప్రథా వికార ఇత్యుదీరితః ।
అతత్త్వతోఽన్యథా వివర్త ఇత్యుదాహృతే॥ వేదాన్తసార(సదానంద)

జగన్నిర్మాణమునకు వలయు 25 తత్త్వములను పరిగణించి వివేచించిన — అది పరిణామవాదముగ ప్రసక్తమగును. ఈ తత్త్వములకు సంబంధింపకయే — కేవలము మనస్సునందు ప్రాప్తించు భ్రాంతిజ్ఞానము వలన స్ఫూర్తి పూర్వకముగ ప్రాప్తించు దృశ్యములు మాత్రము వివర్తములని చెప్పబడుచున్నవి. ఈ ద్వంద్వానుభవమును సాధనలచే సమయింపజేసికొన్నప్పుడే 'విశ్వం' బ్రహ్మాభిన్నమగును. కాని యీ 25 లేక శాక్తుల 36 తత్త్వముల పరిగణించుచునే దర్శింప యత్నించుకో—బ్రహ్మతో పూర్తియగు భిన్నభావమే స్ఫురించు దృశ్యములు అనుభవమునకు వచ్చును. ఈ సమస్యకిదియే ఇది మాయావాద విధానబోధకదృష్టితో పరిష్కారము. బ్రహ్మ యొక్క భావము తత్త్వములకతీతము పారమార్థికము. కనుక పార మార్థిక దృష్టితో పరికించగలవారికి విశ్వం బ్రహ్మా భిన్నము — భౌతికములగు తత్త్వముల దృష్టికి మాత్రము పరిమితమై యున్నవారికి విశ్వము బ్రహ్మకు భిన్నమే యగును. కనుక కారణమగు అధిష్ఠానమునందు అధిష్ఠానాఽనతిరిక్త స్వరూపమునే దర్శించి, జగద్బ్రహ్మయని విశ్వసించ గల

వారికి మాత్రము విశ్వము బ్రహ్మభిన్నమే యగును; కాక, అనన్యదృష్టి సిద్ధించినవారికి బ్రహ్మయే యగును. గ్రాహ్యాంశ మేమంటే — జగత్తు పుట్టుటకు కారణము అజ్ఞానమని చెప్పబడియున్నను,పుట్టి రూపొంది నట్లు భాసించు జగత్తు బ్రహ్మయేనని భావించ లేక పోవుటయే అజ్ఞానము. ఇది తొలగిపోవుటయే నివృత్తి. కనుక ఆత్మాశ్రయకర్మాశ్రయ *(subjective and objective)* దృష్టిభేదములను వివేచించి అనుభూతి బొందిన వారికి మాత్రమే ముక్తి. అట్టివారు మాత్రమే "జీవోబ్రహ్మైవ నాపరః" యననర్హులు. కనుక వివర్తమొక దృష్టిభేద విధానము మాత్రమే.వివర్తము నందలి ప్రక్రియ యెట్టిదన —

"పూర్వరూపాఽపరిత్యాగేన అసత్యనానాకార ప్రతిభాసః వివర్తః యథా శుక్తికాయాంరజతస్య, రజ్జ్వాం సర్పస్యప్రతీతిః" (సాయణుడు: అథర్వణభాష్యం)

తన స్వస్వరూపము సంభావ్యముగాకయే నానాకారములతో అసత్య మూర్తులు కార్యములుగ భాసించుటయే వివర్తమగుట లేక స్ఫూర్తినిచ్చుట.

వివర్తవిషయమున బ్రహ్మజగద్రూపమున స్ఫూర్తి నిచ్చుట విశేషవర్తనము.అన్యత జడదుఃఖాభాసము,విపరీత విశేషాభాసములు కనుకనిది ఆత్మాశ్రయదృష్టికి సాక్షివివర్తమును కర్మాశ్రయదృష్టికి ప్రమాతృ వివర్తమనియు విశ్లేషించబడినదని గుర్తుంచుకొనవలయును.

**4. కూటస్థుడు** *addtoitem No 51* జీవచైతన్య చేష్ట లగు కర్తృత్వ భోక్తృత్వాది లక్షణములచే తన స్వస్వరూపమునకు భంగము కలుగనివ్వక ఉపాధికి ఆలంబన మిచ్చు చైతన్య విశేషమే

కూటస్థుడు అని గౌణముగ జెప్పుదురు. లక్ష్యార్థ మేమన — ఈతడు అంతఃకరణోప లక్షితుడు. అనగా బుద్ధీంద్రియములతో గూడియున్నను వాటినభిమానించి తాదాత్మ్యము బొందకయే యుండువాడు. *The divine Principle which functions as a simple witness only with out any thought of its vehicle, the body and mind.* ఈతడే ప్రత్యగాత్మ: కేవల చిత్ స్వరూపుడు; కనుక పరమార్ధ వస్తువాచకుడు.

**5. సగుణము** అహంగ్రహత లేక సోఽహం భావ సంభావ్యము. శుద్ధసత్వ గుణసంబంధిత చైతన్యము.

**6. నిర్గుణము** అక్షరం, కేవలీభావము, శుద్ధసత్వగుణ సంసర్గము కూడ పొందని ఏకైకత. రజస్సంబంధము లేనందున అచల తత్త్వము.

**7. ప్రతినియతము** ఒకవ్యక్తి నుద్దేశించి నిర్ధారింప బడినట్టిది.

**8. విపర్యయము** వస్తువనునది ఏకమని నిర్ధారించు కొన్నను, అది మరల అనేకముగ భాసించుట. ఈజగత్తు బ్రహ్మకు భిన్నముగాదు. ఐనను భిన్నముగనే భాసించుచున్నది. ఏలనన —మానసికముగ అభేదవృత్తిని సాధించినను మధ్యలో దానియందు ప్రపంచదృష్టి చోటుజేసికొంటూనే యుంటున్నది. ఇలా విజాతీయ భావసంసర్గము సంభవింపకుండ కేవల సజాతీయ వృత్తినే ప్రవాహరూపమున సాగించినయెడల అది జ్ఞాన నిష్ఠయగును. ఈనిష్ఠయే నిదిధ్యాస. దీని వలన విపర్యయమను బడు దోషము తొలగిపోవును.

**9. వ్యావృత్తి :** వ్యాకృతమన — పరిణామ ప్రక్రియ ద్వారా వికారము ప్రాప్తించుట పరిణామ ప్రక్రియ సదా అవిచ్ఛిన్నముగ సాగిపోవుచుండుటచేత ఈపదము పరిణామ పూర్వక నిత్యత్వమును (*flux*) దెలుపును. దీనికి ప్రతియోగిపదము అనువృత్తి *(Coexistace).*

**10. పరాగాత్మ :** స్థూల సూక్ష్మ శరీరముల నభిమానించువాడు.

**11. విప్రతిపత్తి :** భేదభావము.

**12. విభూతి :** దృశ్యమానమగు స్ఫూర్తిరూపముననో భావ సంపన్నమగు సూక్ష్మరూపముననో తెలియబడు నొక లింగము లేక అంశ.

**13. ఐశ్వర్యము :** ఈశ్వరభావముతో ప్రకాశించు నొక ఘనమగు అంశ.

**14. వ్యాకృతము :** పదార్థ పరిణామములవలన రూపాంతరములు పొందుచూ యుండు ఉనికి.

**15. అవ్యాకృతము :** పరిణామములచే వేరువేరు నామ రూపముల బొందకుండుట. ఈ స్థాయి పరమాత్మకు మాత్రమన్వయించును.

**16. ఉపహితము :** ఒక తత్త్వము మరొక తత్త్వముతో తాదాత్మ్య భావముతోచేరి యుండుట. ఉపాధితో కూడినది ఉపహితము.

**17. ఉపలక్షితుడు :** ఒక తత్త్వముతో మరొక తత్త్వముతో తాదాత్మ్యభావము లభింపకయుండి అదియును దీనివలెనే యుండు నను సారూప్యభావమును దెలుపుట. ఫలానవారిని గురువుగా లక్షించిన

సాక్షాత్తుగ అంగీకారము దెలుపును. గురువుగా నుపలక్షించుటయన— వారియందుండు ప్రతిభను పరిగణించి తన గురువుయొక్క ప్రతిభతో పోల్చుకునివారినిన్నీ గురువుగలక్షించి గౌరవించుట.

**17a. వివృతి** అజ్ఞాన పుటావరణ తొలగి దృశ్యముయొక్క తాత్త్విక స్వరూపము సూక్ష్మరూపమున ప్రకటమగుటయే వివృతి. ఇది హిరణ్య గర్భస్థాయి చైతన్యమునందు కొన్నవారికే అనుభూతియగును.

**18. ప్రతీభాస** : భ్రమపొంది యున్నవానికి అభ్రమజ్ఞానమున కనువగు వస్తురూపము స్ఫూర్తినిచ్చుట. అట్టి స్ఫూర్తినిచ్చునది ప్రాతిభాసికవస్తువు. భ్రాంతితొలగినపిమ్మట అది మిథ్యావస్తురూపముగ దెలియబడును. ఇందుకు సహజవస్తుజ్ఞానమవసరము.

**ప్రయోగము** : బ్రహ్మయొక్క అపరోక్షానుభూతి ఎట్టిదో ముందు శ్రవణమననాదులతో సాధనలతో గ్రహించనివానికి బ్రహ్మానుభూతి మృగ్యమేయగును. తూలా విద్యచే ప్రాతిభాసికవస్తువు గోచరించును. అని బ్రహ్మజ్ఞానానుభూతితో తొలగునని బోధింప ఈ పదముపయుక్తమగును.

**19. తంత్రము** తన్యతే విస్తార్యతే జ్ఞానం ఇతి తంత్రః అజ్ఞానమును తొలగించుచు, తత్త్వమును మంత్రార్థమును విస్తరించిదెలుపునదియే తంత్రము. త్రాణమొనరించునది (రక్షించునది) యని మరొక వివరణయు గలదు. మానసికమై యున్న అంతరార్థ బోధను అవలంబించి ఈశ్వరాన్వేషణ జేయుటకే తంత్రశాస్త్రములు ప్రసక్తమైనవి. తన్ = విస్తరించుటకు, త్ర = రక్షించుటకు ఉద్దిష్టములైనవి శాస్త్రములు. *Tantra is a work which spreads knowledge and saves the soul.* మాన

వుని కర్మలు క్రియలు, చర్యలు, ప్రవర్తనలను మార్చి సాంఘికజీవనాభ్యుదయమునకు సహకరించు నట్టివియే తంత్ర శాస్త్రములు.

**20.** ఆగమము భోగోప లబ్ధికేగాక మోక్షసిద్ధికిని సాధనముల సూచించి దెలుపు శాస్త్రములు ఆగమములు. దేవాలయ నిర్మాణ విషయమున నీశాస్త్రములకు ప్రత్యేక స్థానముగలదు. ఇందు శివకేశవుల స్వరూపస్వభావ విశేషణములు విస్తృతముగ వివరించబడి యుండును.

ఆగతాన్ శంభానక్త్రేభ్యః। గీతాంచగిరిజామతే।
మతంచవాసుదేవేన తస్మాదాగమఉచ్యతే॥

నిగమములు వేదములు. అవి భక్తి కర్మ ఉపాసన, జ్ఞాన రూపములగు సాధనల దెలుపును. ఆగమములన్ననో—వాటికి సాధనములగును. శాక్త తంత్రములు అద్వైత సిద్ధాంతములకే ప్రాధాన్యతగల్పించి బోధించును. శైవవైఖానస తంత్రములు ద్వైత విశిష్టాద్వైత సూత్రముల దెలుపును.

**21.** యంత్రము *: It is a diagramatic representation of Divinity with lines (rekhas) curves triangles and points. The centre is the Bindu (Concentrated creative force ready to project and create).*

**22. YONI** : *the fountain head from which some thing generates and promotes* ఒక తత్త్వము ప్రభవించుటకు మూలము.

**23.** ప్రమాత ప్రమయనజ్ఞానము, ఇంద్రియములద్వారా జ్ఞాన సముపార్జన జేయువాడు. ఉపాధిభేదములవల్ల నీతడు వేర్పాటుపొందిన జ్ఞానముతో లోకవ్యవహారములను పారమార్థిక జీవితమును గడుపును.

**24. ప్రపంచము** : భూతపంచీకరణ ప్రక్రియచే సృష్టికరించబడు దృశ్యము.

**25. ప్రపంచ్యతే** : సృష్టీకరించబడుచున్నది.

**26. నిష్ప్రపంచము** : పరబ్రహ్మస్వరూపము.

**27. అవచ్ఛేదము** : పరిమితిని గలిగించునది. (అవచ్ఛిన్నము : *limitation*) కుండయందలి ఆకాశమునకు కుండవల్ల పరిమితి గలిగి ఘటాకాశమని చెప్పబడునట్లు—ఒకని అంతఃకరణమున ప్రతిఫలించి, ఆమేరకుమాత్రమే పరిమితమైన చైతన్యమును జీవుడని సామాన్యులు, చిదాభాసుడని తాత్త్వకులును వ్యవహరించుచుందురు. *That which Conditions a thing, as space in a pot is limited by the container, is Avachedakam.* దీనికి మరొక అర్థము విశేషధర్మము. ఉ॥ పృథ్వియందు గంధము పృథ్వికి అవచ్ఛేదకము. అనగా గంధము పృథ్వియొక్క విశేషగుణమును దెలుపును.

**28. అతీంద్రియజ్ఞానము** : ఇంద్రియముల అపేక్షతో జీవ చైతన్యమును పొందేది వృత్తిరూపజ్ఞానము. కాని సంయమనస్థితియందు స్వయముగ సిద్ధించునట్టిస్థితి చిత్తవృత్తి పూర్వకముగాదు. అనగా జ్ఞానేంద్రియములకు సంబంధించినదిగాదు. ఇది మానసికస్థితినిదాటి ఒక అతిమానసస్థితియందు లభించిన స్వయంసిద్ధనిరామయ జ్ఞానము (*Super conscious knowledge*).





# ఖ్యాతి

ఖ్యాతి : భ్రాంతిజ్ఞానమును గురించి కొన్ని భంగిభేదముల దెలుపు విధానములున్నవి. ఈవిధానములే ఖ్యాతి యందలి భేదభావములు. ఇవి 4 విధములుగ నభివ్యక్తము జేయబడినవి. *These are the theories of false knowledge in explaining the multiplicity of the Mayic world.* కానీ త్రికసిద్ధాంతము అపూర్ణఖ్యాతి *(a positive nescience of the Completeness of things)* అనునొక విధానమును దెలుపుచున్నది. త్రికసిద్ధాంతమున మాయ భ్రాంతిజ్ఞాన సంజనితముగాదు. ఇది ఉనికి గలదనిగాని లేనిదనిగాని నిర్దిష్టముగ వర్ణింపబడ జాలదని, కనుకనే నిది అసంపూర్ణఖ్యాతి రూపమగు భ్రాంతి యని మాత్రమే దెలుపుదురు. త్రిక సిద్ధాంతాను గుణ్యముగ మాయ అనిర్వచనీయము గాదు. అది మహేశ్వరుని ఉత్కృష్ట భావసంకలిత రూపమగు స్వేచ్ఛాపూర్వక స్వతంత్ర శక్తియే. దాని స్వరూపము సంవిత్ స్వరూపమే, ఇది వాస్తవాత్మకమే. ఇట్లు నిర్ద్వంద్వముగ అభివర్ణనీయమగు ఏకాత్మ భావపూర్వక తత్త్వమే. కాని అద్వైతుల భావనా దృష్టికిది నానాత్వకారకమగు భ్రాంతి జ్ఞానరూపిణియే. కనుక వీరికిది నిర్వచనీయమనియే నిశ్చితాభిప్రాయము. ఇందుననే త్రిక సిద్ధాంత ప్రతిపాదకులు ఖ్యాతియందలి భంగిభేదముల స్పృశించి యుండలేదు. ఇది అసంపూర్ణఖ్యాతి రూప భ్రాంతియందురు. ఇదియే త్రికవాదుల మాయా స్వరూప నిర్వచనము.



ఖ్యాతి : అనగా భానము, కథనము, అని అర్థము. ఇట్లు భానమగు ప్రక్రియ ఐదు విధములు.

**1. అసత్ఖ్యాతి :** ఇది శూన్యవాది అభిప్రాయము. త్రాడు వంటి ఒక పొడుగైన వస్తువు అచటనుండగా, దానిస్థానమున నొక పాము రూపము గోచరమగుట నిజముగాని దృశ్యమే గదా ! ఇట్టి అత్యంత అసత్తగు సర్పఖ్యాతి ఒక రజ్జువునందు గలుగుటయే అసత్ఖ్యాతి యనబడు చున్నది.

**2. ఆత్మఖ్యాతి** త్రాడునందుగాని అట్టి భావమును గలిగించు మరొక వస్తువునందుగాని, సర్పము అసలు లేనేలేదుగదా ! కనుక సర్వపదార్థముల ఆకారములు స్ఫూర్తినిచ్చుటకు గోచరించుటకును బుద్ధియే కారణమగుచున్నది. అట్టి బుద్ధి క్షణిక విజ్ఞానపూర్వకమైనట్టిదని అందురు. అంటే క్షణకాలములో ఉత్పత్తియై మరుక్షణముననే నాశము బొందుచుండునని భావము. ఇట్లు ప్రతిక్షణమునకు చిత్తవృత్తులు భేదించి అన్యరూపములు గోచరించుటయే ఆత్మఖ్యాతి యందురు. ఇచట ఆత్మ యనగా క్షణిక విజ్ఞానరూప బుద్ధియే.

**3. అన్యథా ఖ్యాతి :** నైయాయిక వైశేషికుల అభిప్రాయమున సత్యమగు పాము సమ్ముఖమున లేకున్నను. పుట్ట మొదలగు చోట్లనుండవలసిన సత్యమగు పాము సమ్ముఖమున ఉండవలెను. దానిని నేత్రములతో జూతుము. నేత్ర దోషములు గలవారికి ఆరోగ బలమువలన సమ్ముఖమున నున్న రజ్జు స్థానమున సర్పము ప్రతీతమైనది. నైయాయిక వైశేషికుల అభిప్రాయము సత్యమగు సర్పము సమ్ముఖమున లేకున్నను దానిని యదార్థముగ జూచుచున్నట్లే ఒకప్పుడు భావింతుము. కనుక రజ్జువు

స్థానమున అసలు లేని సర్పము ప్రతీతమగుటయే అసత్ఖ్యాతి. అసత్ అనగా అసలు లేనిదని యర్థము. *false knowledge of a thing which is not there in reality is Asat - khyati.*

**4.** అఖ్యాతి ఇది జ్ఞాపకశక్తి ఆవరింపబడుటచే ప్రాప్తింపను ఇది కొంచెము ఆసక్తికరము, గమనించండి. ఈ—స—ర్ప—ము అను జ్ఞానమునందు ముందు మనకు 'ఈ' ........ అని మాత్రం స్ఫురించుతుంది. ఇది రజ్జువు యొక్క సామాన్యాంశ. ఇది ఒక సామాన్య స్ఫూర్తియే కానీ, నిర్దిష్టమగు ప్రత్యేక స్ఫూర్తిగాదు — *a general but not a specific idea.* సర్పభావమెలా కలిగిందంటే — ఎన్నడో చూడబడిన ఒక సర్పము యొక్క స్మృతిజ్ఞాన పూర్వక సర్పమునందలి ఉపాదానము *(material)* స్మృతి పూర్వకమేగాని భౌతిక పదార్థము *(mass)* కాదు. కనుకనే దీనిని భ్రమ జ్ఞానమందురు *an illusion caused by a derailed identity of the mind.* పట్టాలు తొలగిన రైలు, మార్గము కూడా తప్పినట్లు. ఇపుడు రజ్జువుయొక్క విశేషరూపమగు పాము యొక్క రూపము, నిజానికి ఒకతాడేనని సహజ జ్ఞానము ప్రాప్తించిన పిమ్మట సర్పరూప భావము తొలగిపోయి తాడుయొక్క యదార్థరూప జ్ఞానము ప్రాప్తించ, సర్ప ప్రతీతి మిథ్యయే యగును.

ఇట్టి బాధా విధానము (*negation* అపవాదము) వలన — రజ్జువు నందు సర్పప్రతీత సిద్ధమై యున్నట్టిదేగాని, పూర్వము సర్పమును చూచి యున్నందున కలిగిన స్మృతి జ్ఞానమువలన గాదని అఖ్యాతి వాదుల సిద్ధాంతము. ఇది ప్రభాకర సాంఖ్యుల వాదము ! ఏమన — రజ్జువు నాశ్రయించి యున్న అవిద్యయందు క్షోభమునకు ఏది నిమిత్తమో అదియే,

సాక్ష్యాశ్రితమైన అవిద్యయందు క్షోభను కలిగించుచున్నది. కాబట్టి భ్రమస్థల మందుగల విషయమునకును దానియొక్క జ్ఞానమునకును ఉత్పన్నత ఏక కాలమునందే కలుగుచున్నది.

అఖ్యాతియన *that which is not real knowledge* దీనితో క్షణికవిజ్ఞానము, అన్యథాఖ్యాతియు, తొలగింపబడుచున్నవి. అధిష్ఠానమగు రజ్జువుయొక్క జ్ఞానమువలన—అచటి విషయము, దానిజ్ఞానము, ఏక కాలమందే లయమగుచున్నవి.

ఈ విధముగ భ్రమస్థలమునందు బాహ్యావిద్యాంశము సర్పాదివిష విషయమున కుపాదానకారణముగను, అంతరవిద్యావిషయము సర్పజ్ఞాన మున కుపాదానముగను నున్నవి. స్వప్నమందును సాక్ష్యాశ్రితమగు అవిద్య యొక్క తమోగుణాంశము విషయరూప పరిణామమును పొందును. మరియును నా అవిద్యయొక్క సత్వగుణాంశము జ్ఞానరూప పరిణామ మును బొందును. స్వప్నమునందును, అంతరావిద్యయే విషయమునకును, మరియు దాని జ్ఞానమునకును ఉపాదానకారణమగుచున్నది.

విపరీతఖ్యాతి-పూర్వమీమాంసకులు చెప్పునట్టిది.

**5. అనిర్వచనీయఖ్యాతి :** దీనికి సూత్రమేమన- భ్రమ కలుగుచున్న స్థానమునందలి స్ఫూర్తినిచ్చు సర్పముగాని దానియొక్క జ్ఞానముగాని, సాక్షికిమాత్రమే భాస్యము. అవి అంతఃకరణపరిణామముచే ప్రాప్తించినవిగావని మాత్రము గ్రహించ వలయును. ఎట్లు రజ్జు జ్ఞానమువలన సర్పమునకు బాధ (*negation*)

కలుగునో అట్లే ఆ సర్పజ్ఞానమునకును బాధ ప్రాప్తించును. ఏమన— అంతఃకరణవృత్తిరూపమై యున్నయెడల, ఆపాముకు బాధకలుగనవకాశ ముండదు. కానీ, బాధ కలుగుచున్నందున ఆ సర్పజ్ఞానమున్ను, అవిద్యా కార్యమగు నా సర్పరూపమున్ను, సదసద్విలక్షణముగ నున్నవి. కనుక రజ్జూపహిత చైతన్యమునందును, తమోగుణప్రధానమైన అవిద్యాంశము పరిణమించి సర్పముగను, సాక్షిచైతన్యమునందుండు అవిద్యయొక్క సత్వ గుణాంశ పరిణమించి సర్పజ్ఞానమున్ను అగుచున్నవి. ఎప్పుడు రజ్జుచైతన్య స్థితమైన అవిద్య సర్పాకారముగ పరిణమించునో అప్పుడుమాత్రమే సాక్షినాశ్రయించిన అవిద్య సర్పాకారముగ పరిణమించును. రజ్జుసర్ప జ్ఞానమువలన సర్పనివృత్తిగాజాలదు. ఏమన—మిథ్యావస్తువునకేది అధి ష్ఠానమగునో—దాని జ్ఞానము వలనమాత్రమే మిథ్యావస్తువుయొక్క నివృత్తి గలుగును. ఇది అద్వైతమునందలి ఒక ప్రముఖ సిద్ధాంతము. అందుచే రజ్జుజ్ఞానముచే సర్పరూపము నివృత్తి గాజాలదు. అందువలన ? రజ్జుజ్ఞానమే సర్పాధిష్ఠాన జ్ఞానమని తెలిసికొనవలయును.

ప్రయోగము : వేదాన్తులు : రజ్జుజ్ఞానం కలిగిన తరువాత, దానిపై యిదివరలో కలిగియున్న సర్ప జ్ఞానమున్ను మిథ్యయని ఎట్లు తెలియబడు చున్నదో, అట్లే ఆత్మయందు కలిగిన భవదుఃఖములు కూడా మిథ్యాభావములేనని బోధించుటకు ఖ్యాతి యందలి భేదభావములు తెలుపబడినవి. విషయ వివేకము సుబోధకమగుటకు రజ్జు సర్పమును దృష్టాంతముగ తీసికొనిరి. దీని ప్రయోజన మెట్టిదన — ఎచ్చట రజ్జువు నందు సర్పభ్రమ కలుగునో అచ్చట తన నేత్రము యొక్క వృత్తిద్వారా -

రజ్జువుకు సంబంధించి 'ఇదం' రూపముతో రజ్జువుయొక్క సామాన్య జ్ఞానము *(general idea)* కలుగును. అంటే 'ఇది' అనేటంతవరకే తెలియబడును. గాని, ఆ 'ఇది' అనబడేది ఫలానా (తాడోపామో) మరి యింకేదోనని నిర్దిష్టముగ చెప్పజాలని స్థితి యున్నమాట. ఈ స్థితియందు వెనుక ఎన్నడో జూడబడిన నొక సర్పజ్ఞానము స్మృతి రూపమున ప్రాప్తించి సర్పముగ భానమై కథనము చేయబడుచున్నది. కనుక నిచట 'ఇది' లేక 'ఈ' అనబడే అనిర్దిష్ట జ్ఞానమొకటి (రజ్జువుయొక్క సామాన్య ప్రత్యక్ష జ్ఞానము *a knowledge of the general undeteminate appearance*) కలిగి తరువాత సర్పము అను సామాన్య స్మృతి జ్ఞానము కలుగును. ఇట్లు నిజవస్తువగు రజ్జుజ్ఞాన వివేకాభావమువల్ల ఈ ద్వివిధజ్ఞాన విధానములను 'భ్రమ' యని ప్రభాకర సాంఖ్యులు జెప్పుదురు. *Original* గలిగి అన్యథా స్వరూపము పొందుట పరిణామ ప్రక్రియ యందలి విధానమనియు జెప్పబడినది.



# పంచకోశములు

కోశమనగా కత్తికి వర వంటిది. ఒక దేహమును స్థూల, సూక్ష్మ, కారణ శరీరములుగ విభజించి తెలిసికొనవచ్చుననియు, ఈ దేహములను మరల వివేచనతో విశ్లేషించిన అందు పంచకోశములున్నట్లు గ్రహింపగల మనియు శాస్త్రభావము.

శుద్ధసత్వగుణముతోగూడి ప్రభవించినమాయ ఈశ్వరునకు కారణ శరీరముగ నుపకరించుచుండ, మలినసత్త్వగుణ సహితమైన అవిద్యాంశ జీవునకు కారణ శరీరమగుచున్నది. తరువాత రూపొందనున్న సూక్ష్మ,

శరీరావశ్యకములగు పంచసూక్ష్మభూతములు, మనోబుద్ధి చిత్తాఽహంకార ములు, పంచప్రాణములు, పంచజ్ఞానేంద్రియముల, గూడి ఆ జీవునికి సూక్ష్మ శరీరమేర్పడుచున్నది. ఇట్టి జీవుల సమష్టి సూక్ష్మ శరీరములు ఈశ్వరునికి సూక్ష్మశరీరమని జెప్పబడుచున్నది. పూర్ణమగు ఈ బ్రహ్మాండపు రాశియంతయు ఈశ్వరుని స్థూల శరీరమనియు జెప్పబడుచున్నది.

ఈ స్థూల, సూక్ష్మ కారణ శరీరములు మూటియందును పంచకోశ ముల, పదార్థములతో పూరింపబడియున్నట్లే ప్రసక్తమగుచున్నది. కోశ మన కత్తిని దూర్చియుంచు వరవంటిది, లేదా ఒక దిండును కప్పియుంచు గలీబువంటిదని లోగడ జెప్పియుంటిమి. కాని మానవశరీరమునందలి కోశములు మాత్రము ఒక అవయవమును మరొక వరవంటిదానిలోగూర్చి కప్పివేసినట్లుండుటకు అనువుగ నుండవను విషయమును మాత్రము గుర్తుంచుకొనవలయును. అందుచే వీటి నిర్మాణములవిషయ వివేకమును బొందుటావశ్యకము.

**1. స్థూలశరీరము :** ఇది తాను భుజించు పోషక పదా ర్థములనుండి లభించు ద్రవ్యసారములు రస రక్తాదిధాతు రూపములతో నిర్మాణమగుచుండునుగనుక దీనిని అన్నమయ కోశమందురు. స్థూలదృష్టి కిది కేవలము ప్రధానమగునుగనుక అన్నమయ కోశమనబడుచున్నది.

స్థూలశరీరమున — 1. అన్నమయకోశమ మరియుండును.

సూక్ష్మశరీరమున — 2. విజ్ఞానమయకోశము

(పంచజ్ఞానేంద్రియములు బుద్ధితో) గూడియుండును.

3. మనోమయకోశము జ్ఞానేంద్రియములు— మనస్సుతో గూడియుండును.

4. ప్రాణమయకోశము :—5 కర్మేంద్రియములు-5 ప్రాణములతో గూడి యుండును.

5. ఆనందమయకోశము : వాసనలు సంస్కారములతో గూడి యుండును.
కారణశరీరమున గలవాసనలు సంస్కారములతో గూడి

√ మొత్తము ఐదు కోశములును మూడు శరీరములయందు ననే గలవు.

ప్రయోగము : జీవుని శరీరమునందు గల జీవకోశములు జీవుని నిజరూపమగు ప్రత్యగాత్మను ఆచ్ఛాదించుచున్నవి. శరీరత్రయ వివేకమువలన పంచకోశముల వివేకము గలుగును. లేక, ఈ పంచకోశముల వివేకము గలుగనిదే జీవుని ఉనికి విషయకజ్ఞానముగాని ఆతడి నిజ స్వరూపమగు ప్రత్యగాత్మ స్వరూప స్వభావములుగాని బోధపడవు. జీవుని సమష్టి పంచకోశముల స్వభావము, అట్లే ఈశ్వరుని పంచకోశముల స్వభావస్వరూపములను తాత్త్వికముగ గ్రహించనవకాశము గలుగును.

1. అన్నమయకోశము — స్థూలశరీరమునందు
2. ఎ. విజ్ఞానమయకోశము పంచజ్ఞానేంద్రియములు (*Sheath of intelligence*) బుద్ధితోను గూడినది.

   బి. మనోమయకోశము (పంచజ్ఞానేంద్రియములు మనస్సుతోను గూడినది)

   సి. ప్రాణమయకోశము (పంచకర్మేంద్రియములు పంచప్రాణములు కలిశినవి సూక్ష్మశరీరమునందు ప్రవృత్తిసాగించును)

3. ఆనందమయకోశము — కారణ శరీరమునందు సంస్కారములతో రూపొందినది. ప్రియ, ఆమోద, ప్రమోద చిత్త

వృత్తులతోగూడి అజ్ఞానము ప్రధానముగ నుండిన అంతఃకర ణమే యీ కోశము.

మొత్తము పంచకోశములు మూడుశరీరముల యందుండును.

ప్రయోగము : ఆత్మ సత్త నుపజీవించుకొని తోచెడి పంచకోశములును, ఆత్మను మరుగుపరచగలవను విషయబోధ ఈ కోశ ములను, ఆత్మను మరుగుపరచగలవను విషయబోధ ఈ కోశముల జ్ఞానముపకరించును. ఆత్మకు పంచకోశములతో సంసర్గమున్నట్లు చెప్ప బడుచున్నను ఈ సంసర్గభావము అన్యోన్యాధ్యాసవలన సంభవమని గ్రహించుటయే గ్రాహ్యాంశము. ఆత్మధర్మములగు సచ్చిదానందములను కోశములకుగాని, కోశధర్మములు ఆత్మకుగాని ఆపాదించకూడదు.



## మహావాక్యములు

మహావాక్యములు : అనగా గొప్ప వాక్యములు; అంత గొప్పదనమును ఎందువల్ల ఆపాదించుచున్నారు ? అనగా మాటలవలన జెప్పదగు భావముల చరమబోధను జీవునికి దేవునకు గల అనన్యతా భావమును నిర్ధారించు మాటలగునుకనే అవి 'మహావాక్యములని చెప్పబడు చున్నవి. ఇట్టివి నాలుగు వేదములందును నాలుగు గలవు. ఈ నాలుగున్ను అద్వైత సిద్ధాంతప్రతిపాదకములున్ను ప్రబోధకములు మాత్రమే. ద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతములను బలపరచేవి మాత్రముగావు. ఇకవాటిని విచారింతము.

1. 'తత్త్వమసి' ఇది సామవేదము దెలుపు ఉపదేశాత్మకము ఏమా ఉపదేశమన — అది అని నీవు దేని నుద్దేశించి చెప్పుచున్నావో అది (దేహముగాను ఇంద్రియములుగావు, మనః ప్రాణములుగావు, మరే ఇతరమున్ను గాను) పరమాత్మవగు నీవే అయియున్నావు.

2. ఋగ్వేదము : "ప్రజ్ఞానంబ్రహ్మ" ఇది బ్రహ్మ పదార్థము యొక్క స్వరూప సాక్షాత్కార జ్ఞానబోధకము. నిరతిశయ జ్ఞానమే *(knowledge absolute but not relative is Bramham)* బ్రహ్మము. కనుక *Einstein* అను జర్మన్ శాస్త్రవేత్తయొక్క "తియరీ ఆఫ్ రెలెటివిటీ" అద్వైత సిద్ధాంతమునకు అపవాద *(method of Negation)* పూర్వకమును అధిష్ఠాన పదార్థ నిర్ధారకమునగు బోధయని గ్రహింప నగును.

3. యజుర్వేదమునందు "అహంబ్రహ్మాస్మి". ఇది అనుభూతిని బోధించు వాక్యము. అహం అనబడు వాడెవ్వడో ముందు దర్శనశాస్త్రముల జదివి — ఆ 'అహం' ప్రత్యగాత్మయే నను నిర్ధారణకు ముందురావలెను. తరువాత వేదాన్త దర్శనమును జదివి ఈ ప్రత్యగాత్మయే పరమాత్మయను విశ్వాసమును స్థాపించుకొని, యోగసాధనలచే మనోలయమును బొంది, నిర్వికల్పస్థితిని సిద్ధించుకొని అప్పుడు అనుభూతియన నిట్టిదని దానిననుభవించుటయే మోక్షము. ఇంతటి జటిలమగు సాధన జేయకయే అహం బ్రహ్మాస్మి యనుచు ఆయనుభూతిని నటించుచు ప్రదర్శించువాని విషయమున విద్యారణ్యస్వామి జెప్పిన మాటలను వినిపించమందురా ? వద్దు అపరాధమందురా ? మీరేమైనా అనండి నేను విశ్వశించిన వానిని వినిపింతును వినండి —

శ్లో॥ హాకృత్వావృత్తి విలయం । అజ్ఞాత్వాబ్రహ్మ కేవలం ।
అహంబ్రహ్మేతియో బ్రూయాత్ । తస్యజిహ్వాం వికర్తయేత్॥
(విద్యారణ్యుడు)

తాత్పర్యము : చిత్తవృత్తుల లయింపకయే (ఏకాగ్రత బొందకయే) సాపేక్షిక భావముల నపవదించి, కేవల బ్రహ్మను *the absolute* అనుభూతికి దెచ్చుకొనకయే ఎవడు అహం బ్రహ్మాస్మియనుచు ధృవీకరించి పలుకునో వాని నాలుకను ఖండించవలెను. అంతవరకును అహం బ్రహ్మాస్మియను చిత్తవృత్తిని అభ్యసించవలెను. ఇదియే యోగ సాధన, తత్త్వసాధనయును.

4. అధర్వణవేదము : "అయమాత్మాబ్రహ్మ". పరిచ్ఛిన్నుడుగ భావింపబడుచున్న ప్రత్యగాత్మయే విభువగు పరమాత్మయని నిర్ధారించు వాక్యము.

ప్రయోగము : పై దెలిపిన నాలుగు మహావాక్యములను నేను, నీవు అను పదములకు వాచ్యార్థముల దెలిపి వాటిచే దెలిసికొననగు లక్ష్యార్థముల బోధించుటకు, ఆత్మతత్త్వము నిర్విశేషము, ఏకైకమని, విభువని, అనంతమని, బోధించుట కుపకరించును. మరియు ప్రత్యగాత్మ పరమాత్మల కనన్యత్వమును బోధించి అయనుభూతియే మోక్షమని నిర్ధారించి దెలుపును. ఆ యాత్మయే నిర్గుణకారణబ్రహ్మయనుట పర్యవసానమని బోధించును.



## *** ఉపాసన ***

**ఉపాసన :** ఒకానొక తత్త్వమును రేఖారూపమున గాని యంత్ర రూపమునగాని, విగ్రహరూపమునగాని శాస్త్రసమ్మతముగ విధానమున ఏర్పరచి, దానికి సంబంధించిన చిత్తవృత్తిని అవిచ్ఛిన్న ధారావాహికముగ స్మరించు విధానమే ఉపాసన.

**1. ఇందలి సూత్రము :** భౌతికమగు నొక క్షుద్ర పదార్థమునందొక మహత్పదార్థము నంతర్యామిగ సంభావించి ధ్యానించుటయే.
*N. B.* ఇంకొక సూక్ష్మమును సూచించుచున్నాను. ఏమన — దృశ్యమానమగు జగత్తత్త్వము ఒక అనంతమగు అధిష్ఠాన పదార్థముపై అధ్యారోపింపబడిన దనిగదా శాస్త్రబోధ ! జడమని చెప్పబడుచు ఆయనంత పదార్థముపై అధ్యారోపితము జేయబడినట్టిదానియందు మరల నొక దివ్యతత్త్వము నంతర్యామిగ సంభావించి, ఆహ్వానించి, అరిచ్ఛించి, ధ్యానించుటలోగల సూక్ష్మభావము—సామాన్యులగు సర్వులకును అవగాహనకు రాజాలదు. ఒక జడ స్వరూప శకలమునకు ప్రాణప్రతిష్టజేసి, చైతన్యము నంతర్యామిగజేసి దివ్యత్వము నారోపించి ధ్యానించుట, కామ్యఫలసిద్ధులకేనా ? మోక్షసిద్ధికా ?

1. ప్రతీకోపాసన 2. జంతువృక్షారాధన 3. సమాధ్యాదులయుపాసనలు ఉదాహరణములు. ఇవి సాధారణవిధానములు.

*Yentra is a diagramatie representation of divinity with lines, curves △ s and points. Its cantre is a point, the Bindu, which represents the mother as the Concentrated power ready to create.*

ఇందలి శాస్త్రీయ విధానములు 1. విగ్రహోపాసన (దీనినే ప్రతీకోపాసనయందురు) 2. అహంగ్రహోపాసన 3. అక్షరోపాసన. వీటిని రెండు విధముల విభజించుకొనవచ్చును.

1. వ్యక్తోపాస్తి : దీనిని సగుణోపాసన లేక సోపాధికోపాసన యందురు. *This is the devotional type of meditation.*

2. అహంగ్రహోపాసన : ఈ సాధనయందలి విధానము 'సోఽహం భావేన పూజయేత్' ధ్యాయేత్ అని. ఎవరి ఇష్టదేవతను వారు పూజించనీ ధ్యానించనీ — సోఽహం భావము (అహంగ్రహము) మాత్రమవసరము. *The conception of nondifference between the deity and the devoty is the rule in this method.* ఇది యొక ఉపాధియందు సంభావింపబడిన సూక్ష్మతత్త్వ పుటుపాసన.

అహంగ్రహోపాసన : ఇందలి విధానము 'సోఽహం భావేన పూజయేత్' అనగా అహంగ్రహభావము ప్రధానము. ఉపాసింపబడు దైవత స్వభావమే నాస్వభావము "త్వంవా అహమస్మి భగవో దేవతే —అహంవై త్వమసి భగవో దేవతే" ఓ పరదేవతా నీవే నేను — నేనే నీవు అని ఉపాసించవలెను. (జాబాలోపనిషత్)

3. అవ్యక్తోపాస్తి : ఇది నిరుపాధిక నిర్గుణోప్రాప్తి. *This is the intellectual meditation in Contrast to the devotional process or the transcendental meditation of pure identity.* ఇది అహం గ్రహముగాను సోఽహం భావవిధానముగాను. ఇదియే అభేదనిష్ఠ యనబడు విధానము. ఇట్టి నిర్గుణోపాసన యందును. భావా-

భావరూప లక్షణము లున్నవి. చైతన్య రూపమైనట్టిది ఆనందరూపమై నట్టిదియు నగు పరబ్రహ్మ భావరూపము : దీనికి అస్థూలం అదీర్ఘం అనణువు అనెడి లక్షణములు అభావరూపములు.

*These are the negative phases* (ప్రతియోగి) భావములు *of impersonal Bramhan.* చైతన్యరూప మైనట్టియు ఆనందరూపమై నట్టిదియు పరబ్రహ్మ భావరూపమైనట్టిది. *Such double phased disci-pllne is to be contemplated by a juvenile aspirant. Hence this discipline is not actual supramental poise prescribed for a mature practicant.* ఇది అక్షరపూర్వక నిర్గుణోపాసనకు సంబంధించిన అధరభూమిక *(a lower standard of contemplative concentration).* దీనిని 'ధ్యానాత్మక అక్షరోపాసన' యందురు. జ్ఞానాత్మక అక్షరోపాసన యన్ననో — నిజమగు నిర్గుణ బ్రహ్మనిష్ఠ లేక జ్ఞాననిష్ఠ. ఇది కేవల జ్ఞానమాత్రమేగాని ధ్యానసంబంధి గాదు. సామాన్య జనుల పరిధియందలిది ధ్యానాత్మకమే. సర్వవిధానముల యందును ఉత్కృష్టమైనది శ్రీదేవి ఉపాసనమే.



# అవస్థాత్రయము

అనగా-జీవితమునందు అనుస్యూతముగ ప్రతిదినము సంభవమగు చుండు స్థితి భేదములే యీయవస్థలు. వీటిని మూడు విధములుగ విభజించినారు. అవి-జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థలని త్రివిధములుగ విశ్లేషింపబడినవి. వీటి నభిమానించువారు విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు అని వ్యవహరింపబడుచున్నారు.

జాగ్రదవస్థ : మనము మెలకువతోయుండి, మనలోక వ్యవహారముల జరుపుకొనుకాలము. ఇందు మనస్సుయొక్క నాలుగు అంశలు- మనోబుద్ధి చిత్త అహంకారములు క్రియాశీలముగయుండి అనుభూతుల బొందుచుంటవి. జ్ఞానేంద్రియములు లోక వ్యవహారముల గ్రహించుచుంటవి. కర్మేంద్రియములు తమ స్వాభావిక సహజ కర్మల నిర్వహించుచుంటవి. ఈ స్థితియందు అనుభూతినిబొందు స్థూలశరీరము నభిమానించువాడు వ్యష్టిగ 'విశ్వుడు'—సమష్టిగ పరిగణించబడినయడల 'విరాట్' అనబడును. వీరిరువురు స్థూల శరీరమునకు సంబంధించినవారే, కనుక ప్రాకృతులనియే—అనగా ప్రకృతికి సంబంధించినవారేనని చెప్పబడుచున్నారు.

స్వప్నావస్థ : దీనియందు జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు మరుకుగా ప్రవృత్తి పొందక విశ్రాంతిగ నుంటవి. మనస్సు సర్వవ్యవహార సామర్ధ్యము కోలుపోయినను,స్మృతిజ్ఞానముతో కొంతవరకు ప్రవృత్తి బొందుచుండును. అంతః కరణమునందు ప్రధానాంశమగు మనస్సు మాత్రము జాగ్రత్తునందు తానుజూచిన విషయముల స్మృతులను అను

భూతిబొందుతూ యుంటుంది. దీనితో కొంతభాగము భ్రాంతిజ్ఞానము కూడ మిళితమైయుంటచేత వింతవింత అనుభవాలనుకూడ పొందుతూ యుంటుంది. సూక్ష్మపదార్థమగు చిత్తమునందు కలుగు మార్పులవల్ల నీస్వప్నమునందలి పదార్థము తైజసము. ఈ యవస్థ సూక్ష్మశరీరమునకు సంబంధించినది. దీని నభిమానించు తత్త్వమును వ్యష్టిగ పరిగణించిన తైజసుడనియు, సమష్టిగ పరిగణించిన హిరణ్యగర్భుడనియు యందురు. హిరణ్యమన నిచట బంగారముగాదు, జ్ఞానము. కనుక జ్ఞానముతోను చైతన్యముతోను ప్రవృత్తి సాగించువాడని యర్థము.

సుషుప్త్యవస్థ : ఇందు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములేగాక మనస్సుకూడ స్తబ్ధతపొంది ఉపసంహరింపబడుతుంది. జాగ్రదవస్థయందలి అహంకారముగాని, స్వప్నమునందలి గలుగు స్మృతి, భ్రాంతి, జ్ఞానములుగాని యందుండవు. జీవాత్మ-తనకాలంబనమైయున్న కూటస్థ చైతన్యముతో తాదాత్మ్యముపొంది ఆనందానుభూతియందుండును. ఈతడు కారణ శరీరము నభిమానించును. అభిమానించుటయన—ఆకారణ శరీరమును నేనేయని సంభావించుట. వ్యష్టిగా యితడు ప్రాజ్ఞుడనియు, సమష్టిగ పరిగణింపబడిన యపుడు అవ్యాకృతుడనియు వ్యవహరింపబడును.

ప్రయోగము : అవస్థాత్రయం అనాత్మయగు బుద్ధికి సంబంధించినదియేయగుచున్నవి. అందుచే ఆత్మ యీ అవస్థలచే స్పృశింపబడదనుబోధ కుపకరించునుయీ అవస్థాత్రయజ్ఞానము.



# సృష్టికార్య విధానములు

సృష్టికార్యముల ననేకులనేక విధముల పేర్కొనిరి. అందు సురేశ్వరాచార్యుల పంచీకరణ వార్తికమునందును, శ్రీయాజ్ఞవల్క్యుని పైంగలోపనిషత్ నందును కపిలుని సాంఖ్యదర్శనమందును వివరింపబడి యున్న విషయములు మాత్రము సామరస్యముతో యున్నవి. ఏమన — ఇందు పంచభూతములు — పంచీకరణ పొంది మరల 24 తత్త్వములుగ రూపొంది ఆతత్త్వములు పరిణమించుచూ, నానాత్వమును ప్రదర్శించుచు దృశ్య మానమగుటచేత కొంతసాజాత్య భావము ప్రస్ఫుటమగుచున్నది. ఇదిగాక మరొక ఆరు విధానములుకూడ తెలుపబడి పరిశీలనా యోగ్యముగ నున్నవి.

1. పారమార్థిక దృష్టితో పరిశీలింపగల జిజ్ఞాసువులకు సృష్టి అధ్యాస వలనగలుగును గాని యదార్థముగ లేదను నొక భావము ప్రచారమున యున్నది. అనగా సృష్టి అసలు జరిగినే యుండలేదు గాని జరిగి యుండినట్లే తోపింపజేయుచున్నది — అనియే. 'జరిగియుండలేదు' అనియే లక్ష్యార్థము గనుక దీనిని 'అజాతవాదము' అనివ్యవహరించు చున్నారు. ఇది అద్వైతవాదుల అంగీకారమునకును నోచుకున్నది.

2. వ్యావహారిక భావము : ఈశ్వరుని సంకల్పమువలన జడ ప్రకృతియందు ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తి యుక్తుడగు హిరణ్యగర్భుడంత ర్యామియై ప్రవృత్తి సాగించినందున సృష్టి-సంభవించెనని చెప్పబడెను. *Matter energised by spirit causes creation.* ఇందు పదార్థము మార్పులు పొందుచుండును గనుక దీనిని పరిణామవాదమందురు.

3. శాక్తేయ విధానము : నాదము నుండి బింధువు కలుగగా అది త్రి బిందువులై, దశకమై 36 తత్త్వముల పూర్వక పదార్థముగ ప్రాదుర్భవము పొంది కార్యములు అనగ పదార్థములు ప్రభవించెనని వీరి భావము. ఇదియే 'నాదబింధు కళాకీనమోనమో' అను శాక్తసృష్టి విధానమునకు మూలము.

4. ఉపనిషద్వాణియందు : ఆత్మని ఆకాశ స్సంభూతః । ఆకాశాద్వాయుః । వాయోరగ్నిః అగ్నేరాపః । అద్భ్యఃపృథ్వీ । పృథివ్యాఓషధయః । ఓషధీభ్యోరన్నం । అన్నాత్పురుషః । అను అనుక్రమముతో సృష్టికార్యము సంభవించెనని యున్నది. అనగా ఆత్మనుండి ఆకాశము: ఆకాశము నుండి వాయువు. అందుండి అగ్నియు అగ్ని నుండి జలము — దాని నుండి పృథ్వియు తమ తమ శబ్దస్పర్శాది గుణములతో గూడి (*prematerial* తన్మాత్ర స్థాయినుండి *material* స్థాయి సంభవమై సృష్టి కార్యము జరిగెనను విధానముగ తెలుపబడినది.

5. వైయాకరణులగు కాశ్మీర శైవులకు శబ్దాన్ని స్ఫుటీకరించి తెలుపుట ప్రధాన విషయము. 'ఇంద్రుడు' అను శబ్దములో ఇ - న్-ద్-ర అను శబ్దముల కలయికవల్ల ఇంద్రుడు అను పదము పుట్టెను. కనుక శాక్తేయములో మంత్రము ప్రధానము కాగా వేదములు బ్రహ్మను శబ్దము ద్వారా అభివ్యక్తము జేసినవి. అద్వైతులకు శబ్దం (వేదము) ప్రధానము కాగా - శాక్తేయులచే ఆశబ్దముయొక్క అర్థమే ప్రధానముగ పరిగణించబడినది.

6. కపిలసాంఖ్యము : సత్త్వరజస్తమో గుణసామ్యస్థితి యగు మూలప్రకృతి నుండి మహత్, అందుండి అహంకారము అందుండి తన్మా

త్రలు (గుణరహిత పదార్థపు పూర్వరూపములు) వాటినుండి అణువులు ఏర్పడి వాటి సంకలనము వలన నామరూపములు సంభవమగు విధానము తెలుపబడినది.

7. ఇవిగాక — దృష్టి సృష్టివిధానమనియు సృష్టి దృష్టివిధానమనియు వృత్తిప్రభాకరమను గ్రంథమున విపరింపబడినవి గాని — కపిల సాంఖ్యవిధానము బహుజన సమ్మతముగ నున్నది.

8. *Relativity :* పై చెప్పిన వాటికి విషయమున కొంత వివేకము గలుగుటకు అపేక్షయను నొక పదమునున్ను ఇందు చేర్చుచున్నాను. అపేక్షయన — మరొక వస్తు తత్త్వపుటపేక్ష గావలయుననుట. సాపేక్షికతే *relativity* యనబడు చున్నది. అధిష్ఠాన చైతన్యము దప్ప మరొక తత్త్వపుటునికి నంగీకరించనప్పుడు — అపేక్షయన, పోల్చి పొందనగు జ్ఞానమునకు గాని, బాధ — *(negation* ఒకదాన్ని అపవదించి మరొక దాని యునికినే నిర్ధారించుటకు) గాని అవకాశముండదు. ఈ కిటుకు అద్వైతమను పేరులోను, 'ఏకమేవ – అద్వితీయం' అను నిర్ధారణలోనే యున్నది. అపేక్ష, అపవాదము అను ప్రక్రియల భావములు అద్వైతమునందంతర్గతముగ నున్నట్లు తెలుపును. ఇందువలననే కొందరు అద్వైత సిద్ధాంతులు ఐన్‌స్టీన్ క్రొత్తగా తెలిపిన దేమీలేదండి ! రెలేటివిటీ యంటేమన అద్వైత సిద్ధాంతమేనండీ అని యవగాహనా పాటవమును ప్రకటించుచుంటారు. ఏదో స్వల్పముగా నైననూ అవగాహనారేఖలు కొంతవెలుగు జూపువరకును అద్వైత సిద్ధాంత సూత్రములు నామటుకునాకు తగు వివేకమును గల్పించలేదు. అద్వైతమంటే పరిపూర్ణ జ్ఞానమని పేరులోనే యున్నది. *(ie) both the material and intelligent causes are in Bramhan — (c. f.) the dream is caused by me and*

*yet it is in me and my brain, being enjoyed or experienced by me only.* కనుక అద్వైత సిద్ధాంతము నవగాహన బొందుటకు *Einstein's theory of Relativity and the Unified Field theory* అనునవి లేస్సగా సహకరింప గలవు.

---

# త్రి గు ణ ము లు

సత్త్వగుణము, రజోగుణము, తమోగుణములను నవియే త్రిగుణములు. వీటి ప్రభావమువలన నివి జీవశక్తికి బంధములుగ (తాస్లగ) బంధకారకములుగ నుండుటచే గుణము లనబడుచున్నవి. అవిద్యతోగూడి మూలాజ్ఞానముగను ప్రతిష్ఠితములైనవి, పదార్థపరముగ సత్త్వరజస్తమస్సులనియు వ్యవహరింపబడుచున్నవి. మూలప్రకృతి యనబడునది యీ మూడు అంశల సామ్యావస్థయే.

ఇవి తన్మాత్ర స్థితియందున్నప్పుడు (తన్మాత్ర = అభూతముల స్వీయగుణరహితాంశ) *(A prematerial state of these primal substances)* పృథ్వి, అగ్ని, తేజస్సు, జలము, ఆకాశము అనుతన్మాత్రలుగ చెప్పబడి, ఒక్కొక్కటి ఐదు భాగములుగ పంచీకరింపబడి, వాటి 1/8 అంశలు మరల సంకలనము బొంది, పంచభూతము లనబడుచున్నవి. ఇప్పుడవి శబ్దస్పర్శ రూపరస గ్రంథము లనబడు గుణముల బొంది పూర్తిగా పదార్థ స్థాయికి వచ్చి తమ వ్యక్తిత్వమును ప్రదర్శించు తవి. ఇవియే దైవతములకు పంచముఖములుగ పేర్కొనబడుచున్నవి. ఉ॥ పంచముఖ ఆంజనేయస్వామి). *These Bhootams are the uniualent elemental ultimates* అని చెప్పుకొన వచ్చును.



**త్రిగుణములు, మరికొన్ని విశేషములు :** నానా ప్రకార ఆవిర్భావములచే పరమాత్మ తన యునికిని ప్రస్ఫుటించుచున్నట్లు, ఈ త్రిగుణములును స్థూలమగు దేహముపైనను, సూక్ష్మమగు మనస్సు పైనను వాటి ప్రభావముల ప్రసరించి తమఉనికిని ప్రకటించి తెలుపు చుండును. నిజమునకు పరబ్రహ్మమునకు మాత్రమే అన్వయింపనగు అవ్యక్తమను పదము, త్రిగుణ సామ్యావస్థయందున్న ప్రకృతికిని అన్వయించి చెప్పబడుచున్నది. ఇది సాధారణ ప్రసక్తియందుపయుక్త మగుచున్నను, తాత్త్వికదృష్టి యందొక పరమాత్మకు మాత్రమె అనువర్తనీయము; మరి ప్రకృతికన్ననో వ్యవహారికము మాత్రమే. గీత సప్తమాధ్యాయమునందలి—

శ్లో॥ భూమిరాపోఽనలోవాయుః ఖంమనోబుద్ధిరేవచ।
అహంకార ఇతీయంమే భిన్నాప్రకృతి రష్టధా॥ (7-4)

**భావము :** నా ప్రకృతి అనగా మాయాశక్తి ఎనిమిది విధములగు భేదముల బొందుచున్నది. కనుక—ఈ అష్టవిధ ప్రకృతు లను పదార్థమునకు (*matter*)సంబంధించినవేనని సుగ్రాహ్యమగుచున్నది. పదార్థమునకు కొన్ని గుణములుంటవి. (*Properties of matter*) కనుక సత్త్వరజస్తమస్సులకును భిన్నభిన్నలక్షణములుంటవి. వాటి లక్షణముల కనుగుణముగ మూడు వర్గములుగ విభజించి దెలిపిరి. అవి 14వ. అధ్యా యమున గుణత్రయవిభాగమను పేరుతో వివరింపబడినవి. ప్రధానముగ సత్వగుణము జ్ఞానకారకము; ఉద్వేగముల కుపశమనపూర్వకము నైనట్టిది. రజోగుణము స్పందనకారకము ఉద్వేగపూర్వకమునై యున్నది—కాగా—

తమస్సు స్తబ్ధశీలి, బుద్ధి మాంద్యకారకమునై యున్నది. ఈ విశేషణముల వల్ల నివి గుణములనబడుచున్నవి గాని వీనిని తాత్త్వికముగ పరిశీలించిన—నివి పదార్థచరమ రూపలేశములే. పదార్థలేశములన్న ఈభావమ్ము వాచస్పతిమిశ్రుడు తన భామతీ ప్రస్థానమున వివరించియుంచెనని చెప్పబడుచున్నది.

దృశ్యములు రూపొందుట కుపాదాన పూర్వకములే పరాప్రకృతిభూమికయందు ఈ త్రిగుణములు శక్త్యాకారమునొంది శివునియందు లీనమై 'విమర్శ' యను నామముతో ప్రసక్తమగుచున్నవి. ఈ త్రిగుణములు అనులోమదృష్టికి, శక్తియొక్క చరమఅనుద్భూత (*unmanifest*) భావములును, ప్రతిలోమ విధానదృష్టికి అపరాశక్తి రూపములని సంభావింపవచ్చును. కనుకనివి పరఽపరశక్తులకు పరస్పర సంగమస్థాయియే యగును.

14వ. అధ్యాయమునందలి చరమబోధయే అద్వైతము. గమనించండి ఈ శ్లోకభావములు.

శ్లో॥ బ్రహ్మణోహిప్రతిష్ఠాఽహ మమృతస్యావ్య
యస్యచ। శాశ్వతస్యచధర్మస్యసుఖస్యైకాన్తి కస్యచ (గీ14-27)
గుణానేతానతీత్యత్రీన్ దేహీ దేహసముద్భవాన్
జన్మమృత్యుజరాదుః ఖైర్విముక్తోఽమృతమశ్నుతే (14-20)

**తాత్పర్యము** : వికారరహితము, నాశరహితము, నిత్యము ధర్మస్వరూపము అవ్యభిచారియు అనంతుడునగు పరమాత్మకును ప్రత్యగాత్మ రూపియగు పరమాత్మకును ప్రత్యగాత్మరూపినగు నేను ఆధారమునుగదా !

కనుక ప్రత్యగాత్మరూపమగు నాకును పరమాత రూపమగు బ్రహ్మమునకును ఇంచుకేనియు భేదములేదను అనన్యత్వబోధయే పరమతాత్పర్యము. ఇదియే త్రిగుణవిజ్ఞానమునకు ప్రయోజనము.



## పదములు : అర్థములు : భావములు

ఆలయ విజ్ఞానము : ఆలయమన కదలనిది. దీనిని ఆంగ్లమున సొలిప్సిజం అందురు. ఆలయమన తెలుగులో నాక భావ సరోవరమని చెప్పుకొనవచ్చును; *A receptical of ideas or Vignanam.* కనుక నిది *A Subjective knowledge of the nature of supramental Consciousness called Eruka or awareness.* ఇందు 'ఇదం' (ఇది-దృశ్యము), యనుస్ఫురణ యుండదు. విమర్శా ప్రకాశము లలో విమర్శకు తావులేని ప్రకాశాత్మమాత్రమే యుంటుంది. *This Supra mental absolute Consciousness is the back ground of the mind and intellect.* ఇదియే నివృత్తివిజ్ఞానము. దీనికి ప్రతియోగి పదము ప్రవృత్తి విజ్ఞానము *ideational consciousness. But, Subjective knowledge of the nature of supramental consciousness or awareness is the rule for Nivrutti.*

విమర్శ : విమర్శ-ప్రకాశములనునవి శాక్తేయ పారిభాషిక పదములు. విమర్శనానాత్వమును ప్రకటించు శక్తి: ప్రకాశము కేవల జ్ఞానస్వరూపమే. శాక్తేయుల భావానుగుణముగ విమర్శాప్రకాశములకే

ఈశభావము అనగా అద్వయభావమే గలదు. కాని, అద్వైతసిద్ధాంతాను గుణ్యముగ బ్రహ్మకు మాయకును భేదభావమున్నది. మాయ ప్రత్యేక భావ రూపమున పరిగణింపబడినను, ఆ బ్రహ్మ కధీనమై యుండియు నానాత్వప్రదర్శకములగు కార్యములను స్వతంత్రముగనే జేయు చుండును. శాక్తమునందు మాయ యొక తత్త్వముగనే అంగీకరింపబడి యున్నది. అద్వైతులు అట్లంగీకరింపక—మాయ నశించి, అభావమైనప్పుడే అపరోక్షానుభూతిలభించునను నిశ్చితాభిప్రాయమును వెలువరుదు.

**ఆత్మాధిష్ఠానక భ్రమ** : ఇందు భ్రమకు ఆత్మఅధిష్ఠానము, ప్రమాత ఆశ్రయము, అధిష్ఠానమన — భ్రాంతిజ్ఞానము సృష్టమగుటకు మూలము (*source*) ఆశ్రయమననా భ్రాంతిచే నావరింపబడు పదార్థము లేక వ్యక్తి (*victim*). ఇందు ఆత్మయు నవిద్యయు భిన్నమని పరిగణించ వలయును. ఇంకను—ఆత్మనధిష్ఠానముగ జెప్పుటయందు తెలియదగిన సూక్ష్మమేమన—భ్రాంతిజన్య సర్పమునకు రజ్జువధిష్ఠానమైనను తాను నిర్వి కారముగనే యున్నవిధముననేగాని అన్యథాగాదు. కనుక అధ్యారోపము ప్రమాతవలన కల్పింపబడినదేగాని, ఆత్మ తన ఇచ్ఛాపూర్వకముగ తన యందు తానే కల్పించుకున్నట్లు గ్రహించరాదు. కనుకనిది ప్రమాతృ వివ ర్తమున కన్వయించును. కనుక నిది సృష్టి దృష్టివాద ప్రతిపాదిత భావమని గ్రహించనగును. *Atma is not self evolved by his force or will but the evolutes seem to be super imposed on Atma by the Pramata.*



# అ ష్ట మూ ర్తు లు

శ్లో॥ భూమిరాపోఽనలోవాయుః ఖంమనోబుద్ధిరేవచ।
అహంకార ఇతీయంమే భిన్నాప్రకృతిరష్టథా॥ (7-4)

*N. B.* భూతములు పేర్కొనబడి యున్నను, ఇచట అపంచీకృతములను కేవల భూతాంశలనునగు తన్మాత్రలనుమాత్రమే సంభావించి గ్రహించవలయును. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచభూతములను మనస్సుకు కారణమగు అహంకారము, అహంకారమునకు కారణమగు మహత్తత్త్వము, అవిద్యతోగూడిన నవ్యక్తము నాకు పురోవర్తినియగు ప్రకృతి (మాయశక్తి) అను ఎనిమిదిన్ని అనర్థకములగు నా ప్రకృతులు ఎనిమిదిన్నీ అపరాప్రకృతికి సంబంధించినవి. ఇవి సంసార బంధ రూపములు. ఇంతకంటే విలక్షణమగు నాయొక్క పరా=శ్రేష్ఠమైన జీవరూపమగు ప్రకృతిని దెలిసికొనుము.

ప్రయోగము : సమస్తమగు భూతములను. ఈ పరాపర ప్రకృతులు రెండును కారణమై ప్రభవించుచున్నవి. ఈ ప్రకృతులురెంటి సంయోగమువలననే ఉత్పత్తి ప్రళయములు జరుగుచున్నవి. ఈ చిజ్జడములు రెండును ఈశ్వరునియొక్క శక్తులేనని గ్రహించనగును.

మనస్సు—అహంకారము—మహత్తత్త్వము —అవిద్యతోగూడిన అవ్యక్తమును. ఇవి మాయాశక్తియొక్క భేదములు.

# పదపరిజ్ఞానము (3వ. విభాగము)

సగుణము : శుద్ధసత్వగుణముతో భాసించుస్థితి విచ్ఛిన్నమైన తత్త్వము సగుణబ్రహ్మమనబడును. ఈ తత్వమును అజ్ఞాన సంవలిత మందురు; అనగా అవినాభావసంబంధముతో కలసియుండుటనిభావము. దీనితో రజస్తమస్సులు సంసర్గము పొందినయడల అది సగుణ బ్రహ్మ యొక్క సృష్టికి కారణమగును. కనుక సగుణము అజ్ఞానసంవలితము.

సప్తవ్యాహృతులు : భూః, భువః, సువహః, మున్నగునేడు దివ్యప్రవచనములు. వీటి రూపములు శబ్దలేశములు (*Syllables*) మాత్రమే. వీటినే సప్తలోకములందురు. లోకమన—ఒకస్థాయి మానసిక స్థితియే. కనుక సప్తవ్యాహృతులున్ను ఆయా మానసిక స్థితులస్థాయీ భేదములేనని గ్రహించవలయును.

అద్వైతము : "అద్వైతమితిః నవఏకత్వం ప్రతిపాదయామః కింతు భేదం వ్యాసేధామః" (వాచస్పతిమిశ్ర). అద్వైతమన నేకత్వమును ప్రతిపాదించుటగాదు, (శక్తి శక్తిమంతులకు) భేదములేదని జెప్పుటయే అందలి అంతరంగిక శాక్తేయ ఆరాధభావము.

వివరణ-బామతిప్రస్థానములు : శ్రీహర్ష, చిత్సుఖ లనువారు తమ తత్త్వప్రదీపిక యందును, విద్యారణ్యుడును వివరణ ప్రస్థానమును వివరించి తెలిపి పూర్వమీమాంసను త్రోసిపుచ్చిరి. కర్మను వదలవలసినదనియు జెప్పిరి, కాని భామతి కర్మల నాచరించవలయుననిరి.

మహాకారణ శరీరము=సగుణేశ్వరుడు.

**తురీయము** : తురీయాతీతము=నాన్తః ప్రజ్ఞం న బహిప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం। న ప్రజ్ఞాన ఘనం। నప్రజ్ఞం। నాప్రజ్ఞమ్। .... .... .... .... .... తురీయము నాల్గవస్థానముదని చెప్పబడినను అవస్థాత్రయము కంటె కేవలము భిన్నమైనదిగాదు. ఈ యవస్థలస్థాయికి సమీపమునందున్నప్పుడది తన చైతన్యస్వరూపముతో సాక్షిగానుండుననియే భావము. తురీయమును తెలిసికొనుటకు శాస్త్రము న+ఇతి=నేతి (ఇదికాదు) అను ప్రక్రియను తెలిపినది. న బహిఃప్రజ్ఞ = స్థూలదేహాభిమానియగు విశ్వుడుగాడు నాఽన్తఃప్రజ్ఞ = సూక్ష్మ దేహాభిమానియగు తైజసుడుగాడు, న ప్రజ్ఞానఘనుడుగాడు;నప్రజ్ఞం=చేతనముగాదు;అచేతనమునుగాదు;అగ్రాహ్యమలక్షణం=(లక్షణమన, నొక గుర్తునుబట్టి వస్తురూపమును గ్రహించుట-పొగనుబట్టి యగ్నిని గుర్తించునట్లు) ఇట్లు గుర్తింపదగునేలక్షణములును ఆత్మ కుండవు—కనుకనే అగ్రాహ్యమలక్షణమని చెప్పబడినది. అందుచేత—తురీయము (అట్టి బ్రాహ్మీస్థితి) సిద్ధించినతరువాత జాగ్రత్స్వప్నసుషుప్తుల లక్షణములు తురీయస్థాయి యందలి అనుభూతులు బోయి—జీవాత్మయే పరమాత్మగ దెలియబడునట్టి యనుభూతి బొందును. ఇదియే తురీయాతీతమగుబ్రాహ్మీస్థితి అనగా—నిర్గుణ కారణ బ్రాహ్మీస్థితి, తురీయాతీత స్థితియే *The Unity Consciousness.*

**ఆత్మాశ్రయభ్రమ** : ఇంక అధిష్ఠానత్వము ఆశ్రయత్వములను రెండును ఆత్మయందే సంభావ్యములు. భ్రమ ఆత్మయందే ఉదయింప ఆత్మ తననుతానే ఆవరించుకొనును. *This consists of self evolved and self super imposed nescience, so to say it is self acquired by Bramham and self veiled by himself as well.* వికారప్రతీతిమాత్రము అన్యథా భావమునిచ్చినను స్వరూపమున నిర్వికారమే సిద్ధమై దానికి భాగము లేకయే యుండును. కనుక నిది ఆహార్యాధ్యాసయే

యగును. అనగా అధ్యాస స్వయ స్వేచ్ఛాసంకల్పముచే సంభావింపబడును. అంపపల్లి నివి సాక్షివివర్త బోధకము. ఇది వ్యష్టి సృష్టివాచ భావపోష్టిక మును యగును. ఒకనటునకు రూపురేఖలును వేషభాషలును తన సంకల్పముచేతనే అమరినట్లు.



# ఓంకారము : విశ్లేషణ వివరణము

ప్రణవమనుపేర పరమ పవిత్రభావముతో ప్రసక్తమగుచున్న పారమార్థికతత్త్వమే 'ఓం' అను శబ్ద విశేషముచే వ్యవహరింపబడు చున్నది. ఇది మూడు బీజాక్షరముల సంపుటి బీజమనశక్తి: ఇందలి ఒక్కొక అక్షరము, ఒకానొక స్థితి యందున్న ఒకానొక తత్త్వమునకు ప్రతినిధియై పరగుచున్నది. అనగా ఈమూడు శబ్దములను మూడు పారమార్థికభావములకు బీజములై విచారపరులకు, వారివారి పారమార్థిక వికాసమునకు దోహదముచేయును. ఇవి శబ్దరూప మూలకములు. ఇవి, దేహియొక్క స్థూల, సూక్ష్మ, కారణ శరీరములకును, అంపు ప్రాప్తింపమైనందిన జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలకును వాచ్య రూప మున సంబంధించియున్నవి. ఈ శబ్దత్రయముచే తెలుపబడు వాచకములు వ్యష్టి పరిగణనయందు విశ్వ - తైజస - ప్రాజ్ఞులనియు సమష్టి పరిగణనయందు విరాట్ - హిరణ్యగర్భుడు - అవ్యాకృతుడు అనియు

తెలుపబడుచున్నవి. ఇవి సృష్టిస్థితిలయములకు సంబంధించిన శక్తులకును ప్రతినిధులేగాని, జనసామాన్యము విశ్వసించునట్లు ఏదోఒక అజ్ఞాతశక్తి స్వరూపములుగావు. *Note that these do not pertain to the relm of occult powers and then proceed to enquire.*

నిత్యజీవితమునందు మానవుని అనుభవము మూడు స్థితులలో తెలియబడుచున్నది. అవి జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అని చెప్పబడుచున్నవి. వీటిలో—మన జ్ఞానేంద్రియములతో వస్తు వివేకమునుపొందుచు, కర్మేంద్రియములతో, కార్యముల నిర్వహించుచు, మనస్సులో ఆలోచనలు సంకల్పములు చేయుచుండుకాలమే జాగ్రతావస్థ యనబడుచున్నది. ఈ అవస్థాకాలములో కొన్ని అనుభవాలు మన మనస్సుపై ముద్రితములై నిద్రాణస్థితిలో అందునిలచి యుండును. ఈ అవస్థయందలి దేహాభిమానిని విశ్వుడందురు. అభిమానియన, అది నేనేనని విశ్వసించువాడు. ఇక రెండవది స్వప్నావస్థ : ఈ అవస్థయందు మనకు ప్రపంచజ్ఞానమును సముపార్జించు జ్ఞానేంద్రియములు సంకుచితములై, శక్తులు ఉడిగియుండును. లోగడ జాగ్రత్కాలములో ముద్రితములైన అనుభవముల స్మృతులు పునః ప్రభావితములై ఒక విధమగు వ్యావహారికజ్ఞానానుభూతినిచ్చును. ఈ అవస్థయందలి దేహాభిమానిని తైజసుడందురు. అంటే స్మృతిజ్ఞానసంబంధమైన అనుభవమను వెలుగును కల్పించుటచేతను, అతడు తేజో (అగ్ని భూత) సంబంధియై శరీరమునందుండుటచేతనూ తైజసుడనుపేరు కలిగినది. ఇక మూడవది సుషుప్త్యవస్థ : ఈ అవస్థయందలి దేహిని ప్రాజ్ఞుడందురు. ప్ర-యన=గొప్పగా, అజ్ఞుడు=తెలిసినవాడని ఒక అర్థము వచ్చును. ఇందు ఇంద్రియములు పూర్తిగ సంకుచితములై కార్యోన్ముఖములుగావు. మనసు కారణాజ్ఞానమున కప్పియుండును. ఐతే ప్రాజ్ఞ

శబ్దమునకు యిచట మనము గ్రహించవలసిన భావమేమన—దేహాత్మ తన స్వరూపజ్ఞానము వక్క మరేదియు నెఱుంగని స్థితి యందుండునని మాత్రమే. ఇప్పటికి దేహికి జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తియను మూడవ స్థలు గలవనియు అందందు స్థూల, సూక్ష్మ, కారణ శరీరములను మూడు విధములగు ఉపాధుల గలవనియు, ఆయాస్థితులయందు అయా ఉపాధుల నభిమానించు ఆత్మ విశ్వ, తైజస, ప్రాజ్ఞలను పేర్లతో వ్యవహరింపబడు చున్నారనియు అయియున్నది. ఇంతవరకు వ్యష్టి దేహి విషయము. మరి ఈ ప్రపంచమున నెన్నో కోట్ల జీవరాసులున్నవే, దేనికదే పక స్వతంత్ర వ్యక్తిత్వము గలదియా లేక సాటివారగు సర్వులతో సంబంధమున్నదా యని విచారించినయెడల—విశ్వమందలి శరీరములన్నియు పాంచభౌతిక ములేయనియు, సమస్త భూతములును యీ స్థూలసూక్ష్మ కారణ శరీరముల సంకలనమువలననే యేర్పడినవనియు, వీటియందలి అంతర్యామియై యుండు దేహియొక్క సహజ భావస్థితియు ఏకాత్మికముగనే యుండు ననియు శ్రుతుల తెలుపుచున్నవి. ఇందువల్లనే "సహస్రశీర్షం దేవం, విశ్వాక్షం, విశ్వశంభువం" అన్ని సర్వశరీరములయందలిగల శిరస్సులు, నేత్రములు, శ్రోత్రములు ఒకే ప్రకృతికి చెందినవనియు కనుక విశ్వము నందలి సర్వమునకును సమష్టి భావము గలదనియు నిర్ధారింపబడినది. కనుక ఇప్పుడు మనము ఈ సమష్టి తత్త్వములనుకూడా పరిశీలింపవలసి యున్నది.

*Note :* వ్యష్టి స్థూలశరీరమును విశ్వుడనియు వ్యష్టి సూక్ష్మశరీరమును తైజసుడని వ్యష్టి కారణ శరీరమును ప్రాజ్ఞుడని యుందురు.

సర్వస్థూలశరీరముల సమష్టిని (విశ్వుని) విరాట్ అని

సర్వసూక్ష్మ శరీరముల (తైజస) సమష్టిని హిరణ్యగర్భుడని
సర్వకారణ ,, (ప్రాజ్ఞ) ,, అవ్యాకృతుడనియు
తెలిసికొనవలసియున్నది.

గమనిక : హిరణ్యగర్భుడన, బంగారము గర్భితమైయున్న వాడనిగాక, హిరణ్యమన జ్ఞానమనియు, జ్ఞానకారకమగు సూక్ష్మతత్త్వము గనుక హిరణ్యగర్భుడనబడుచున్నాడనియు గ్రహింపనగును. ఇట్లే అవ్యాకృతుని విషయమున వికృతులు (*forms*) పొందక ఒకే చైతన్యము యొక్క ఆకృతియందుండువాడనియు కనుకనే అతడు ఈశ్వరాంశ యనియు గ్రహింపనగును. అంటే విశ్వ, తైజస, ప్రాజ్ఞులు జీవతత్త్వమునకును, విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతులు ఈశ్వరతత్త్వమునకును జెందినవారని భావింపనగును. అనగా మొదటి మూడు భావములు వ్యష్టికిని పిమ్మట మూడుభావములు సమష్టి స్వరూపమునకు వర్తించునవియునని భావము.

ఇంతవరకు లభించిన ప్రాథమిక జ్ఞానముతో ఓంకారమునందలి అ-ఉ-మ లను అక్షరముల భావములను సమన్వయము చేసికొన్నయెడల వాచ్యములగు అ ఉ మ లకును, వాచకములగు(చెప్పబడిన)విరాట్ హిరణ్యగర్భఅవ్యాకృతులకును గల అన్వయము మనసున హత్తుకొనగలము.

1. అ : ఏ భావములకు ప్రతినిధియన—

ఆత్మ జాగ్రదవస్థయందలి స్థూల శరీరాభిమానియైనప్పుడు ఇది వ్యష్టి విషయమున విశ్వునకును సమష్టి విషయమున (విరాట్‌నకును)నివి వర్తించును.

**2. ఉ** : ఆత్మ : స్వప్నావస్థయందు సూక్ష్మశరీరము నభిమానించి వ్యష్టిగా తైజసుడని, సమష్టిగ హిరణ్యగర్భుడని వ్యవహరింప బడును.

**3. మ** : ఆత్మ సుషుప్తియందు కారణశరీరము నభిమానించి వ్యష్టి పరిగణనలో ప్రాజ్ఞుడుగను, సమష్టి పరిగణనలో అవ్యాకృతుడుగను తెలియబడినప్పుడు అన్వయించును. కనుక తాత్పర్యమేమన: ఆత్మ జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడు అవస్థలయందు, వ్యష్టి భావముతో విశ్వ తైజసప్రాజ్ఞులగను, సమష్టిభావముతో విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతుడు అనుపేర్లతో వ్యవహరింపబడును, అ. ఉ. మ. లను మూడక్షరముల సంకేతములుగలిగి ఆపేర్లకు సంకలనాత్మకశబ్దమగు ఓం వలన ద్యోతకమగుచున్నదనియే.

ఇక వివరగ తెలిసికొనవలసినది : ప్రత్యగాత్మకు సంబంధించు వ్యష్టి స్వరూపములగు విశ్వ, తైజస, ప్రాజ్ఞులనబడు మూడు భావములకును, సమష్టి ఆత్మయగు విశ్వాత్మయు; విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతులను మూడు భావములతో తెలియబడునని, ఈ రెండు వర్గములు వ్యష్టి, సమష్టి, అను పరిగణనతో భిన్నములుగ పేర్కొనబడినవేగాని, స్వభావమునందు భేద భావములేనివేననియు గ్రహించనగును. కనుక అ. ఉ. మ లనబడు శబ్దమూలకములు (*sound elements*) స్థూల సూక్ష్మ కారణ శరీరము లనబడు దృశ్య అదృశ్యభావములతో తులనాత్మకములు గనుక ఓం అను దివ్యశబ్దముయొక్క ఉదాత్తతను పరమాత్మ వాచకముగనే గ్రహింపవలయును.

కనుక విశ్వమంతయు మూడు ప్రమాణములతో గ్రహించనగును. అవి, స్థూల, సూక్ష్మ, కారణప్రమాణములు (*Standards*). ఇందు పరి

వ్యాప్తమై అంతర్యామిగనుండు ఆత్మమాత్రము ఒక్కటే. గాఢనిద్రావస్థ లోని స్థితి ప్రమాణమును కారణరూప మందురు. అనగా 'అజ్ఞానముచే ఆవరింపబడినట్టి స్థితి' యని అర్థము. దీనిచే సూచింపబడునదేమన — భేద, భావములకు అనగా ద్వైతభావమునకు యీ అజ్ఞానమే కారణమగు ననుటయే తాత్పర్యము. ఒకవిషయమును మాత్రము మననయోగ్యముగ భావించి గ్రహించుట ఆవశ్యకము. అదేమన - ఇచట జ్ఞానమనేది ఉండ దనిగాదు. ఆ జ్ఞానమును మరుగుపరచు అజ్ఞానాంశమనొకటి గలదనియే. అలా అయితే ఆత్మ అద్వయమగుటెట్లను ప్రశ్న ఉదయించును. చూడండి అసలు మబ్బులేక మేఘమనేది ఎలా సంభవమైనదో ఆలోచించండి. సూర్యుని కిరణముల ఉష్ణశక్తివల్లనేగదా! అయినా, ఆ మబ్బే తనను సృజించిన ఆ సూర్యునే మరుగుపరచు చున్నదిగదా! కనుక అజ్ఞానమన బడేది భిన్నమగు రెండవ పదార్థముగాదు. అది పరమాత్ముడు ప్రవర్తింపగల జ్ఞానశక్తిగాక మరొక విరుద్ధశక్తి. ఈ రెండు విరుద్ధ ధర్మములకుకర్త, అధ్యక్షుడు కారణభూతుడు ఆపరమాత్ముడే గనుక, ఆత్మ, స్వరూపమునందు మాత్రము ఏకమే, అద్వితీయమే —ధర్మములందు వైవిధ్యముగానరావచ్చును. కనుకనే ఆత్మ యందు స్వగతభేదమనునది అంగీకారయోగ్యమే. ఇది శ్రీఅప్పయ్య దీక్షితులవారి అభిప్రాయము.

కనుక ఈ చర్చకు లక్ష్యమేమన ఓం! అనబడు లింగము (శబ్ది రూపమగు సూచిక) స్థూల భూమికనుండి, సూక్ష్మ దేశమునకు, అందుండి అవ్యక్తభూమికకు, అందుంచి అతీంద్రియ దివ్య స్వరూపానుభూతిని కలిగించుటకు ఉపకరించును. ఈ స్వరూపానుభూతికి లింగమే, పైన

సూచింపబడు అర్ధమాత్ర. కనుక సూక్ష్మపదార్థ నిర్మితమైన మానవుని మనస్సు (*mind stuff*) సూక్ష్మ దేశములకు పరిణతినొందు. శ్రీ అరవిందులు సూచించిన *higher mind, super mind*, మున్నగు స్థాయిల నందుకొని తుదిగా బ్రహ్మీభూతమగుటయే ఓం ! అను దివ్య శబ్దమునకు లక్ష్యము.

**1.** అ : స్థూల భావసూచకము. ఈ విశ్వమందలి నానాత్వమును, సాపేక్షిక సత్యమును (*realism*) సూచించును.

**2.** ఉ : పై స్థాయినుండి సాపేక్షిక సత్యస్థాయియందవలి దగు స్వప్నావస్థచే సూచింపబడు భూమికను దెలుపును. అనగా ఆత్మశక్తి— మనస్సు యొక్క మాధ్యమముతో తనయందే తాను యీ దృశ్యమానమగు పదార్థమునంతయును ఎట్లు గోచరింపజేయునో గ్రహింప సహాకరించును. వేదాంతశాస్త్రమున స్వప్నావస్థకు గల ప్రముఖపాత్ర ఇదియే. తానే కర్తయు తానే కర్మయు అగు టెట్లో తెలుపును. *The spirit is both the subject and object too.* ఇది గ్రహింపనివారికి నానాత్వమున, ఏకాత్మభావమనునది బోధపడదు.

**3.** మ : ఉకారము సూచించు భావము పరిణతమొందిన పిమ్మట సంభావింపనగు శబ్దమే 'మ' కారము అనగా స్వప్నస్థితిలో ప్రాప్తించు భిన్నత్వము వైవిధ్యములును ఇందు ఉడిగిపోవును. అది సత్యము నిత్యముగాని ఒకస్ఫూర్తిమాత్ర వైభవమేనని తేలిపోవును. అది అసత్య పదార్థ ఆవిర్భావమేనని నిర్ధారింపబడును. అజ్ఞాన సంజనిత పరిణామోద్భూతమనియు సుస్పష్టమగును. ఈ విషయమును గ్రహించుటకే గాఢనిద్ర

వేదాన్తశాస్త్రమున స్థానమును సముపార్జించుకొన్నది జాగ్రదవస్థయందు మనము ఇంద్రియములు అంతఃకరణముల సాయముతో తెలిసికొన్న దృశ్యమంతయు స్వప్నదృశ్యములతో తుల్యములేగాని సత్యమగు స్థాయీభావముగలవిగావనియు విశ్వసింపజేయును. ఈ విశ్వమంతయు ఆ పరమాత్మయందు తోచి స్ఫూర్తినిచ్చు మాయా విశేషమేననియు ఆ మాధ్యమొనగును. ఇట్లు స్వప్నమునందలి దృశ్యములకును అద్వైతస్థాయిలోనివగు జాగ్రదవస్థయందలి దృశ్యములకు కారణమేమంటె అసలు సత్యవస్తువగు కేవల చైతన్యముయొక్క భానము సుస్పష్టముగాక యుండుటయే. కనుక ఈవ్యావహారిక జగత్తుకు ఇందలి జీవితమునకు బీజమగునది చైతన్యముయొక్క నిజస్వరూప జ్ఞానము లేకయుండుటయేనని గ్రహించి, ఆపారమార్థిక తత్త్వసారమును అన్నికోణములనుండియు నవలోకింపవలయుననుటయే ఓంకారమునకు పరమ ప్రయోజనము. ప్రణవమనబడు నే ఓంకారమును దాని అన్నిస్థితులయందును అందందలి రూప విశేషములతో తెలిసికొని, యీ జాగ్రత్స్వప్నసుషుప్తుల కతీతమగు తురీయమనబడు శబ్దరహిత, చలనరహిత సర్వస్వతంత్రజ్ఞాన స్థాయిని పొంది లయస్థితియందును అంతర్గతముగనున్న బీజస్థితినికూడా లయింపజేసి ప్రకాశింపవలెననుటయే ఓంకారమునకు పరమార్థము.

ఈ అవస్థాభేదములు, స్థితిభేదముల గుర్తించి అహంబ్రహ్మాస్మి అనువృత్తిని, మలినరహిత, ఏకాగ్రరూపమగు చిత్తవృత్తిపై ప్రతిష్ఠించుకొని ధ్యాన యోగనిష్ఠయందు నిమగ్నమైనవానికే— గీతయందు "మమసాధర్మ్యమాగతాః" అని చెప్పిన బ్రాహ్మీస్థితి ప్రాప్తించును. కనుక అ ఉ మ లను అక్షరములు సూచించుజ్ఞానము స్థూలమునుండి సూక్ష్మమునకు అందుండి కారణమునకు అందుండి కారణరహిత (*Absolute*) కేవల

పారమార్థికస్థాయిననుభూతి బొందుటకు వలయు జ్ఞాన-విజ్ఞాన-కర్మయోగ ఉపాసనా యోగముల మాధ్యమముతో కేవలస్థితిని ప్రాప్తించుకొనవలెనని సూచించు పారమార్థికశబ్దమే ఓంకారము.

*N. B.* బ్రహ్మమునకు ధర్మములు లేవందురు—వైశేషికము భౌతికమునకు పరిమితమై యున్నదైనను గుణధర్మములులేని పదార్థముండ దని నిర్ధారించింది, నిర్గుణమైనను సత్పదార్థమునకు సద్ధర్మములుండవనిన యెడల అది అభావముగనే పరిగణించవలసివచ్చును.

ప్రణవము ప్రాణాన్ సర్వాన్ పరమాత్మని ప్రణామయతత్యే తస్మాత్ ప్రణవః (అథర్వశిఖోపనిషత్) సర్వప్రాణములను పరమాత్మ యందు లయింపజేయునది ప్రణవము.

స్వరూపము శ్రుతి॥ చత్వారిశృంగాత్రయోఽస్యపాదా ద్వేశీర్షే సప్తహస్తాసోఽస్య త్రిథాబద్ధోవృషభోరోరవతి మహోదేవోమర్త్యాగ్ం అవివేశ (తైత్తిరియం)

ప్రభావము : శ్రుతి ప్రణామయతి ఇత్యేతస్మాత్ ప్రణవః॥ జీవత్వాహంకారమును నశింపజేసి సర్వకర్తృత్వాదికమున్ను పరమాత్మదే అనుభావమును కలిగించునది ప్రణవము.

ఫలము : శ్రుతి ప్రకర్షేణనవత్వస్య హేతుత్వాత్ప్రణవం॥ నిత్యపఠనముచే నిత్యనూతనత్త్వమును ప్రసాదించునదిఓంకారము.

మాండూక్యమునందలి మొదటి 7 మంత్రములు, నృసింహ, పూర్వతాపిన్యుపనిషత్తులయందున్నవి. ఉత్తరతాపిన్యుపనిషత్‌నందు ప్రణవ

మనుగూర్చినవిషయము మాండూక్యం 8, 9, 10, 11, 12 మంత్రముల యొక్క వివరణ విపులముగనున్నది. నృసింహతాపిన్యుపనిషత్ కూడా మాండూక్యమునకు వివరణ ప్రాయమే.

1. అనుమానముచేత అద్వైతసమ్మతమగు అజాతవాదమే పరమార్థము.
2. మనః కల్పితమగు ప్రపంచసృష్టి యదార్థముగాదు, మాయాకల్పితము.
3. అద్వైతప్రకరణము - ఆకాశదృష్టాంతముతో జీవాత్మ వేఱుగలేదని -
4. అలాతదృష్టాంతముతో కల్పితమగు మనస్సుచే కల్పితమైన ప్రపంచ సృష్టి ఆభాసమేననియు నాల్గు ప్రకరణములలో బోధింపబడినది.

*Gist :* అవిద్యాకృతమును మిథ్యాభూతమును అగు యీ జాగ్రత్స్వప్నసుషుప్తి రూపావస్థాత్రయమును ప్రతిబింబభూతులగు మనయందు సంబంధముగలవానివలె నొనర్చి, బ్రహ్మము మనలననుభవింపజేయుచున్నవానివలె నున్నది. కావున నీ అవస్థాత్రయము బ్రహ్మమునందే ప్రాప్తించుచుండును. ఈజీవులును మాయాశబలిత బ్రహ్మము శుద్ధబ్రహ్మమునందే కల్పితులుగావున శుద్ధమగు బ్రహ్మమునకు నమస్కరించుచున్నాను.

విశ్వమన పంచీకృత పంచమహాభూతములు తత్కార్యాత్మకమగు స్థూల జగత్తు. ఇదియే విరాట్శరీరము.

సర్వజ్యోతిస్సులు అస్తమించినతరువాత, ఆత్మజ్యోతిస్సుచేతనే కనబడుచున్నట్టి విషయములను అనుభవించి, అపంచీకృత పంచమహాభూత తత్కార్యాత్మకమును సూక్ష్మప్రపంచమును హిరణ్యగర్భ శరీరమును, స్వప్నస్థానమును అభిమానించువాడై తైజసుడగుచున్నాడో—

ఎవ్వడు స్థూలసూక్ష్మవిభాగముచేత జాగ్రత్స్వప్నస్థానద్వయమునందు ప్రవిభక్తములైనట్టియు, ఉపాధిద్వయము ననుసరించి స్థానద్వయము

నందు చరించుటచేత కారణాత్మకమగు తనయందు లీనమైనప్పుడౌను చున్నాడో అవ్యాకృత ప్రధానుండై ప్రాజ్ఞుడగుచున్నాడో—

ఇట్లు స్థానత్రయ విశిష్టుడైన పరమాత్మయే కార్యకారణ రూపము లగు సర్వానర్థవిశేషములను ప్రమాణజ్ఞానములన పవలె నిరుపాధికు డగుటచేత నిషేధింపబడిన గుణగణములు గలిగియున్నాడు.

మంగళాచరణం 1వ. శ్లో॥ నిర్గుణమును సూచించును.

2వ. శ్లో॥ ప్రణవమునందలి మాత్రలకు ఆత్మయందలి పాదములకును ఏకీకరణమును దెలుపును.

పంచభూతములు ఒక క్రమబీజములైన న-మ-శి-వా-యలు ఓంకా రమునందు బుట్టి మరల అందే లయించవలసియున్నది. ఇంతకు కారణ మైన మాయను జయించ నీమంత్రమే ముఖ్యమగునని - లయకారకుడైన పరమ శివుడే యీ ఓన్నమశ్శివాయ మంత్రమును దక్షిణామూర్తి రూపమున నుపదేశించెను. ఓంకారము పంచభూతములకు సమష్టి రూపము. ఓంకార మునకు ఒక పంచబీజయుత సంజ్ఞాస్వరూపమును జెప్పిరి.

శ్లో॥ ప్రథమంతారకంచైవ ద్వితీయందండముచ్యతే।
తృతీయంకుండలినీ ప్రోక్తం చతుర్థం చార్ధ చంద్రికమ్।
పంచమంబిందుసంయుక్తం ఓమితిజ్యోతిరూపకం॥
న కారం కారకం చైవ మ కారం దండముచ్యతే
శి కారం కుండలీప్రోక్తం వాకారం చార్థ చంద్రికం ।
య కారం బింధు సంయుక్తం ఓమితి జ్యోతి రూపకం॥

ఓం = నిర్గుణం (న) నేను (మ) మాయాతీతమైన (శి) = శుద్ధ బ్రహ్మమును (వా) వైరాగ్యముచేత య = సర్వమును తెలియబడి ఓంకా రమునందు సర్వేంద్రియములకు రాజైన మనస్సును లయింపజేసిన బ్రహ్మను సందర్శింపగలను.

తారకము ల దండము - కుండలిని 3 అర్ధచంద్రికల బిందువు నివృత్తికల, ప్రతిష్ఠాకల, విద్యాకళ, శాంతికళ శాంత్యతీతకళ – 5 కళలు గలవు.

ఓంకారము ధర్మార్థ కామ మోక్ష ప్రదములగు అకార ఉకార మకార అర్ధమాత్రాస్వరూపములైన అవిద్యా, విద్యా, ఆనంద తురీయ పాద ములతో నొప్పుచున్నది.

అష్టాంగంచచతుష్పాదం త్రిస్థానం పంచదైవతమ్।
ఓమిత్యేవం నజానాతి బ్రహ్మణోనభవేత్సహి॥ (మహావాక్యరత్నావళి)

"అస్యైకపాద విద్యాస్యాన్నిరవిద్యా త్రిపాదభూత్"

(బ్రహ్మప్రణవార్థప్రకాశిక)

ప్రణవమునందు అకార, ఉకార, మకార, అర్ధమాత్ర స్వరూపము లగు అవిద్యా, విద్యాఽనంద, పాదతురీయ, పాదాత్మకములైన సమష్టి, వ్యష్టి, స్థూల, సూక్ష్మకారణ మహాకారణములనెడి అష్టశరీరముల యొక్క కార్యములగు జాగ్రత్స్వప్నసుషుప్తి తురీయములనెడు నాలుగవస్థలకు బ్ర. వి. రుద్ర ఈశ్వరులు నలుగురు అధిదేవతలుగ జెప్పబడిరి.

16 కళలలో 15 లోకకళలు (ప్రకృతికళ) 16వది అలోక (ప్ర కృత్యతీత) కలగా జెప్పబడినది.

జాగ్రత్స్వప్న సుషుప్తులను (బుద్ధిపరముగా) నొదలిన ఆత్మయే తురీయావస్థయనబడును. ఇది యే బ్రహ్మకు 4వ. పాదము. ఏతానిబుద్ధేర వస్థావిశేషాణి నాత్మనోఽవిక్రియత్వాత్। ఏతావిపరిత్యజ్య తురీయఆత్మేతి ప్రతిపత్తవ్యః। తత్రతురీయత్వం నామ సువర్ణ ఘన ఏదీక్షానఘనత్వమ్॥ జాగ్రత్స్వప్న సుషుప్తులు బుద్ధికిసంబంధించినవి. కనుక వానిని వదల వలెను. 4వదియ ఆత్మశుద్ధ బంగారము వంటిది.

(శంకర [illegible] దేశవిధిః)

ఆత్మ 4వది అయినను అవస్థాత్రయముకంటె భిన్నముకాదు. ఈ అవస్థలకు దగ్గరగామన్నప్పుడది తన చైతన్యస్వరూపముతో సాక్షిగా నుండుననిభావము. తురీయమునుగురించి నేతినేతి (న+ఇతి) అను ప్రక్రియ ఉపకరించును.

నబహిఃప్రజ్ఞం = బాహ్యజ్ఞానముగలది గాదను నీపదమునుబట్టి స్థూల దేహాభిమానియగు విశ్వుడుకాడు.

నాన్తః ప్రజ్ఞః = సూక్ష్మదేహాభిమానియగు తైజసుడుగాడు. నఉభయతః ప్రజ్ఞః = జాగ్రత్స్వప్నములకు మధ్యదగు కునుకుస్థితిగాదు.

నప్రజ్ఞానఘనం : ఐనను సుషుప్తియుగాదు.

నప్రజ్ఞం : ఒకవేళ చైతన్యమనుకొందురేమో అదియునుగాదు. నఅప్రజ్ఞం = అచేతనముగాదు.

పరబ్రహ్మకు జెప్పబడిన 4 పాదములవలెనే అష్టాంగంచ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతం ఓంకారం యోనజానాతి బ్రాహ్మణో నభవేత్తునః॥ (ధ్యానబిందూపనిషత్)
మాత్రలు : అక్షరములు.

ఓంకారమునందలి ధ్వనులను పాదములుగ విభజించిరి.

బ్రహ్మ 4 పాదములగు 4 అవస్థలను ఓంకారమందలి మాత్రలకు తులనాత్మకముగ భావించిరి.

## ఉ ప సం హా ర ము

శ్లో॥ శ్రియః కాంతాయ కల్యాణనిధయేఽర్థినామ్।
శ్రీ వేంకట నివాసాయ। శ్రీనివాసాయ మంగళమ్॥

శ్రీనివాసా—మంగళమ్!

శు భం భ వ తు ! !